దేశ విఖ్యాతిగాంచిన విమల్ చీరల్లో సరిక్రొత్త శ్రేణికై
విచ్చేయండి నేడే మంగళ్ దీప్ కి.




**మంగళ్‌దీప్**

కోఠీ
హైదరాబాద్
ఫోన్: 45786

**మంగళ్‌దీప్**

దాస్‌పల్లా కాంప్లెక్స్
జగదాంబ సెంటర్
విశాఖపట్నం

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజెంట్లు, ప్రకటన కర్తలందరికీ వినాయక చవితి శుభాకాంక్షలు.

–సంపాదకుడు

## పాపం ఆంజనేయులు

13 7 84 న వార పత్రికలో "పాపం ఆంజనేయులు" కథ చదివిన తరువాత ఈ ఉత్తరము వ్రాయలేకుండా వున్నాను. ఎందుకంటె ఈ రోజుల్లో వరకట్నం ఎంత వెర్రి తలలు వేస్తుందో అద్దం పట్టినట్లు చాలా సున్నితమైన హాస్యంతో, చాలా చమత్కారంగా వరకట్నం కోరే పెళ్ళి కుమారులకు, వారి తల్లి తండ్రులకు వాతలు పెట్టిన రచయిత శ్రీ తోలేటి 'మోహనరావుగార్కి నా హృదయ పూర్వక అభినందనలు.

జొన్నలగడ్డ కాశీ విశ్వనాథం, తాళ్ళపూడి.

## కథలు

27-7-84 పత్రికలో ప్రచురించబడిన (1) బామ్మగారు – మనువడు (2) "శృతి" యీ రెండ కథలు నాకు నచ్చేయి కామేశ్వరరావు, కావేరి ఒకరి నొకరు మోసం చేసుకుని వయస్సులు దాచి పెళ్ళి చేసుకున్నారు "దొందుకు దొందే" ఈ కథలో గల హాస్యం చదివేటప్పుడు నవ్వొస్తుంది. 'శృతి' కథలో గురు శిష్యు లిద్దరు తమ తప్పు తెలుసుకుని పశ్చాత్తాప పడిరి ఈ కథ కొత్త పంథాలో నడిచింది.

మరువాడ సూర్య ప్రకాశం, కాశీబుగ్గ

## రవీంద్ర భారతి ఎక్కడైనా ఉండవచ్చు

నా నవల జీవితం మైనస్ సెంటిమెంట్‌లో హైదరాబాద్‌లో బీచ్ ఉన్నట్లు నేను రాశానని ఓ పాఠకుడు ఉత్తరం రాశారు

కానీ కథ జరిగింది వైజాగ్‌లో కనుక బీచ్ అక్కడ ఉంది కనుక అలా రాయటంలో తప్పు లేదు.

ఇకపోతే "రవీంద్ర భారతి" అనేది సాంస్కృతిక కార్యక్రమాలు జరిగే ఓ థియేటర్ అనే ఉద్దేశ్యంతో ఆ పేరు వాడడం జరిగింది (రవీంద్ర భారతి అనేది ఒక్క హైదరాబాద్‌లో నే కాదు ఉన్నది)

ఫిక్సడ్ నేమ్స్, ప్లేసెస్ సృష్టించుకుని వాడుకొనే అవకాశం ఉంది గనుక వైజాగ్‌లో "రవీంద్ర భారతి" అనే పేరు వాడడం సమంజసమే!

యర్రంశెట్టి శాయి, సికిందరాబాదు

## జీవితం – సెంటిమెంట్

జీవితం మైనస్ సెంటిమెంట్‌ను యర్రంశెట్టి శాయిగారు సెక్సే తమ ధ్యేయంగా వ్రాస్తున్నారు. మరి పత్రికలో కూడా అదే విధంగా బొమ్మలు వేయడం ఆ విధంగా వేస్తేనే సీరియల్స్ చదువుతారనుకుంటున్నారేమో! శాయిగారు హాయిగా హాస్యం వ్రాయక ఎందుకట సెక్స్ వ్రాయటం? మరీ ఆడవాళ్ళను చులకన చెయ్యటం బాగా లేదు.

యు పద్మావతి, శిల్ప, ఖమ్మం




## కనుపించడు

"ఊమెన్" దివి కేగెను, మన
కామాదిరి 'కార్టూనిష్టు' కనుపించ డికన్
'మీ' 'మా' పత్రికలో టును
సామాన్యమె భర్తి సలుప సంపాదకుడా!

బాపట్ల వెంకటేశ్వర సాయి, చెరువు గ్రామం

## ధర్మపథం

ప్రతి వారం శ్రీ బులుసు వేంకట రమణయ్యగారి "ధర్మపథం" శీర్షిక మమ్ములను ఆకర్షిస్తున్నది. ఈ వారం (17.8.84) 'అసూయకు ప్రతిఫలం' వ్యాసం చాల బాగున్నది. 'ధర్మపథం'ను చదివి నేర్చుకోవలసినది ఎంతైనా వుంది

కె. వి. యన్. ఆర్. నాయుడు, నార్తు రాజుపాలెం

❋ ❋ ❋

10.8.84 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు వ్రాసిన ('ధర్మపథం' శీర్షికలో) కుంభకర్ణుని నిద్రలో కుంభకర్ణుడు "నిర్దయ"ను అడుగుదా మనుకుని, "నిద్ర"ను అడిగినట్లు వ్రాసినారు. కాని, రఘు వంశంలో " .నిర్దేవత్వేచ్ఛయా నిద్రాం కుంభ కర్ణోక వృణీతచ" అని వుంది. కుంభ కర్ణుడు నిర్దేవత్వం కావాలనుకుని తాను సేవించిన "సుర" ప్రభావం వలన దానిని "నిద్ర"గాఉచ్ఛరించాడని అంటారు. రాక్షసులకు దేవతలు శత్రువులు గదా! వారి నాశనాన్ని కోరి, తాను బ్రహ్మ వలన ఆ నిద్రాదేవిని అహ్వానించుకున్నాడనీ అంటారు.

తరువాత, వ్యంగ్య చిత్రకారులు శ్రీ ఊమెన్‌గారి మరణం నిజంగా ఆంధ్రపత్రిక వార పత్రికకు, పాఠకలోకానికి తీరని లోటు ఈవారం ఆయన కార్టూన్లకోసం చూసిన నా కళ్ళు అదే ప్రదేశంలో ఆయన మరణ వార్తను చూసి అశ్రు పూరితాలయ్యాయి

వి. వి. రంగాచార్యులు, గుంతకల్

## మనవి

సరాగమాల 25లో (24.8.84 సంచిక) కొన్ని అచ్చు తప్పులు దొర్లినవి. వాటినీ విధంగా చదువుకొమ్మని ప్రార్థన.

"భక్తి అన్న పదాన్ని ఒక్క మారూ వాడలేదు జయదేవుడు."

"ప్రౌఢకామినుల జఘనవనాలలో"

–వి. ఎ. కె. రంగారావు.

(66వ పేజీ చూడండి)


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభు ప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

శుక్రవారం : 7-9-'84
శ్రీ రక్తాక్షినామ సం భాద్రపద శు ద్వాదశి

సంపుటము 77 : సంచిక 1

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 1-80 |
| ఆరు మా సాల చందా | రు. 46-80 |
| పోస్టల్‌లో ఏడాది చందా | రు. 101-40 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక



శ్రీ నందమూరి తారక రామారావు



శ్రీ నాదెండ్ల భాస్కరరావు

# ఎదురు చూడని పతనం

శ్రీ నందమూరి తారక రామారావు పతనం ఎదురు చూడని విధంగా, అతి వేగంగా జరిగింది. ఆయన అమెరికా సంయుక్త రాష్ట్రాలలో గుండె ఆపరేషను చేయించుకుని దేశానికి తిరిగి రాగానే ఆయన పార్టీలో చీలిక, తిరుగుబాటు వచ్చాయి. శ్రీ నాదెండ్ల భాస్కరరావు తమకి వంద మందికి పయిగా శాసన సభ్యుల మద్దతు ఉందని గవర్నరు శ్రీ రామ్‌లాల్‌కి చెప్పారు. (దీనికి ముందు ఆయన రాజీనామా- శ్రీ రామారావు చేత ఆయన బర్తరఫ్ జరిగాయి.) శ్రీ రామారావు తమకే ఎక్కువ బలం (నూట అరవయి ఎనిమిది మంది శాసన సభ్యుల మద్దతు) ఉందని అన్నారు. ఏదో ఒక విధంగా రెండు పక్షాల బల ప్రదర్శనలూ జరిగాయి. తమ మెజారిటీని శాసన సభలో తేల్చుకుంటామని శ్రీ రామారావు అన్నారు కాని మాజీ హిమాచల్ ప్రదేశ్ ముఖ్యమంత్రీ, శ్రీమతిగాంధీ పార్టీకి చెందినవారూ అయిన గవర్నరు శ్రీ రామ్‌లాల్ ఒప్పుకోలేదు. శ్రీ భాస్కరరావుకే తెలుగుదేశం పార్టీలో అధిక బలం ఉందని తాము నిర్ణయించామని శ్రీ రామారావుని రాజీనామా చెయ్యన్నారు. శ్రీ రామారావు అంగీకరించకపోతే గవర్నరు ఆయనని డిస్మిస్ చేశారు. ఆ తరువాత శ్రీ భాస్కరరావు ముఖ్యమంత్రి అయ్యారు. శ్రీ రామ్ లాల్ పాత్ర బాగా విమర్శకి గురి అయింది. శ్రీమతి గాంధీ పద్ధతులని పరిశీలిస్తూ



గవర్నరు శ్రీ రామ్‌లాల్

వచ్చినవారికి మాత్రం ఆశ్చర్యం కలు లేదు. ఆమె తమ పార్టీకి చెంది, తమ విధేయలుగా ఉండే వ్యక్తులనే ముఖ్య మంత్రి పదవి నుంచి తొలగిస్తు ఉంటారు. కొంత కాలంగా తమ విమర్శిస్తున్న శ్రీ రామారావుని ఆ తమకి అనుకూలంగా ఉన్న సమయా చూసుకుని పడగొట్టారు. పడగొట్టట అనేది భారత దేశంలో మామూ అయిపోయింది. కేంద్రంలో ఉన్న వా రాష్ట్రాలలో ఉండే వారినీ, రాష్ట్రాల ఉండే వారు ఇతరులనీ (ఆంధ్రప్రదేశ్ జిల్లా పరిషత్‌లలో వారిని సయిత పడగొట్టటం ఒక పద్ధతి అయిపోయిం పార్లమెంటరీ ప్రజాస్వామ్యం భార దేశానికి పశ్చిమ యూరోపు నుంచి సం మించిన వ్యవస్థ. ఇది ఇక్కడ ఇంకా బా వేళ్ళు పాతుకోలేదు. ఈ వ్యవస్థ బలపరచవలసిన వారే దానిని బలహీన చేస్తున్నారు. ఇంకొక విషాదకరమయి వాస్తవం ఏమిటంటే, ఈ దేశంల అక్రమాలకి పాలుపడిన వారినే వోటరు ఎన్నికలలో విజయాల ద్వారా గౌరవిస్తు న్నారు.

# డబ్బు పిచ్చి వాళ్లు

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

భారతదేశంలో పని చేస్తున్న విదేశీ శక్తులన్నిటి-
ోనూ విదేశీ ధనమే బలవంతమయినది. ఈ సంగతి
పరించి శ్రీమతి గాంధీ ఎప్పుడూ చెప్పరు. ఈ విదేశీ
నమే చౌహాన్‌లనీ, ధిల్లాన్‌లనీ ప్రముఖులని చేస్తూ
ంటుంది; ఈ విదేశీ ధనమే కీ. శే. భింద్రన్ వాలే-
ాంటి పల్లెటూరి బయితులని రాక్షసులుగా
ారుస్తూ ఉంటుంది. దీనిని గురించి శ్రీమతి గాంధీ
ందుకు చెప్పరు? ఎందుకంటే దానివల్ల ఎక్కువ
యోజనం పొందేది ఆమె, ఆమె పార్టీయే కాబట్టి.
ంజాబు మీద వెలువరించబడిన "తెల్ల కాగితం"
దేశీ ధనాన్ని గురించి మౌనంగా ఉంది. ఎందుకు?
ందుకో పయిన చెప్పాను కదా! విదేశీ ధనం కావల-
న వాళ్లు కేవలం ఖలిస్తానీలు మాత్రమే కాదు....

విదేశాలలో ఉండే సిక్కులు చాలా ధనవంతులు.
ందుకనే కాబోలు వారిలో కొందరు "పంజాబుని
ము కొనేస్తాము" అనటం మొదలు పెట్టారు.
లాంటి మాటలు చాలా కాలంగానే
నపడుతున్నాయి. కాని అందరూ "ఇదొక జోకు!"
నుకునే వాళ్లు. 1980లో నాకు మొదటిసారిగా
లిసింది– వీళ్లు జోక్ చెయ్యటం లేదు,
రియస్‌గానే మాట్లాడుతున్నారు అని. నిజంగానే
మతి గాంధీతో బేరం కుదుర్చుకోవచ్చునని వాళ్లు
మ పడ్డారు. వాయిదాల మీద ఇంత డబ్బు కడితే
న్ని ఏళ్ల తరువాత కాంగ్రెసు (ఇందిర) వాళ్లు
ంజాబులోని విస్తరి మీద వడ్డించి అకాలీలకి
స్తారని వాళ్లు కలలు కన్నారు. విస్తరి కాకపోతే
ఏడి కంచం అనుకోండి. అకాలిస్తాన్ తర్వాత
లిస్తాన్ – దోహదాలు కల్పించేందుకు డబ్బు,
యుధాలు!

ఇదొక పిచ్చి, కాని డబ్బు ఎక్కువగా ఉంటే పిచ్చి
ూడా మంచిగానే కనపడుతుంది. డబ్బు సంపాదన
సమే కదా వేల కొద్దీ సిక్కులు బ్రిటన్‌కీ, ఇతర
ూరోపు దేశాలకీ వెళ్లారు? వాళ్లకి ధనమే
ధానం. నేను 1968లో ఇంగ్లాండుకి వెళ్లినప్పుడు
క్కులు పసుపు బట్టలతో, కూజాలతో దిగు-
న్నారు హీత్‌రో విమానాశ్రయంలో. పది సంవత్స-
ల తర్వాత వాళ్లలో కోటీశ్వరులు అవతరించారు.
సారి ఒక డబ్బు ఉన్న సిక్కుని ఇంగ్లాండులో ఒక
ర్టీలో కలిసాను. ఆయన అన్నాడు కదా: "మంత్రి
్గంలో స్థానం కొనుక్కోగలను నేను!" అని. ఏమిటి!
టన్‌లో - పార్లమెంటుల తల్లి కల దేశంలో మంత్రి
్గంలో స్థానాలు అమ్మకానికి వచ్చాయా? అను-
్నాను నేను ఆశ్చర్యపడుతూ. "మంత్రివర్గం అంటే
రత దేశం ప్రభుత్వం యొక్క మంత్రి వర్గంలో.
ఇదంతా స్వరాజ్‌పాల్ స్వరంలో కొందరు పాడే పాట.
తేలికగా ధనం వస్తే, దాన్ని ఎలాగ కర్చు పెట్టాలో
తెలియకపోతే వచ్చే మాటలు.

ఇదంతా అప్పుడు - ఈ మధ్య నేను మళ్లీ బ్రిటన్
వెళ్లినప్పుడు నాతో అన్నారు 'కొందరు- ఇక్కడ
భారతీయులలో కనీసం 50 మంది కోటీశ్వరులు
ఉన్నారు. వారిలో సుమారు అర డజను మంది మరీ
సంపన్నులు, మొత్తం తీసుకుంటే మూడింట రెండు
వంతులు సిక్కులే వీళ్లలో, అని. బ్రెస్సెల్స్,
ఆమ్‌స్టర్‌డామ్, లండన్‌ల మధ్య తరుచు తిరిగే ఒక
కోటీశ్వరుడితో నాకు పరిచయం అయింది. ఆయనది
పాలపొడి, వెన్న డబ్బాలలో వేసి అమ్మే వ్యాపారం.
ఇందులో కొంత భాగం భారత దేశం చేరుకుంటూ
ఉంటుంది. ఆయనలాంటి సిక్కులు మరి కొందరిని
కలుసుకున్నాను. ఒక్కొక్కరికి 10కోట్ల రూపాయల
ఆస్తి (కనీసం) ఉందని విన్నాను. అందరికీ కొత్త
ఢిల్లీలో మంచి పరిచయాలు ఉన్నాయట.
ఒకాయన అన్నాడు- భారతదేశాన్ని ఏలే రాజ
కుటుంబం యొక్క కోడలు మా చుట్టం, అని.

వాళ్లంతా విచిత్రంగా మాట్లాడారు. భారత దేశం
పని ఖాళీ, ముక్కలయిపోతోంది. ఏదయిన
చెయ్యకపోతే సిక్కులకి ముప్పు. భారత దేశం
భూగోళ పటం మీద నుంచి పంజాబు మాయం
కాగలదు- అనే వాళ్లు. ఇవన్నీ పిచ్చి వాళ్లు మాట్లాడే
మాటలు. అందుకనే నాకు ఇంకా గుర్తు ఉంది.
"భారత దేశం ముక్కలవుతోందని ఎవరు చెప్పారు
మీకు?" అని అడిగాను.

"ఒక పత్రికలో చదివాను," అన్నాడు ఆయన.

"ఏ పత్రికా?" అని నేను ప్రశ్న వేశాను.

"ఏదో పరిశోధన సంస్థ వెలువరించిన ఒక పరిశోధన
పత్రం!"

అంతకన్నా చెప్పలేదు ఆయన. ఇదంతా వట్టి
పిచ్చే కాని ఆయనలాంటి మనుష్యులు దానినే
నమ్ముతారు. ఆ పరిశోధనా సంస్థ వెలువరించిన
"కాగితం" ఏ అమెరికా గూఢచారి సంస్థో, రష్యా గూఢ-
చారి సంస్థో తయారు చేయించి ఉంటుంది (డబ్బు
సహాయం చేసి అయినా వాళ్లకి అదే వేదం. భారత
దేశంలోని కంపెనీలన్నిటిలోనూ పెద్దదయిన దానిని
తీసుకుంటే దానికన్నా ఎక్కువ ఆస్తే ఉంటుంది ఈ
సిక్కులకి. చెప్పాను కదా, వాళ్లు డబ్బు
మనుషులని. అందు చేత "కొనేస్తా"మంటూ
ఉంటారు అన్నిటినీ. అయితే భారత దేశాన్ని
కొనుక్కోవచ్చునన్న సూచన వాళ్లకి ఎవరు చేశారో
నాకు తెలీటం లేదు. బహుశ, కొందరు అకాలీలు ఈ
పని చేసి ఉంటారు! డబ్బు పిచ్చ పట్టుకున్న వాళ్ల
పిచ్చిని కుదర్చటం కష్టం. "వీళ్ల పిచ్చ భారత
దేశంలో కొందరికి సోకితే?" అనుకుంటూ వెళ్లి-
పోయాను నేను ఆ పార్టీ నుంచి. "సోకితే గొడవ
తప్పదు కదా!" అనుకున్నాను. అంత పనీ అయింది.
"సత్‌శ్రీ అకాల్" అనే లోపలే అంత పనీ జరిగింది.

బంగారు గుడిలోకి సైనికులు ప్రవేశించిన తర్వాత
ఇంగ్లాండు వెళ్లాను నేను. అప్పుడు కలుసుకున్న
సిక్కులని కలుసుకోవటానికి ప్రయత్నించాను.
వాళ్లు దొరకలేదు. పనిగా వున్నారు, లేదా
ఊరేగింపులలో పాలుగొంటున్నారు! కాని ఎలాగో ఒక
కోటీశ్వరుడిని పట్టాను. (ఆయనే భారత దేశంలో తన
స్నేహితుని గురించీ, తన స్నేహితులు ఆ దేశాన్ని
కొనెయ్యటాన్ని గురించీ నాకు చెప్పిన పెద్ద మనిషి).

"మీ స్నేహితులు నిలబడలేకపోయారు," అన్నాను.
"ముక్కలయిపోయింది భారత దేశం కాదు, మీ
అకాలీలూ, మీ అకాలీ తఖ్తానూ....."

ఈ దెబ్బతో ధన మదం కొంచెం తగ్గి ఉండాలి
వాళ్లకి. సిక్కులలోనే కాదు. ఇతర అల్ప సంఖ్యా-
కులలో కూడా ఈ డబ్బు పిచ్చి తగ్గి ఉండాలి.
అలాంటి వాళ్లకి భారత దేశం మీద విశ్వాసం లేదు.
ఈ దేశం ఇతరుల ధనం మీద జీవించదని వాళ్లకి
అర్థం కాదు. సి.ఐ.ఏ.లూ, కె.జి.బి.లూ ఈ దేశాన్ని
ఏమీ చెయ్యలేవని వాళ్లకి తెలీదు. ఈ దేశం
నాయకులు ఎంత నాసి రకం వాళ్లయినా దేశానికి
ముప్పు లేదని వాళ్లు గ్రహించ లేదు. ఎవరు ఎంత
డబ్బు పోసినా ఈ భారత దేశానికి భయం లేదు.
ఇదంతా ఎందుకు రాస్తున్నాను నేను? నేనూ ఒక
భారతీయుడినే కనుక నా దేశం అమ్ముడుపోదు
కనుక...... □

# వివిధ రూపాల వింత వింత వినాయకులు!

తొలి పూజలు అందుకొంటున్న గణపతికి చాలా పేర్లు ఉన్నాయి. అధికారాన్ని బట్టి కొన్ని పేర్లు వస్తే, మరి కొన్ని ఆకారాన్నిబట్టి ఏర్పడినవి. గణాలకు అధిపతి, కాపడల వలన గణపతి, గణాధిపతి అనే పేర్లు వచ్చాయి. లంబోదరుడు, గజాననుడు మున్నగు పేర్లు ఆకారాన్నిబట్టి వచ్చాయి. కొన్ని చోట్ల శిల్పాచార్యులు తమ శిల్పకళా నైపుణ్యాన్ని చూపిస్తూ వివిధ రీతులలో గణపతిమూర్తులను మలచేరు. అక్కడివారు ఆయనకో పేరుపెట్టిపిలవడం మొదలుపెట్టారు.

ఇప్పుడు మనం కొన్ని ప్రదేశాల్లో ఉన్న గణపతి మూర్తులం పేర్లను తెలుసుకుందాము.

ఒరిస్సాలో ఐదు ముఖాల వినాయక విగ్రహం సింహారూఢుడై ఉన్నట్లు ఉండట. అచ్చట వారు


"ఆసీన గణపతి" (భువనేశ్వర్)

అతనిని హేరంబ గణపతి అంటారట.

రాయవెల్లూరులోని ఒక దేవాలయం కల్యాణ మంటప స్తంభంపై ఒక వినాయక విగ్రహం చెక్కబడి ఉందట. అతని చేతిలో వెన్నముద్ద ఉన్నదట. అందుచే నవనీత వినాయకుడని ఆ ప్రాంతం వారు అంటారు.

బాల గణపతిని తల్లిదండ్రులు లాలించినట్లు ఎన్నో కథలు ఉన్నాయి. కంచిలోని సత్యవ్రతేశ్వరస్వామి ఆలయంలో నాగరాజా బాల గణపతిని లాలించడానికి పొత్తిళ్లలో పెట్టుకోడానికి నాగినికి యిస్తున్నట్లు చెక్కబడియుంది. దీన్ని ఇచ్చటివారు బాల గణపతి అని పిలుస్తుంటారు.

బేలూరు, హలిబీడ్ దేవాలయాల్లో నాట్యం


విఘ్ననాయకుడు (ఫోటో : యడవిల్లి సుధాకర్)

చేస్తున్న వినాయక విగ్రహాలు చెక్కబడి ఉన్నాయి. దీన్నిబట్టి వినాయకునికి నాట్య విద్య కూడా వచ్చినట్లు తెలుస్తోంది. అందుచే ఆ గణపతిని నాట్య గణపతి అని పిలుస్తుంటారు.

చాళుక్యులు తమ రాజధానియైన వాతాపిలో గణపతి విగ్రహం చెక్కించుకున్నారు. ఆ గణపతికి వాతాపి గణపతి అని పేరు పెట్టారు. నేడు ఆ వాతాపి గణపతి కంచిలో కనిపిస్తుంది.

నాట్యగణపతి



తిరుచునాపల్లి, తంజావూరు మున్నగు ప్రాంతాలలోని వినాయక విగ్రహాలను అలంపురి వినాయకుడు అని పిలుస్తారు.

శుచీంద్ర దేవాలయంలో గణపతి ఆడరూపంలో చెక్కబడి వుంది. అందరూ ఆ గణపతిని ఆడపతి అని అంటుంటారు.

శ్రీశైల పశ్చిమ ద్వారం అయిన అలంపురంలోని బ్రహ్మేశ్వరాలయంలో ప్రదక్షిణం చేసే గుడి గోడలో ఇసుకతో చేసిన వినాయక విగ్రహం ఉంది. రససిద్ధుడైన శిల్పి కొన్ని రకాల పసరులతో ఆ విగ్రహం తయారు చేయుటచే దానిని రససిద్ధి వినాయకుడని అంటారు.

జావాలోని గణపతిని కాపాలిక గణపతి అని, నేపాల్‌లోని గణపతిని రక్తగణపతి అని, టిబెట్టు-


దేవీ సహిత గణపతి (కాళహస్తి)

లోని గణపతిని బుద్ధగణపతి అని, బృహదీశ్వరాలయంలో నాట్య గణపతి, టెంకాశీలో లక్ష్మీ గణపతి అని, శ్రీశైలంలోని గణపతిని సాక్షి గణపతి, చిదంబరంలో సింహ వాహనుడై పంచముఖాలు గల గణపతిని పంచముఖ గణపతి అని, కాశీలోని గణపతిని దుండి గణపతి అని, హంపీలోని గణపతి విగ్రహాలను శెనగగింజ, ఆవగింజ గణపతులని పిలుస్తారు.

ఇన్ని వినాయకులు ఉన్నా కన్యాకుమారి జిల్లాలోని కేరళపురంలో ఉన్న వినాయకునిదో విచిత్రం. ఆరు నెలలు నల్లగా ఉంటే మరో ఆరు నెలలు తెల్లగా ఉంటుంది.

—రాయప్రోలు వామన మూర్తి

# సులభంగా వంటచేయవచ్చు, శుభ్రపరచవచ్చు, జాగ్రత్త చేసుకోవచ్చు.

ప్రఖ్యాతి గాంచిన నాన్-స్టిక్ కుక్‌వేర్

# 'నిర్‌లెప్'




## 12 నెలల గ్యారంటీ

నిర్‌లెప్ ఎన్నో విధాల అద్భుతమైన రీతులలో ఉపయోగకారి. అది చూడచక్కనిది మాత్రమే కాదు – అతి తక్కువ నూనె; తక్కువ ఇంధనంతో వంట సమయాన్ని ఆదా చేస్తుంది కూడా.

చెయినీస్ వాక్; ఫ్రైప్యాన్; ఫ్లాట్ గ్రిడిల్; సాస్‌ప్యాన్ మరియు శాండ్‌విచ్ టోస్టర్ ఇవి అన్నీ మృదువైన సిల్‌విటోన్ ముగింపు గల 'టెఫ్లాన్ కోటెడ్' నిర్‌లెప్‌లో లభిస్తాయి.

IS:1660

ISI

19000

**NIRLEP** ®

NON-STICK COOKWARE




ఆంధ్ర ప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు



**మహావీర్** ఎంటర్‌ప్రైజెస్, తిలక్‌రోడ్, హైద్రాబాద్ - 1

PH 221198/34819

వేసవికాలం వస్తోందంటే నాకు భయం వేస్తూ వుంటుంది. నగరంలో వుండే ఎండకు యపడికాదు. విజయవాడలో ఎండలు అయిదు ంవత్సరాలు భరించాను. కాని ప్రస్తుత భయం నిగురించి కాదు. ఈ మహానగరాన్ని హూసేందుకు ఎంతోమంది వస్తుంటారు. ారందరికీ మా యిల్లు పునరావాస కేంద్రం... రణాలయం. నగరంలోని చారిత్రాత్మక పదేశాలు, వింతలు చూడటం ఒక వంతయితే, ుక్కడే వస్తువులు చవకని కొనుక్కునేవారు ంరికొందరు. ఈవిధంగా మా స్నేహితులు, ంధువులు మా యింట్లో పీఠం వేస్తూ ంటారు. వీరందరికీ డబ్బు సాయం కూడా ాయవలసివస్తోంది అప్పుడప్పుడు. ఆ డబ్బు ా చేతికి వచ్చేందుకు ఎన్ని నెలలు పడుతుందో ెనెప్పుడూ గుర్తుంచుకోను. నా దగ్గిర ేకపోయినా, అప్పు తెచ్చయినా యివ్వటం ాకున్న చెడ్డ అలవాట్లలో ఒకటి...

ఇది నగరానికి వచ్చిన నా పుష్కరకాల నుభవం.




అయిదేళ్ళు విజయవాడలో పనిచేసినప్పుడు ంరో సమస్య, ఇబ్బంది వుండేది. నేను రైల్వేలో నిచేస్తున్నానని, నా చేతులమీదుగా దేశంలో క్కడికైనా రిజర్వేషనులు యిట్టే చేయించుకో చ్చు అనుకొనేవారు మా బంధువులు. నాకున్న ంధువర్గంలో చాలామంది ఢిల్లీలోనే పనిచేస్తు న్నారు. వాళ్ళు యిళ్ళకు వెళ్ళి, తిరుగుప్రయాణం ోసం నాకో కారు ముక్క రాసిపారేసేవారు — ల్లీకి రిజర్వు చేయమని. ఈ పెద్దమనుషులు బ్బు ముందర పంపరు. మరికొందరు పయాణం రెండు మూడు రోజుల్లో వుందనగా బ్బు ఎం. ఓ. చేసేవారు. అప్పుడు నా పరిస్థితికి నే విచారిస్తుంటాను. కాకిలా తిరిగేవాడిని, ాళ్ళకు బలపం కట్టుకుని.

ఎల్డీసీ ఉద్యోగంనుంచి, ప్రస్తుతం చేస్తున్న మూడీసీ ఉద్యోగంలోకి మార్పు నాకెంతో ుపశమనం కలిగించిందనుకున్నాను... ఇదీ ా పరిస్థితి. నా గ్రహచారం, యిలా మారిపో ుందని నేనెప్పుడూ అనుకోలేదు.

కాని ఎవ్వరికీ నామీద సదభిప్రాయం లేదు. ందైనా ఉపకారం కోసం వారిని ఆశ్రయిస్తే ముఖాలు చాటేసుకునేవాళ్ళే !

ఏదో వ్రాయబోయి మరేదో వ్రాస్తున్నా ేమో !

వారం రోజుల క్రితం సత్యమూర్తి ఉత్తరం రాసేడు. అతను నా తోడల్లుడు. అనకాపల్లిలో రైల్వేలో గూడ్సు క్లార్కుగా ఉద్యోగం. నాకతను తోడల్లుడు కాకముమునుంచే తెలుసు. ఓ విధంగా నా పెళ్ళికి మూలం అతనే అని చెప్పాలి... సత్యమూర్తి మంచి స్టేషన్లలోనే పనిచేస్తున్నాడు. బాగా సంపాదిస్తున్నాడు. కాకినాడలో రెండంతస్తుల భవనం కట్టేడు. అతనికి ఆరుగురు పిల్లలు. అటు మూడు. ఇటు మూడు... అటు మూడు అంటే కొడుకులు — మేజర్లయ్యారు. ఇటు మూడు అంటే ఆడపిల్లలు పెద్దవాళ్ళు కాని చిన్నవాళ్ళు.

సత్యమూర్తి గతంలో ఎప్పుడూ నగరానికి రాలేదు. అందుకని ప్రస్తుతం భార్యతో వస్తున్నాడు— ముగ్గురాడపిల్లలిని తీసుకొని. ఇది మూడేళ్ళ నుంచి జరుగుతున్న వ్యవహారం. ఇప్పటికి సానుకూలం అవబోతోంది. అయిదు తలకాయలను పదిహేను రోజులపాటు, ప్రస్తుతం ధరలతో చూడాలంటే మాటలు కాదు, కేవలం జీతం మీదే ఆధారపడే నాలాటివారికి. అతను వుత్తరం నాకు షాక్ కలిగించింది.

ఎవరైనా రావచ్చు... మూడు నాలుగు రోజులుండవచ్చు. ఆ మాత్రం పెట్టగలను, అప్పు చేయకుండా. వారికి వేళప్రకారం కాఫీ టిఫిన్లతోపాటు భోజనం ఏర్పాట్లు చేయటం సమస్య కానేకాదు. కాని వారితోపాటు నన్నూ ఆఫీసుకు సెలవు పెట్టి వారితో రమ్మంటారు. ఫలితంగా నాకు సెలవు వృధా. ఆఫీసులో పని పేరుకుపోవటం... నన్ను తోడు రమ్మనేది వారి



# వచ్చింది

## భమిడి వెంకటేశ్వర్లు

స్వార్థం కోసమే ! జేబులో డబ్బు తీయనవసరం లేదని... ఈ విధమైన టాక్సు మరో విధమైన ఎత్తు... అనుభవం...

చాలా మంది మనస్తత్వం — మా యింటి కొస్తే మాకేం తెచ్చావ్... మీ యింటికొస్తే మాకేం పెడతావ్ ? అన్నట్లుగా వుంటుంది, ఎందుకో !

ఉత్తరం చూడగానే శ్రీమతి ముఖం విశాలంగా వ్యాపించింది-- అక్కగారితో పదిహేను రోజులు కాలక్షేపం చేయవచ్చునని !

''ముందే చెప్తున్నాను... వాళ్ళతోపాటు నన్నూ తిరగమంటే నేను తిరగను. అసలే మన ఆర్థిక పరిస్థితి బాగోలేదు. ప్రతి ఏడూ ఏవో యిబ్బందులే ... పాత అప్పు తీరుతోందనగానే కొత్త అప్పు కోసం అన్వేషణ ! మనకి పెళ్ళయి పుష్కరం అయింది కదా, మనం ఎవరి కొంపకైనా వెళ్ళి విస్తరి వేసామా ?'' అన్నాను.

''బాగుంది, మీకు ఇరవైనాలుగ్గంటలూ ఆఫీసు. నిజానికి ఆఫీసుకే పుస్తె కట్టనట్లుంది. మనం సిటీలో వున్నాం కాబట్టే వస్తారు ... వాళ్ళకి మాత్రం డబ్బు వృధాగా ఖర్చుపెట్టుకోటం సరదానా, తెలియకనా ?'' అంది శ్రీమతి కోపంగా.

''మీ ఆడవాళ్ళు సరిగా ఆలోచించరు. చెప్తే వినిపించుకోరు. మన యింట వాళ్ళందరూ రైల్వే వాళ్ళే...ఫ్రీగా చెక్కే ఎక్కడికైనా. కాని మనం ఎంత ఖర్చుపెట ఆలోచించావా? అయినా మనం వెళ్ళాలనుక వుండగానే ఎవరో ఒకరు వస్తున్నట్టుగా ఉ రాస్తున్నారు. వాళ్ళని వద్దని ఎలా చెప్ప అందుకే మనం కొంపలో కూర్చుని వచ్చే వారికి మర్యాదలు చేసిపెడుతున్నాం...'' అ

''ఇంతకీ ఏమంటారు ?'' విసురుగా శ్రీమతి.

''అనేందుకేముంది నేను సెలవు పెట్ట వాళ్ళతో తిరగను. బట్టలు బహుమతులు పూరుకోను. అప్పుచేసి బాధపడటం యిష్టం లేదు. నాకు మీ బావలాగ మావ వచ్చే ఉద్యోగం కాదు. ఇటువంటి గొప్పలక రేపు బాధపడేది మనం. మన కోసం ఎ బాధపడరు. అది గుర్తుపెట్టుకుని ప్రవర్తిం

''ఈసారికి నా మాట వినండి. గౌరవం నిలబెట్టుకుందాం'' అంది శ్రీ తన ధోరణి కొనసాగిస్తూ.

ఏం చేస్తాను ? అతిథుల కోసం అ వందలు అప్పుచేయాలి? ఎవరికెయ్యాలి గే ఆలోచనలు ముసురుతున్నాయి నన్ను.

* * *

తెల్లవారు ఝామున నాలుగ్గంట లేపింది శ్రీమతి.

7—9—84 ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక

"అప్పుడే తెల్లారిపోయిందా ?" అన్నాను బద్ధకంగా.

"ఇంకా తెల్లవారలేదు ... ఈ వేళ వాళ్ళు వస్తున్నారుకదా ... స్టేషనుకెళ్ళరూ !" అంది శ్రీమతి.

"చచ్చాన్రా దేవుడా ... వాళ్ళు సిటీకి రావటం నా ప్రాణంమీదకొచ్చి పడింది. స్టేషను కెళ్ళి తీసుకురావటానికి వాళ్ళేమీ చదువుకోని వాళ్ళుకాదుగా ? మన యిల్లు వారికి తెలియక పోయినా, అడ్రస్సు తెలుసు ... నోట్లో నాలుక వుంది. ఆటోలో కూర్చుంటే యింటి ముందర దిగచ్చు. నిద్ర పోగొట్టుకొని నేను వెళ్ళటం దేనికి !" అన్నాను.

"లేవండీ ... ఆఫీసుకెళ్ళి నిద్రపోదురుగాని, ముందు లేవండి" అంది ఆమె.

ఆఫీసుల్లో ఉద్యోగులు పని చేయరని, నిద్రపోతారని, కాంటీనుల్లో—చెట్లకింద కబుర్లు చెప్పుకుంటారని శ్రీమతితోపాటు పిల్లలుకూడా అంటూవుంటారు.

"నాన్నా, ఆఫీసులో నిద్రపోవటంలేదా, తొమ్మిది కాకుండానే మంచం ఎక్కేస్తున్నావ్!" అంటారు మా పిల్లలు.

వారికెవరు చెప్పారో...ఎప్పుడు చూసారో... లేకపోతే ఎందుకంటారు ?

గబగబా ముఖం కడుక్కుని, పాంటు — షర్టు వేసుకునేసరికి శ్రీమతి కాఫీ తీసుకొచ్చింది.

"ఎందుకంత దిగులు ?" కాఫీగ్లాసు యిస్తూ అంది శ్రీమతి.

"ఎందుకేమిటి, జనభా వెళ్ళేవరకూ మనకు సెపరేషనేకదా అని" అన్నాను. కొన్ని కొన్ని పడిగట్టు పదాలు దంపతులకే అర్థం అవుతాయి. కాని నేటి సినిమాలు పుణ్యమా అని బొడ్డూడని పిల్లలు కూడా ఆ మాటల అర్థాలు తెలుసుకుంటున్నారు.

"బాగుంది వరస.. వయసు పెరుగుతున్నా, ఇద్దరు పిల్లలు పుట్టినా – మీకు మాత్రం ఆ ధ్యాస తగ్గటంలేదు. త్వరగా బయలుదేరండి... గోదావరి ఎక్స్‌ప్రెస్ వచ్చేస్తుంది" అంది శ్రీమతి పర్సు యిస్తూ.

"నీకా భయంలేదు. మన రైలుబళ్ళు ప్రయాణీకులమీద బోలెడంత జాలి, సానుభూతి కనబరుస్తాయి. తీరిగ్గా వస్తాయి. అన్న టైముకు గంట ఆటుగానే వస్తాయి" పర్సు జేబులో పెట్టుకుని బయలుదేరాను.

సెంటర్లో స్టేషనుకెళ్ళే సిటీబస్సు సిద్ధంగా వుంది.

నేనో పచ్చి నిజం చెప్తే నమ్మరేమో ! నగరానికొచ్చి పుష్కరకాలం అయినా, నగరంలో ఏమీ చూడలేదు. ఇంటికి అయిదు కిలోమీటర్ల దూరంలోవున్న గోల్కొండ కూడా చూడ లేదంటే నమ్మండి. ఇది తెలిసిన వాళ్ళు నన్ను "లోభి" అంటారు. కాని నేను లోభిని అవునో కాదో చెప్పవలసింది ఎవరు? ఏటా అయిదారు వందలు అతిధిదేవుళ్ళకోసం అప్పు ఎందుకు చేస్తాను ?

నేనూ మనిషినే. నాకూ కోరికలు,సరదాలు వున్నాయి. లేనిదల్లా జేబులో డబ్బు. చూడాలన్న ఆసక్తి...

స్టేషను చేరేసరికి గోదావరి అరగంట లేటని తెలిసింది.

ప్లాట్‌ఫారం టిక్కెట్టు కొని లోపల కెళ్ళాను.

సినిమా బొమ్మలు, షోకేసులు చూస్తుంటే అనౌన్సుమెంటు వినబడింది.

మరో పది నిముషాలకు గోదావరి వచ్చింది.

నేను సత్యమూర్తికోసం బోగీల వైపు చూస్తున్నాను.

"బాబాయ్." ఎవరో పిలిచారు. వెనక్కు తిరిగాను.

సత్యమూర్తి పిల్లలు.. పక్కనే అతను... భార్య...

"బాగున్నారా మూర్తిగారూ... వాళ్ళని కూడా తీసుకురావలసింది ?" పలకరించాను.







"అబ్బబ్బ... ఏ ప్రయాణమయ్యా యిది! అసలు మీరంతా ఎలా ప్రయాణాలు చేయగలుగుతున్నారయ్యా ఈ గాంధీగారి క్లాసులో ?" అన్నాడు విసుగ్గా, హేళనగా.

"అదేమిటి, మీకు ఫస్ట్‌క్లాసు పాసుకదా?" అన్నాను.

"అందుకే బాధ..." అన్నాడు పెద్దగా తెలుగు హీరోలా ఫోజుపెట్టి.

అతనికున్న అహంభావం, అతిశయం, మరెవ్వరికీ వుండవేమో! తను మొదటి నుంచి ఫస్టుక్లాసులోనే ట్రావెల్ చేసినట్టు ఫోజు! ఏదో రైల్వేలు దయతలచి పాసులు సౌకర్యం కల్పించింది... జీతాన్ని బట్టి సెకండు క్లాసు... ఫస్టుక్లాసు... అసలెందుకు వీరికి పాసులు యివ్వాలి ? వీరిలో నిజాయితీగా ఆ సౌకర్యాన్ని వుపయోగించేది ఎంతమందో నాకు బాగా తెలుసు... అయిదేళ్ళ అనుభవంలో ఎంతోమందిని చూసాను. టిక్కెట్టు కొంటే తెలిసివస్తుంది.

గేటు దగ్గర టికెట్ కలెక్టరు టికెట్ అడిగాడు.

"స్టాఫ్" అన్నాడు.

స్టాఫ్ అయితే వూరికే వెళ్ళిపోవచ్చా.. లేక అడగకూడదనా ? అదేదో చూపించవచ్చుగా! అతనెప్పుడూ విజయవాడలో వుండగా టిక్కెట్టు కొని ప్రయాణం చేయలేదు, అర్జంటుగా ప్రయాణం వచ్చినప్పుడు కూడా. ఆ విషయాన్నే తనే సగౌరవంగా, సగర్వంగా చెప్పుకుంటాడు. స్నేహితులు, బంధువులు అతని హోదామీదుగానే ప్రయాణిస్తారు. అది తను వారికి చేసే ఉపకారంగా భావిస్తాడు సత్యమూర్తి.

రైలు, బస్సులకు నష్టం వస్తోందంటే ఎందుకు రాదు ? సత్యమూర్తిలాంటి వారు దేశంలో వుండగా ఆశ్చర్యపోవటం దేనికి !

సత్యమూర్తి రెండు సూట్‌కేసులు, బెడ్డింగు తెచ్చాడు. సిటీబస్సులో వెళ్ళటం అసంభవం అనిపించింది.

"ఆటోమీద వెడదాం మూర్తిగారూ !" అన్నాను మర్యాదకోసం.

"రెండు ఆటోలుండాలి ... ఈ తలలు, సామాను ఒక ఆటోలో సరిపోరు ..." అన్నాడతను. రెండు ఆటోలమీద మేము సర్దుకున్నాం. ఆటోలు బయలుదేరాయి.

అరగంట తర్వాత యింటిముందర ఆగాయి ఆటోలు.

ఆటో ఫేరు చూసాను. ఒకటి పదిహేడు చూపించింది. రెండోది ఇరవై ఒకటి. అదండీ సంగతి! ఒకేచోట బయలుదేరిన రెండు ఆటోలు ఒకేచోట ఆగినప్పుడు వాటి మీటర్లు సూచించే ఫేరుల్లో వ్యత్యాసం ? ఆటో డ్రైవర్లతో పోట్లాడటం అనవసరం ... కంప్లయింటు ఇస్తే మన టైము వేస్టు ... తిరగలేక చావాలి ... అందుకే నోరు మూసుకుని డబ్బు వారి చేతుల్లో పెట్టి ఓ దణ్ణం పెట్టటం ఉత్తమం.

ఆటో దిగి సత్యమూర్తి దర్జాగా లోపలకు వెళ్ళిపోయాడు పెళ్ళాన్ని తీసుకుని. సామానులు ఎవరు తెస్తాడనుకున్నాడు ?

"మీటరు ఫేరు ఎంతయింది ?" కర్టెసీ కోసం కూడా అడగలేదు అతను. నాకు తప్పలేదు. పిల్లలు సాయం చట్టారు.

"మీ ఆయన స్టేషనుకు రాకపోతే మేము అవస్థపడి పోయేవాళ్ళం" సత్యమూర్తి మరదలు దగ్గర జోక్ పేలుస్తున్నాడు.

కాదామరి ...సామానులు ఎవరుమోస్తారు? ఆటో ఫేరు ఎవరు ఇస్తారు ? ములగచెట్టు ఎక్కించి మాట్లాడటం కొందరికి చాలా తేలికైన పని!

పావుగంట తరువాత —

"మూర్తిగారూ ... అడగటం మరిచేపోయాను. మీ అమ్మగారు ఎలావున్నారు ?" అడిగాను.

"అలాగే వుంది. పెద్దవయసుకదా !" అన్నాడతను.

సత్యమూర్తి తల్లికి ఎనభై అయిదేళ్ళ వయసుంటుంది. ఈ వయసులో ఆవిడను పిల్లలకు వదిలిపెట్టి తను దేశ సంచారానికి బయలుదేరాడు. ఆ మాత్రం ఆలోచన, వివేకం ఎందుకు లేదో మరి! అత్తా కోడలుకు పడదు. మా వదినగారు శ్రీమతికి ఉత్తరంలో రాస్తూ వుంటుంది — ఆవిడ నిక్షేపంలా వుందని .. స్వేచ్ఛ ఎప్పుడో అని... ఈ కోడలును ఏ విషయంలోను బాధించదావిడన్న విషయం నాకు పుష్కరంనుంచీ తెలుసు. రేపు తన కోడళ్ళు తననిలా చూడరూ ?

వాళ్ళు విశ్రాంతి తీసుకున్నారు ఆ రోజుకు. నేను ఆఫీసుకు వెళ్ళిపోయాను.

* * *

ఆఫీసుకు నాలుగు రోజులు సెలవు పెట్టాను. అయిదువందలు అప్పు తెచ్చాను. నగర సందర్శన ఆరంభమయింది. నోట్లు మారుతున్నాయి.

సత్యమూర్తి చేయి పర్సులోకి వెళ్ళలేదు. పార్టీల దగ్గర మామూళ్ళుకు, లంచాలకు అలవాటు పడిన వాళ్ళందరికీ యిది అలవాటే !

"శ్రీవారికి ప్రేమలేఖ సినిమా బాగుందంటగదా మరిదిగారూ... అనాకపల్లిలో మా యింటికి దూరంగా వున్న థియేటర్లో ఆడుతోంది. చూద్దాం మనం" అంది సత్యమూర్తి భార్య. నా నెత్తిన పిడుగు పడింది.

"మూర్తిగారేమంటారు ?" అతని వైపు చూస్తూ అన్నాను.

"నాదేముంది తమ్ముడూ... మీ వదిన ఆర్డరయింది గదా... తప్పుతుందా ?" అన్నాడు.

సాయంత్రం అంతా సినిమాకు బయలుదేరాం. శ్రీమతి ఎంతో సంతోషించింది. దాదాపు అరవై రూపాయలు ఖర్చు అయిపోయినందుకు బాధ మరోవైపు.

నగరంలో చూడవలసినవన్నీ చూపించటం

అయిపోయింది. నాలుగు రోజులు దొర్లి పోయాయి. వారింక స్నేహితులు, బంధువుల యిళ్ళకు వెళ్ళాలనుకుంటున్నారు...

"మరి నేనిక ఆఫీసుకు వెడతాను .. వారి యిళ్ళకు నేనెందుకు . మీకు అడ్రస్సు తెలుసు కదా" అన్నాను నేను.

"సరే అయితే" అన్నాడు సత్యమూర్తి.

ఎనిమిదో రోజు సాయంత్రం—

నేను ఆఫీసు నుండి యింటికెళ్ళేసరికి సత్యమూర్తి దిగులుగా కనబడ్డాడు. పక్కనే అతని భార్య... వారికెదురుగా శ్రీమతి...

సత్యమూర్తి నా చేతికి టెలిగ్రాం చూపించాడు. అది నా కేరాఫ్ అడ్రస్‌కు అతని కొచ్చింది— "మదర్ సీరియస్... స్టార్ట్ యిమీడియట్లీ ." అని వుంది.

"సారీ మూర్తిగారూ ... ఏమిటిది ?" అన్నాను.

"చెప్పానుగా, పెద్ద వయసు" అన్నాడు సత్యమూర్తి.

"వెళ్ళాలా మరి ?" అడిగాను,

"తప్పదుకదా... కాని ఎలా వెళ్ళాలి ? ఫస్ట్‌క్లాసులో రిజర్వేషను దొరుకుతుందా... అందులో సెలవులు .. సెకండు క్లాస్సు కాదు. తేలిగ్గా రిజర్వేషను దొరికేందుకు. నెలముందుగా చేయించాలి" అన్నాడతను గర్వంగా.

"ఈ సారికి జనరల్ కంపార్టుమెంటులో వెళ్ళండి, ఏం చేస్తారు మరి... లేదంటారా, ప్రయాణం మానేయండి... పెద్దవయసన్నారుగా అజీర్ణమో మరేదో అయివుంటుంది. గాబరాపడి టెలిగ్రాం యిచ్చేసారు వాళ్ళు..." అన్నాను.

"భలే జోక్ వేసావ్ తమ్ముడూ... రేపు ఆవిడికేదైనా అయిందంటే అంతా నన్నే అంటారు...కాబట్టి వెళ్ళక తప్పదు. నీ సలహానే పాటించాలి" అన్నాడు.

"బాగుంది... జనరల్ బోగీ ప్రయాణంలో మనుషులు మనుషులుగా చేరరు శవాకారంలో వెడతారు" అంది మా వదినగారు.

"బాగుందండోయ్... అందరికీ మీలాగా ఫస్ట్‌క్లాస్‌లోనే ప్రయాణం చేసే అదృష్టం పడుతుందా ? మీరన్నట్లు అందరూ శవాలుగానే చేరుతున్నారా ?" అన్నాను కోపంగా నేను...

మరి కొంతసేపు ఆ ఆది దంపతులు సెకండుక్లాసు ప్రయాణం మీద విమర్శించారు.

"నాంపల్లి స్టేషనులో గోదావరి ప్లాట్ ఫారం మీదకు రాగానే ఎక్కేస్తే సరి... లేడీస్ కంపార్టుమెంటు ఖాళీగానే వుంటుంది. మీరు ఎక్కడో అక్కడ సర్దుకోవచ్చు. ఎటూ స్టాఫు కాబట్టి టి. టి. ఇ.తో చెప్పి తరువాత స్టేషనులో బెర్తో సీటో పొందవచ్చు." సలహా యిచ్చాను.

సత్యమూర్తికి నా సలహా నచ్చినట్లుంది.

"అయితే మా ప్రయాణం రేపే !" అన్నాడతను.

# టెలిగ్రాం వచ్చింది

"మీ యిష్టం..." అన్నాను.

రాత్రి పడుక్కునేముందు చెప్పింది నాతో– రేపు వారెళ్ళిపోతున్నారుగా, అక్కకు చీర జాకెట్టు... అతనికి పాంటు షర్టు పెడదాం... పిల్లలు ముగ్గురికీ పదేసి రూపాయలిద్దాం— అని.

"నీ మొహం, పిల్లలకు పదేసేమిటి? వారికీ పరికిణీ జాకెట్టు పెట్టేద్దాం... ఈ మాత్రం దానికి ఆలోచిస్తామా !" అన్నాను.

శ్రీమతి నా తెలివితేటలకు, తెగింపుకు పొంగిపోయింది.

మర్నాడే స్నేహితుడి బట్టల దుకాణంలో అరువు రాసి గుడ్డలు తెచ్చాను.

బహుమతి ప్రదానం జరిగిపోయింది.

వదినగారు మా పిల్లలకు అయిదురూపాయలిచ్చారు. శ్రీమతికి కిలో ద్రాక్షపళ్ళు కొని యిచ్చింది. ఆమె ముఖంలో విచారం తొంగి చూసింది.

సత్యమూర్తి నాకు "థాంక్స్" చెప్పాడు.

సాయంత్రం వారిని ఆటోల మీద నాంపల్లి స్టేషనుకు చేర్చాం, నేను శ్రీమతి.

గోదావరి ఎక్స్‌ప్రెస్ ఎందుకో ఖాళీగానే వుంది. సత్యమూర్తికి, భార్యకు కూర్చునేందుకు, పిల్లలకు పడుకునేందుకు చోటు దొరికింది.

"చూసారా వదినగారూ, మా గాంధీగారి క్లాసు మీకోసం ఖాళీగానే వుంది. మీరు బట్టలు నలక్కుండా, యిళ్ళకు చేరవచ్చు." నవ్వుతూనే చురక తగిలించాను.

"అప్పుడే ఏమయింది, సికింద్రాబాద్ స్టేషనులో చూడాలి మీ గాంధీగారి క్లాసుని..." అన్నాడు సత్యమూర్తి.

"మిమ్మల్నెవరూ లేపరు కదా!" అన్నాను.

"ఇంటికెళ్ళగానే మీ అమ్మగారి ఆరోగ్యం తెలుపుతూ వుత్తరం రాయండి. ఈ టెలిగ్రాం రాకపోతే మరికొన్ని రోజులు వుండేవాళ్ళు ..." అంది శ్రీమతి.

నేనూ ఆమాటే మరోసారి రిపీట్ చేసాను.

"అలాగే" అన్నారు ఆదిదంపతుల. రైలు వెళ్ళిపోయింది.

*  *  *

నేను శ్రీమతి స్టేషను బయటకొచ్చాం. సిటీబస్సు కోసం బస్టాపులో నిలబడ్డాం. పావుగంటయినా ఒక్క బస్సు రాలేదు. శ్రీమతి ఆర్టీసీ పాలకులమీద విసుక్కుంటోంది.

"అయిన ఖర్చు ఎటూ అయింది. ఇక మిగిలింది ఈ యిరవై రూపాయల నోటు... దీన్ని ఆటోకు ఖర్చు పెడదాం. ఆటోమీద వెడదాంలే." శ్రీమతి ముఖంలోకి చూస్తూ అన్నాను.

శ్రీమతికో సుగుణం వుంది. తను చెప్పకుండా ఏ పనైనా నేను చేస్తే ఆమె ఎంతో సంతోషిస్తుంది. కనిపించని దేవుడు వరాలిచ్చినట్లుగా వుంటుంది నాకు. ఆటో పిలిచి కూర్చున్నాం. ఆటో కదిలింది. తారురోడ్డు మీద దూసుకుపోతోంది.

హఠాత్తుగా నాకు నవ్వొచ్చింది. నిజానికి ఈ నవ్వు నాకు చాలాసేపట్నుంచీ ఆగటంలేదు.

"ఎందుకు నవ్వుతున్నారు ?" అంది శ్రీమతి.

"మీ అక్క బావ హఠాత్తుగా వెళ్ళిపోయినందుకు..."

"వెళ్ళక వుంటారా... టెలిగ్రాం కూడా వచ్చాక వెళ్ళకపోతే ఏం బాగుంటుంది ?" అంది శ్రీమతి.

"అదే నేనూ అంటున్నాను. ఈ టెలిగ్రాం ఎవరు యిచ్చివుంటారనుకున్నావ్" అన్నాను శ్రీమతి వైపు చూస్తూ.

ఆమె ముఖకవళికలను బట్టి తెలియదన్నట్లుగా గ్రహించాను.

"మీ అక్క, బావ సరిగా ప్రవర్తించివుంటే ఈ టెలిగ్రాం వచ్చేదికాదేమో ?"

"ఏం చేసారు ?" అడిగింది శ్రీమతి.

"సంసారాలు బాగుపడాలన్నా, నాశనం కావలన్నా కారణం ఇంటి యిల్లాలు. మీ అక్కకు, ఆడపడుచులు వేసవి సెలవులకు వస్తున్నట్లుగా రాసారుట ... అన్నగారిమీద ఆ మాత్రం ఆశ వుండదా ? పైగా ముసలావిడకు యిరవై రోజుల క్రితం సీరియస్ అయిందట ... ఉభయ తారకంగా వుంటుందని ముచ్చటపడివుంటారు వాళ్ళు పాపం. కాని మీ అక్కకు వారు రావటం యిష్టంలేదుట ... అందుకే మీ బావను పోరుపెట్టి యిలా నగర సందర్శనకు లాక్కొచ్చింది. మీ బావైనా ఆలోచించక్కర్లేదూ, వయసుతోపాటు బుద్ధి, జ్ఞానం పెరగాలి. వచ్చేది పైవాళ్ళు కాదుగా ?" అన్నాను.

"ఇది మీకెలా తెలుసు ?" ఆత్రంగా అడిగింది శ్రీమతి.

"మీ బావకు తెలిసిన నా ఫ్రెండు అనకాపల్లినుంచి మా ఆఫీసుకు మూడురోజుల క్రితం వచ్చాడు. అతనే యిదంతా చెప్పాడు. మీ వాళ్ళ ప్రవర్తన నాకు నచ్చలేదు. అందుకే ఆ స్నేహితుడితో వెళ్ళగానే ఈ విధంగా టెలిగ్రాం యిమ్మని పదిరూపాయలిచ్చాను. ఈ టెలిగ్రాం అతనిచ్చిందే !" చెప్పాను.

శ్రీమతి ముఖంలో, అక్క — బావ చేసిన పనికి అసహ్యం, కోపం గమనించాను. ఇప్పుడు నాతోపాటు శ్రీమతికూడా నవ్వుతోంది. ★




## 7-9-1984 శుక్రవారం మొదలు 13-9-1984 గురువారం వరకు

★ **మేషం :** మాట పట్టింపుతో ఒకానొక వ్యవహారం చెడిపోతుంది నూతనాంశాలు కొన్ని గ్రహింపునకు రాగలవు. వ్యాపారం బాగా సాగిపోయే అవకాశమున్నది. తలవని తలంపుగా మిత్రులలో, బంధువులో యింటికి రాగలరు. స్త్రీలకు . వారం రోజులు హాయిగా ఆనందంగా జరిగిపోతాయి

★ **వృషభం :** ప్రజారంగంలో పేరు ప్రతిష్టలు రాగలవు విద్యా వైజ్ఞానిక రంగంలో పేరు తెచ్చుకొంటారు చేసిన ఉద్యోగ యత్నాలు ఫలిస్తాయి సుఖసంతోషానికి ఏలాంటి లోపంలేదు స్త్రీలకు . ఆదాయం సుఖం, శుభ కార్యాలో చనలుండగలవు.

★ **మిధునం :** పదిమందిలో ప్రతిష్ట సంపాదించుటకు, కళా రంగంలో సదవకాశాలు పొందుటకు, వస్తువాహన సేకరణకు అవకాశమున్నది. స్థిరాస్థిగాని, గృహాన్నిగాని పెంపుచేసే మార్గాలున్నవి. స్త్రీలకు నూతనాంశాలు గ్రహించుట, రాజకీయ రంగాన అవకాశాలు ఆశించినవి లభ్యం కాగలవు

★ **కర్కాటకం :** సభా గౌరవం కొందరకు. పత్రికా గౌరవం కొందరకు, రాజకీయంగా అనుకూలత కొందరకు, ప్రతిభకు తగినపారితోషకం లభ్యం కావటం, విద్యా రంగాన పెంపు లభించుట కొందరకు, ఈ వారాన చెప్పదగిన ముఖ్యాంశాలు. స్త్రీలకు : నూతనాంశాలు గ్రహింప గలవారం.

★ **సింహం :** ప్రతివారం యింతేనా! అని నిస్పృహ చెందకండి. "శని" గ్రహానుకూల్యత లభించి వ్యాపార వ్యవహారాలందు అభివృద్ధి, వృత్తియందు అభివృద్ధి చేకూరగల సమయం కొందరు "ప్రమోషన్" ఆశింపదగిన సమయం, స్త్రీలకు : వృత్తి ఉద్యోగ వ్యాపార వ్యవహారాలందు అనుకూలత సంభవం.

★ **కన్య :** నూతన మిత్ర సంపర్కం, నూతనాంశాలు గ్రహించటం, వ్యవహారరీత్యా మేలు పొందుటకు, నూతన వ్యాపారం ప్రారంభించుటకు, ప్రయాణాలు తప్పనిసరిగా చేయవలసి రావటం చెప్పదగిన అంశాలు, గ్రహించండి. స్త్రీలకు : వస్తు సేకరణకు దైవ కార్యాచరణమునకు అనుకూలం

★ **తుల :** 'జరిగేది జరుగక పోదు' అని ఊరకుండరాదు వ్యవహార జ్ఞానం అభివృద్ధి నందగలదు. వ్యాపార రీత్యా పుంజుకొనగలరు. కొందరకు, దూరదర్శని, ఆకాశవాణి లాంటి సంస్థలందు తగిన అనుకూలత లభించగలదు స్త్రీలకు : ఉద్యోగమందు వృద్ధి చేకూర గలవారం

★ **వృశ్చికం :** మీ మాటకు చెప్పదగినంత విలువ కనిపిస్తుంది గ్రామానగాని, మీరు పనిచేసే సంస్థయందుగాని ప్రాముఖ్యత లభ్యం కాగల వారం ఏ పని ప్రారంభించినా విజయ వంతమే. వ్యాపారంలో చెప్పదగిన అనుకూలత గలదు. స్త్రీలకు · ద్రవ్యాదాయం, యత్న కార్యసిద్ధి గల వారం.

★ **ధనుస్సు :** అనుకూలత అన్ని రంగాలలో చెప్పదగిన సమయం. మీ వ్యాపారం విస్తరించే అవకాశాలు ఏర్పడుతాయి. సుఖ సంతోషాలకు కొరతలేదు. ఉద్యోగరీత్యా మేలు చేకూరుతుంది ద్రవపదార్థ వ్యాపారస్థులకు లాభదాయకం స్త్రీలకు . నాటక రంగ చలన చిత్ర రంగానుభవం గల వారికి సదవకాశాలున్నాయి.

★ **మకరం :** గ్రహించండి. యిత్న కార్యసిద్ధి, వ్యాపార వృద్ధి, ప్రజా సమూహంతో ప్రసిద్ధి, రాజకీయ రంగాన వాంఛా ఫలసిద్ధి, వ్యాపార మందు అధిక లాభసిద్ధి చేకూరుట నిశ్చయం. స్త్రీలకు : నగలో, వస్త్రాలో, విలువ గల వస్తువులో కొన గలుగుట గ్రహించాలి.

★ **కుంభం :** ఆస్తిని పెంపొందించు కోవాలనే మీ చిరకాలపు వాంఛ ఈ వారం నెంవేరనున్నది. అనవసరంగా కాలం వ్యయించటం మీరే గమనించి పశ్చాత్తాప పడనున్నారు. స్త్రీలకు : రాజకీయంగా, ఉద్యోగ రీత్యా మేలు చేకూరగలదు.

★ **మీనం :** గ్రహించండి. పెద్దల వలన, ధనవంతుల మూలాన, పరిచితుల వలన మీకు మేలు చేకూరుతుంది. చాలాకాలంగా వసూలు కాని ద్రవ్యం చేతి కందటం గమనింప దగిన అంశం. స్త్రీలకు : గృహానందం, వృత్తిలో మేలు, నూతనాంశాలు గ్రహింపునకు రాగలుగుట ఈ వార విశేష ముఖ్యాంశాలు.

**–విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి**

# వ్యక్తిగతం



జిమ్ నెల్సన్ స్కాట్లాండ్‌లో ఫాదర్‌గా చేరాడు. ఈ 39 సంవత్సరాల వ్యక్తి ఒకసారి కోపం వచ్చి (తన ప్రియు రాలి మీద వాగ్వివాదం వచ్చినప్పుడు) తన తల్లిని, ముందు కర్రతో తరువాత ఇటికతో, కొట్టి చంపివేశాడట. ఆ తరువాత తల్లి శవాన్ని ఒక చోట భద్ర పరచి పోలీసు స్టేషన్‌కి వెళ్లి లొంగిపోయాడట. ఇది జరిగి దాదాపు 15 సంవత్సరాలు కావస్తోంది. ఈ మధ్య కాలంలో జెయిలులో ఉన్న నెల్సన్‌కి దేవుడి మీద భక్తి పెరిగిందట. అతని నడవడి బాగానే ఉందని జెయిలు అధికారులు నెల్సన్‌ని పెరోల్ మీద విడుదల చేశారుట. అతను స్కాట్‌లాండులోని సెయింట్ ఆంద్రూస్ ప్రెస్బిరేటరీలో ఫాదరీగా చేరాడుట. అతని చరిత్ర తెలిసిన వారు కొందరు అభ్యంతరాలు చెప్పగా నెల్సన్ చర్చ్ ఆఫ్ స్కాట్‌లాండ్‌కి అప్పీలు చేసుకుని పదవిని తెచ్చుకున్నాడన్నమాట. "పాపం చేశాను. ఇంకా పశ్చాత్తాప పడుతున్నాను" అని అతను అంటాడు మొత్తం మీద నెల్సన్‌ని ఫాదరీగా అంగీకరించేవారే ఎక్కువ మంది అని వార్తలు తెలుపుతున్నాయి.......



63 సంవత్సరాల వెనెరో పాగనో (న్యూయార్క్ వాసి)కి లాటరీలో 2కోట్ల డాలర్లు (20కోట్ల రూపాయలు సుమారుగా) వచ్చింది. పాగనో ఒకప్పుడు వడ్రంగివృత్తి చేసుకునే వాడు. రిటయిరయిన తరువాత ఈ బహుమతి వచ్చిందన్నమాట! లాటరీ సంస్థ అతనికి సాలుకి 762000 డాలర్‌ల చొప్పున 21 ఏళ్ళు చెల్లింపులు చేస్తారుట......

సీరియల్

# దాగుడుమూతలు

కప్పగంతుల మల్లికార్జునరావు

( గత సంచిక తరువాయి )

## 6

### ' పోస్ట్ '

ఆఫీసుకు వెళ్ళటానికి సిద్ధం అవుతున్న కాంతారావు పోస్ట్‌మేన్ అందించిన కవరు అందుకొని చించి లోపలి కాగితం బయటకి తీసేడు.

'డియర్ అరుంధతీ...'

ఉలిక్కిపడ్డాడు. ఎదురుగావున్న నిలువుటద్దంలో అప్పటి తన ప్రతిబింబాన్ని చూచుకొన్నాడు. అనూయ తాలూకు, లేక అనుమానం తాలూకు ఛాయలు కాని వున్నాయా ఆ మొహంలో!

కాగితాన్ని కవరులో పెట్టేసి లోపలికి కేకవేసేడు.

'డియర్ అరుంధతీ. నీకేదో ప్రేమలేఖ వచ్చింది. త్వరగా రావాలి.'

'ఏమిటండీ మీ గోల ? చదువుకొనే రోజుల్లోనే నాకు ప్రేమ లేఖలు రాసే 'గట్స్' లేకపోయాయి జనానికి. యిప్పుడు మీ భార్యను కూడా అయ్యాను. యింకెవరికంత ధైర్యం ? పొరపాటున నా మీద మోజుపడి ఎవరైనా రాద్దామనుకొన్నా మీరెక్కడ తూర్పారపడ్తారో అన్న భయం వుందిగదా ? అయినా తెగించి నాకు ప్రేమలేఖ రాసేడూ అంటే వాడెవడో యినుపగుండె కలవాడే. వాడికి నా జోహార్లు అర్పిస్తాను. యిలా యివ్వండా వుత్తరం.'

అరుంధతి భర్త కాంతారావు వో పెద్ద దినపత్రికలో డిప్యూటీ ఎడిటర్. మనిషి ఎంత మంచివాడో మాట అంత మృదువుగా వుంటుంది. కానీ మనసులోని మాటలు అక్షర రూపంలో వచ్చేసరికి అగ్నిశిఖలుగా మారుతాయి. రాజకీయాలనుంచి సాహిత్యం, సినిమాల వరకు అతను దండయాత్ర చెయ్యని రంగంలేదు. అతని విమర్శలకు పాఠకుల్లో మంచి డిమేండ్ వుంది.

అరుంధతిని భార్యగా సెలెక్ట్ చేసుకొనేముందు అతను ఎందరో అమ్మాయిలను పెళ్లిచూపులు చూచాడు. చూచిన ఎవరూ అతని ఎనాలిసిస్‌ముందు ఆగలేదు. ఆడపిల్లలు విద్యావంతులవుతున్నారు. నిజమే. కానీ విద్య వారికేం నేర్పుతోంది ? వినయాన్ని నేర్పుతోందా ? ధైర్యాన్నిస్తున్నదా ? విశ్లేషణాశక్తినిస్తున్నదా ?

చాలా మంది ఆడపిల్లలకు చదువు వో అలంకారం మాత్రమే.

అరుంధతిలో యీ శక్తులు కొంతమేరకైనా అతనికి కనబడ్డాయి. ఇంటర్వ్యూ స్టాయికి వెళ్లేడు.

ఇంటర్వ్యూలో ఆమె తన కాలేజీ జీవితాన్ని పూసగుచ్చినట్లు చెప్పింది. తనకు తలపెట్టిన ఘోరానికి తన స్నేహితురాలు సులోచన ఎలా బలి అయిందోకూడా చెప్పింది. అందుమీదట తాను సులోచనను డాక్టర్‌వద్దకు తీసుకువెళ్లి అబార్షన్ చేయించిన విషయంకూడా చెప్పింది.

'తెలిసో తెలియకో స్త్రీ పురుషులు వొకేరకమైన పొరపాటు చేసినా, గర్భందాల్చటమన్న ప్రకృతి సిద్ధమైన స్త్రీ బలహీనత, అనాదిగా ఆమె పాలిట విలన్‌గా వుంటోంది. అందుకే ఆ అంశం చుట్టూ రచయితలు అనేక కల్పనలు అల్లేరు. పాపం! కుటుంబ నియంత్రణా పద్ధతులు, అబార్షన్‌ని లీగలైజ్ చేసేక కవులకు రచయిత లకు వొక ముఖ్యమైన యూనివర్సల్ యితివృత్తం పోయిందే అని విచారిం చాను. కానీ బిడ్డ పోయినా పురిటికంపు వదలనట్లు స్త్రీలకు ఆ సమస్య వదల్లేదన్నమాట ! మీరు మంచిపని చేసేరు. మీ స్నేహితురాలికి ధైర్యం చెప్పండి. వివాహం చేసుకోటానికి ఆ సంఘటన ఆమెకో ప్రతిబంధకం కాకూడదు.'

'నా ప్రయత్నం కూడా అదే.'

'సో–మన ఆలోచన వేవ్ లెంగ్త్ వొకటే. కనుక మన దాంపత్యం విజయవంతం అవుతుందనుకొంటాను నేను– మీరేమంటారు ?'

'నాకూ ఆ విషయంలో సందేహంలేదు.'

ఆ ఇంటర్వ్యూ తర్వాత వాళ్లిద్దరికీ పెళ్లయింది.

'పెళ్లయినంత మాత్రాన చదువు ఆగరాదు. మీరు డిగ్రీ హోల్డరవుతే నేను సంతోషిస్తాను. అన్నట్లు మీ స్నేహితురాలు మన పెళ్లికి రాలేదేం ?'

'నా పెళ్లికి ఆమె రావటం ముఖ్యం కాదు గదా ? ఆమెకు పెళ్లికావటం ఆ పెళ్లికి నేను వెళ్లటం ముఖ్యం.'

'అవును–నిజమే నీ పెళ్లికి ఆమె రాకపోవటమే వొక విధంగా మంచిదనుకొంటా.'

వాళ్లమధ్య సయోధ్యత సౌహార్ద్రత అలాంటిది. ఆ నాటినుంచి యీనాటివరకు అది చెడలేదు.

అరుంధతి వుత్తరం చదవటం ముగించి, దాన్ని భర్త చేతికిచ్చింది.

'ప్రేమలేఖ. మా సులోచన రాసింది. మీకు తెలీని రహస్యాలేం

**జరిగిన కథ — 4 :** జనార్దనంగారు తమ కుమార్తె పెళ్లి వైభవంగా చేయ సంకల్పించారు. పెళ్లికొడుకు రమేష్ స్నేహితులు కోరే కోరికలకు హద్దూ, పద్దూ లేకుండాపోయింది. జనార్దనంగారు కూతురు సులోచన మొహంలో పెళ్లికూతురు మొహంలో వుండాల్సిన మెరుపు లేకపోవడం గుర్తిస్తారు. డాక్టరు సుధాకర్ పెళ్లికూతురుని తదేకంగా చూడటం, పరధ్యానంగా ఉండటం రమేశ్ స్నేహితులు గమనిస్తారు. రమేశ్‌కు ఈ విషయం చెపుతారు. వారందరిలో ఈ విషయం ఆలోచనలు రేకెత్తిస్తుంది. జరగాల్సిన పెళ్లి ఆగి పోయింది. అదే ముహూర్తానికి గోపీచంద్ సులోచనను పెళ్లి చేసుకోడానికి సిద్ధపడతాడు. గోపీచంద్, సులోచనల వివాహం జరిగి పోయింది. సులోచనను గోపీచంద్ తల్లితండ్రులు ఆప్యాయంగా తమలో కల్పుకొన్నారు. వారితోబాటు మూగి వెంకన్న బాబు వచ్చాడు. వెంకన్న బాబును తీసుకెళ్లను వచ్చిన రమేశ్ సులోచన మాటలతో పరాభవం చెంది వెళ్లిపోతాడు.

లేవుగా ? చదవండి. వివరాలు మళ్లీ ఎవరు చెప్తారు ? మీరు చదవ్వాల్సిందే.'

'ఊం ? అలాగా ?' అన్నట్లు కనుబొమ్మ లెగరేసి ఉత్తరం చదవసాగేడు కాంతారావు.

'డియర్ అరుంధతీ'

అత్తవారింటికి వెళ్లగానే వుత్తరం రాస్తానని నీకు మాటిచ్చాను. కానీ ఏంచెయ్యను ? యిప్పటిక్కాని నీకు వుత్తరం రాసేందుకు చెయ్యి తీరిక చిక్కలేదు.

తల్చుకొంటే అంత చిత్రంగా వుంది కదూ ?

కానీ నాకిప్పుడు ఎంత ఆనందంగా వుందో తెల్సా ?

నువ్వు విధి, భగవంతుడు, అన్న భావాలను ఎగతాళి చేస్తుంటావు. కానీ రమేశ్‌తో నా పెళ్లి ఆగిపోవటం గోపీచంద్ నన్ను పెళ్లి చేసుకోటం యిదంతా మనుష్య ప్రయత్నం వల్ల జరిగిందా? అసలు మనం అనుకున్నామా ? అర్ధాంతరంగా పీటలు మీద పెళ్ళి ఆగిపోతే– ఆత్మహత్యలు చేసుకోటం, మతిభ్రమణాలు జరగటం మనం విన్నాము. కానీ నా విషయంలో వో నరకం నుంచి తప్పించుకొన్నంత అదృష్టం. పెద్దప్రమాదంతప్పింది. పోనీ గోపీచంద్‌తో వివాహం యింత తృప్తినిస్తుందనుకొన్నామా ? అంతవరకు ముక్కు మొహం కాని, వంశ చరిత్ర కాని, తెలియని వ్యక్తికి భార్యనవటం వల్ల యింత అదృష్టవంతురాలనవుతానని అపుడు మనం అనుకొన్నామా ? మరి వీటిని నడిపించిన శక్తులను ఎలా వివరించాలి ? వాటికేం పేర్లు పెట్టాలి? భగవంతుడు, విధి అన్న పేర్లు ఆఖరి మార్గంగా పెట్టేరేమో మన పెద్దలు ?

గోపీచంద్ ఆరోజు మన దగ్గరికొచ్చినపుడు చెప్పినట్లు, అతను నాకన్నా కులంలో, ఐశ్వర్యంలో, చదువులో, రూపంలో కూడా తక్కువ వాడే కానీ యివన్నీ చాలా చాలా వున్న ఎందరికన్నానో అతను ఉన్నతుడు. అతని ఔన్నత్యానికి కారణం అతని ప్రేక్టికల్ దృక్పధం. నేలవిడచి సాముచేయడతను తన శక్తి తనకు తెల్సు. ఆ శక్తి పరిధిలో తను తప్తి పడి ఇతరులను తృప్తి పెడ్తాడు. ఆదర్శం, ప్రేక్టికల్ దృక్పధం వుండటం వల్ల అతను సహృదయుడయ్యాడు. చాలా మంది తమ యింటి నుంచి కాక ప్రపంచాన్ని సంస్కరించే ప్రయత్నాన్ని చేస్తారు. కాని గోపీచంద్ ముందు తనను, ఆ తర్వాత తన కుటుంబం నుంచి సంస్కరణలు ప్రారంభించే వ్యక్తి. ఫలితంగా మాఅత్తవారింట్లో ప్రతి వొక్కరూ ప్రేమమూర్తులే. అంతకన్నా గొప్ప కులం ఏది ?

అతను నన్ను యమ్మే పూర్తి చేయ్యమని పట్టుపడుతున్నారు. నాకే మనసులో భయంగా వుంది. అతను ఇంటర్, నేను యమ్మే ? అసహజంగా వుంటుందేమో ! ముందు ముందు సమస్యలకు దారి తీస్తుందేమో ! ఇన్ ఫీరియారిటీ, సుపీరియారిటీ కాంప్లెక్సులు అతనికి లేవనుకో. కానీ అవి పెరగటం ఎంతసేపు ?

అరూ,

గోపీచంద్ యింతవరకు 'నా తప్పు కథ' కు సంబంధించిన ప్రసక్తి చూచాయిగా నన్నా తీసుకురాలేదు. మొదటి రాత్రి కూడా అదేమీ తెలియనట్లు చాలా సహజంగా ప్రవర్తించాడు. అంతే కాదు తన స్నేహితుడైన రమేష్ ప్రసక్తి కూడా తేలేదు. అయితే నేను ఎంత మర్చిపోదామని ప్రయత్నించినా మరవకుండా ఆ రమేష్ వొకడు తగల బడ్డాడీ వూళ్ళోనే. వెంకన్నబాబు అనే కుర్రాడివల్ల ఆ యింటివాళ్ళ ఏదో రూపంలో నన్ను పట్టుకొని వదలటంలేదు.

అన్నట్లు ఆ మధ్య రమేశ్ నేను వంటరిగా వుండగా మా



## ఓ బొజ్జ గణపయ్య!

వత్సరమ్మున తొలుదొల్త వచ్చి పోవు
పర్వ గినమని పొంగుచు భక్తులదిగొ!
వేగుజామునవే లేచి వెడలి తెచ్చి
నారుపత్త్రి రమ్ము! విఘ్నముల రాజ!

ఎలుక తత్తడి పై నెక్కి యెపుడు బయలు
వెడలి నాడవొ కైలాస వీధి వీడి
యెదురు చూతురు నీ కోస మెల్లవారు
జాగుసేయక రమ్ము! భూస్థలికి సామి!

కుడుములను నాల్గు చేతుల గూర్చి మెక్కి
పానకమ్మును కడుపార ఆనుమయ్యా!
వరము లీవయ్య! వారణ వదన మాకు
బొజ్జ గణపయ్య! వెనకయ్య! గుజ్జు వేల్పు!

—శనగన నరసింహస్వామి.

# దాగుడు మూతలు

యింటికొచ్చాడు వెంకన్న కోసం. అప్పుడు అతని నిజస్వరూపం తెల్సింది. ఎన్ని వున్నా అలాంటి వక్రబుద్ధులను చేసుకొన్న స్త్రీ ఏం సుఖపడగలదు చెప్పు ? తల తిరిగేలా చివాట్లేసేను. పెద్ద మొనగాడిలా చెయ్యెత్తితే, తలదించుకొనేలా చేసి పంపేను. ఆరోజు నాకు నువ్వే గుర్తుకొచ్చావు. ఎందుకంటే నాలో నిన్ను చూచుకొన్నాను. నువ్వంటుంటావే ఆ పురుషాహంకారం, అహంభావం నేనాతడిలో చూచేను. తప్పిపోయిన భర్త గానే నాపైన అంత అధికారాన్ని చెలాయించాలనే ప్రయత్నించాడే, భర్త ఆవుతే ఎంత హింసించేవాడో ?

ఏమైనా అరుంధతీ, నేనూ అదృష్టవంతురాలినే. నువ్వు భయ పడినట్లు నా జీవితం కాలేదు. కాదు. నా కానమ్మకం వుంది. ఎందుకంటే నా భర్త భగవత్ స్వరూపం. అంచేత 'ఆ తప్పు కథ'ను నేను మర్చి పోవటానికి ప్రయత్నిస్తున్నాను. నువ్వు మర్చిపో. నీవల్ల నాకేదో జరిగి పోయిందన్న భావనను మనసులో నుంచి తుడిచెయ్యి. వేస్తావు గదా ? అన్నయ్యగారికి నా నమస్కారములు చెప్పు.

నీ
లోచన

కాంతారావు వుత్తరం చదివి కళ్ళు మూసుకొన్నాడు.

'అదేమిటి ? నాకొచ్చిన వుత్తరం చదివి మీరు తన్మయత్వం చెందుతున్నారు ?'

'నీ స్నేహితురాలి భర్త అని చెప్పిన గోపీచంద్ రచనలని తెప్పించి చదివేను. నీ స్నేహితురాలి వుత్తరం చదివేక అతనిపైన గౌరవం పెరిగింది. ఆదర్శాలని చెప్పే రచయితని నాకు తెల్సు, కాని, అణు మాత్రమన్నా ఆచరించే రచయితలున్నారని నాకు తెలియదులే.'

'ఏం లాభం ? మీరు తిట్టటమే కాని ఎవరికీ సాయం చేయరు కదా ?'

'నన్ను మరీ అంత కర్కోటకుడిగా చేసేవే ?'

'లేకపోతే ఏమిటి ? పెళ్ళి నుంచి తిరిగొచ్చిన దగ్గరి నుంచి చెప్తున్నాను. గోపీచంద్‌గారికి యిక్కడ వో సన్మానంలాంటిది ఏర్పాటు చేసేరా? ఊళ్లో అన్ని సంస్థలతో సంబంధాలున్నాయి కదా మీకు ?'

కాంతారావు నవ్వేడు.

'గోపీచంద్ లాంటి రచయితలు సన్మానాలకతీతులు అని న విశ్వాసం అరూ. అతను సన్మానానికి అంగీకరించడు.'

'ఎందుకంగీకరించడు ?'

'ఎందుకంగీకరించాలి ?''

'కీర్తి, గౌరవం, ధనార్జనలు అక్కర్లేని మనుషులుంటారా ? రచయితలంతా అలా వుండాలనా మీ మతం ?'

'నా మతం సంగతెందుకు ? గోపీచంద్ అంగీకరించడు.'

'నేను అంగీకరింప చేస్తాను. మీరు ఏర్పాటు చేయించండి పోనీ..' ఛాలెంజింగా అంది అరుంధతి.

'ఆల్‌రైట్. యివాళ అతనికి నేను అఫీషియల్‌గా వుత్తరం రాయిస్తాను వో ప్రముఖ సంస్థ నుంచి. ఆ కాపీని నీకు పంపిస్తాను. నువ్వు కూడా వో వుత్తరం రాయి. చూద్దాం.'

కాంతారావు గడియారం చూచుకొన్నాడు. నాలుగడుగులు వేసి ఆగి అన్నాడు 'అయినా అతను అంగీకరిస్తాడన్న నమ్మకం నాకు లేదు. గుర్తుంచుకో.'

'అతడిని వప్పించే పూచీ నాది కదా ?' అంది అరుంధతి భర్తకు ఆఫీసుకు వీడ్కోలిస్తూ.

## 7

పిలవంగా పిలవంగా చివరకు అల్లుడు తన ఆహ్వానాన్ని అంగీకరించి కుటుంబ సమేతంగా వచ్చినందుకు సంతోషించాడు జనార్దన్.

ఆయన యిల్లు పెళ్ళిల్లులాగా కళకళలాడిపోయింది మళ్ళీ. సోమసుందరం, రఘురాం, రామారావులాంటి ముఖ్యులు కూడా వచ్చారు భార్యాపిల్లలతో. పెళ్ళిలో చేయాల్సిన మర్యాదలు, లాంఛనాలన్నీ బీరుపోకుండా వియ్యాలవారికి జరిపించాడు జనార్దనం.

వెంకటస్వామివాళ్లకు వాళ్ళు చేస్తున్న మర్యాదలూ, అసలు వారి యిల్లు, పద్ధతులు అన్నీ కలలాగా వున్నాయి. ఇంత గొప్పవారు తమ వియ్యాలవారా ?

'మీరు సులోచనకు యిచ్చిన పెళ్ళి ఫోటోల ఆల్బం చూచాను సార్. ఎడిట్ చేసినట్లున్నారు ?' ఆ రోజు భోజనాలయ్యాక రామారావుతో అన్నాడు గోపీచంద్.

ఆల్బంలో తప్పిపోయిన పెళ్ళివాళ్ల లాలూకు సంఘటనలేమీ లేవు. రామారావు కావాలనే అలాంటి ఫోటోలను చేర్చలేదు.

'షూటింగ్ అప్పుడు ఎన్నో టేక్‌లు తీస్తాను వో దృశ్యాన్ని. అనవసరమైన దృశ్యాలను కూడా తీస్తాము. తీసిన వాటన్నిటినీ పిక్చర్‌లో వుంచితే చూచేవారికి బోర్‌కొట్టుతుంది గదా ? అందుకే సినిమాకి ఎడిటింగ్ ప్రాణం. మంచి ఎడిటర్ సినిమాకు ప్రాణప్రతిష్ఠ చేస్తాడు.'

'కానీ మీ ఎడిటింగ్‌వల్ల కంటిన్యుటీ లోపిస్తున్నది కదండీ. పెళ్లికూతుర్ని చేయటం దగ్గరినుంచి వొక్కసారి మంగళసూత్రధారణకు జంప్ చేసినట్లుంది.'

'సినిమావాళ్లం కదా ? సినిమాలో అనవసరపు డిటైల్స్‌కు ప్రాధాన్యత వుండదండీ. అసలు సన్నివేశాలు బాగా వున్నాయి కదా ?'

అలా కాస్సేపు సంభాషణ జరిగేక అల్లుడికి కూతురికి పీటలమీద కూర్చోబెట్టి నూతన వస్త్రాలతోపాటు కట్నంగా డబ్బు యివ్వబోయాడు జనార్దనం.

'కట్నం యిస్తానంటే మీ అమ్మాయిని అసలు చేసుకొనేవాడిని కాను మామగారూ. ఆ విషయం మర్చిపోండి.'

మర్చిపోదామనే అందరి ప్రయత్నంకూడా. కానీ వాస్తవం వాళ్లను మర్చిపోనివ్వటంలేదు.

అల్లుడు మంచివాడే. వారంతా మంచివారే. కులం వదిలేయవచ్చు. కానీ బీదరికం మంచిది కాదుగదా ? దాన్ని వదిలెయ్యకపోతే ఎలా?

ఆస్తి ఎంత పోగొట్టుకొన్నా జనార్దనం యింకా బీదవాడికింద లెక్కకాదు. అంతేకాదు. అతని తమ్ముళ్ళు, బావమర్దులు అంత



ఇటీవల హైదరాబాదులో కిన్నెర ఆర్ట్ థియేటర్స్‌వారు ఏర్పాటు చేసిన 'జ్వాలా లేఖిని' కావ్యావిష్కరణ సభలో కృతికర్త డా. దాశరథిని సన్మానిస్తున్న ఆవిష్కర్త శ్రీ వందేమాతరం రామచంద్రరావు. శ్రీ మద్దాళి రఘురామ్‌ని కూడా చిత్రంలో చూడవచ్చు.

## దాగుడు మూతలు

గొప్ప గొప్ప పొజిషన్స్‌లో వున్నారు. వారి కంటికి రమేశే ఆనలేదు. మరి రమేశ్‌కున్నపాటి వుద్యోగం అన్నా లేదు గోపీచంద్‌కు. అతనికున్న ఆస్తి లేదు. అతనికిలేని మంచితనం ఎంతవుంటే మాత్రం వాళ్లకు ఆనుతాడా ?

'అన్నయ్యా. అతను అంగీకరిస్తే నేను మా కంపెనీలో మంచి వుద్యోగం వేయిస్తాను. యం. డి. నా మాట కాదనడు. రచయితగదా ? ఏ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరుగానో వడేయిస్తా.'

అలా ప్రతివారూ సహాయం చేస్తామనేవారే. చేయగల శక్తి వున్నవారే. కానీ గోపిచంద్ అంగీకరించవద్దూ ?

'నాన్నగారూ. ఆయనకిలాంటివి గిట్టవు. తన స్వశక్తిమీద విశ్వాసం వున్న మనిషి ఆయన. తన తాహతుకు మించిన ఆశలకుపోడు. యిలాంటి ప్రయత్నాలు మీరు చేయవద్దు. ఆయనకు తెలిస్తే బాధ పడ్తారు' కొన్ని ప్రయత్నాలు వారు చేసేక చెప్పింది సులోచన.

హోదా విషయంలో అలా —

డబ్బు యివ్వకబోతే యిలా —

యింకెలాగా అల్లుడిని గొప్పవాడిని చేయటం ?

అంతా ఆలోచించారు.

'మీరంతా అతనికి గొప్ప గొప్ప వుద్యోగాలిప్పించగలరు. నేనలాంటి శక్తి లేనివాడిని. అయినా అతనికి నేను సాయం చేయగలననుకుంటున్నా. నేను చెయ్యబోయే సహాయాన్ని అతను కాదనడనికూడా నా విశ్వాసం' రామారావు అన్నాడు చివరికి.

'అసలు నువ్వు చెయ్యగలిగిన సహాయం ఏమిటి ?'

'చెప్పను. చేసి చూపిస్తానుగా !'

రామారావు ఆ సాయంకాలం గోపీచంద్‌ను పొలాలవైపు షికారుకు తీసుకెళ్లేడు.

సినిమాలకు గురించిన చర్చలోకి దించాడు. సినిమా రంగాన్ని గురించి అతనికున్న అభిప్రాయాలని తెల్సుకొన్నాడు.

'నాకు తెల్సిన యిద్దరు దర్శకులు, అలవాటైన సినిమా మసాలాలకు భిన్నంగా కొత్త కథలకోసం అన్వేషిస్తున్నారు. మీ నవలలు రెండు వాళ్లకు చూపిద్దామనుకొంటున్నాను. మీకు అభ్యంతరం లేదుగా ?'

'అభ్యంతరం ఎందుకు ? దొంగిలించరుగా ?'

రామారావు నవ్వేడు

'కానీ రచనలో స్పిరిట్‌ని చెడగొడ్తే నేను వూరుకోను. రచయిత చెప్పదల్చుకొన్న ఆదర్శం వొకటైతే సినిమా మార్పులపేరిట ఆ ఆదర్శానికి భిన్నమైనవాటిని ప్రతిపాదించిన సినిమాల సంఘటనలు నేను ఎన్నో విన్నాను.'

'అలా జరగదులెండి. ఎందుకంటే ఆ దర్శకులుకూడా 'మన' లాంటి ఆదర్శాలున్నవారే. వారికి నచ్చితే కబురు చేస్తారు. మీరు వస్తారుగా ?'

'భలేవారేనే ? ఎందుకురాను ? రచయిత రాసేదెందుకు ? పదిమందికీ తన ఆలోచనల్ని తెలపాలనేగా ? సినిమా మీడియం బహుళ ప్రచారంకల సాధనం. నేను ఎందుకు కాదంటాను ? మీరు గట్టిగానే ప్రయత్నించండి.'

'అలాగే.'

రామారావు మద్రాసు తిరిగివెళ్తూ, అల్లుడి భవిష్యత్తును గురించి విచారిస్తున్న జనార్ధనం తదితర పెద్దలకు ధైర్యం చెప్పేడు.

'ఎంత గొప్పవాడైనా ప్రతివాడికీ వో బలహీనత వుంటుంది. సినిమా వాళ్లం ప్రజలలోని అలాంటి బలహీనతల్ని డబ్బు చేసుకొని బ్రతుకుతుంటాం. గోపీచంద్ అన్నివిధాలా గొప్పవాడే. ఆదర్శజీవే. కానీ అతనిలోనూ వో బలహీనత వుంది. ఆ బలహీనత ఆధారంగా అతడిని ఆ గుమాస్తా వుద్యోగం నుంచి తప్పించవచ్చు. అదృష్టం వుంటే గొప్పవాడూ కావచ్చు. నన్ను ప్రయత్నించమంటారా ?'

'మా ప్రయత్నాలు ఎలాగూ విఫలమయ్యాయి. పోనీ నువ్వన్నా ప్రయత్నించు. ఎదుగూ బొదుగూ లేని ఆ గుమాస్తా వుద్యోగం ఎన్నాళ్లు ? రేపు నలుగురు పిల్లలు పుడ్తే సులోచన యివాళ తృప్తిపడినట్లు తృప్తిపడగలదా ? యివాళంటే పెళ్లి తప్పిపోయిన ఆ షాక్ వల్ల లభించిన జీవితంతో రాజీపడ గలిగింది. కానీ ముందు ముందు రాజీపడి వూరుకోగలదా ? వూరుకోలేదు కనుక మనం 'ముందుచూపుతో' వాళ్ల భవిష్యత్తును గురించి ఆలోచించటం మంచిది.'

అందరూ ఆ అభిప్రాయంతో ఏకీభవించారు.

* * *

'గోపీచంద్ సన్మానానికి అంగీకరిస్తాడని చెప్పేనా? అంగీకరించాడు. నా స్నేహితురాలి నుంచి వుత్తరం వచ్చింది—యిదిగో.'

కానీ కాంతారావు వుత్తరం తీసుకోలేదు. ఆనందించలేదు.

'నా వోటమిని విచారంతో అంగీకరిస్తున్నాను. అతను సన్మానాలకి విముఖుడన్న నా వూహ పొరపాటు కావటం చాలా దురదృష్టం. అతను అంగీకరించడన్న నమ్మకంతో అతని రచనల మీద వో మంచి వ్యాసం తయారుచేసేను. అతని జవాబు చూచుకొని ప్రచురిద్దామనుకొన్నాను. యిక యిప్పుడా అవసరం లేదేమోననిపిస్తోంది. ఎందుకంటే సన్మానానికి డేట్ ఫిక్స్ కూడా చేసేం. వుత్తరం రాసేం. అతని నుంచి ఆ సంస్థ వారికి నిన్ననే వుత్తరం వచ్చిందిట'.

'అయితే. వ్యాసం ప్రచురించే అవకాశం, అవసరం యింకా ముఖ్యంగా వుంది కదా ? వ్యాసాన్ని ప్రచురించననంటారేం ? అతను సన్మానానికి అంగీకరిస్తే మీకెందుకు విచారంగా వుండటం ?'

'ఎందుకంటే— నువ్వు చెప్పిందంతా విన్నాక, అతని రచనలు చదివేక అతని మీద నాకు సదభిప్రాయం కలిగింది కనుక ! అతని అభివృద్ధిని నేను కాంక్షిస్తున్నాను కనుక !'

'అంటే? రచయితలు సన్మానాలు చేయించుకోటం తప్పంటారా!'

'ఏ వ్యసనాలు, దుర్గుణాలు, వ్యామోహాలు లేని ఆదర్శ రచయితగా అతడిని నేను వూహించాను అరూ. కానీ అతనిలోనూ బలహీనతలున్నాయని రుజువయింది అంతే.'

అరుంధతి వొత్తిడి వల్ల సన్మానానికి ముందుగానే తను రాసిన వ్యాసాన్ని ప్రచురించాడు కాంతారావు.

సన్మానానికి వొక రోజు ముందుగానే వచ్చాడు గోపీచంద్. అరుంధతి పట్టుదల వల్ల సులోచనను కూడా వెంట తీసుకొచ్చాడు. బస కూడా వాళ్లింట్లోనే.

'నా రచనల మీద మీరు వ్రాసిన వ్యాసం చాలా బాగుందండీ. నా రచనలలో నేను చూడని లోతుల్ని కూడా మీరు చూడగలిగేరు. విమర్శకుడి లక్షణం అది. థేంక్స్.'

గోపీచంద్ కాంప్లిమెంట్స్‌కు సమాధానం చెప్పలేదు కాంతారావు. మర్నాడు కాంతారావుతో పత్రికాఫీసును చూడటానికి వెళ్లేడు గోపీచంద్. స్నేహితురాళ్లిద్దరూ ఆ సమయంలో కబుర్లు తవ్విపోసుకొన్నారు.

'నీ అనుమానాలు, భయాలు వ్యర్థమయినవి. నువ్వు యమ్మే పూర్తి చెయ్యి లోచన. నేను చాలా ఆలోచించి చెప్తున్న సలహా యిది.'

'గోపీచంద్ కూడా నన్ను వొత్తిడి చేస్తున్నాడు. నువ్వూ అదే సలహా యిచ్చావు. కనుక పూర్తిచేస్తాను. కానీ మా మిత్రబృందంలో సభ్యురాలు రాసింది— మా ప్రొఫెసర్ నేను కొంత కాలం కాలేజీకి వచ్చి క్లాస్‌లు అటెండ్ అవుతేనే కాని పరీక్షకు పంపనంటున్నాడట.'

'అయితే యూనివర్సిటీకి వెళ్లి కొంతకాలం వుండు. నేను బి.ఏని అలాగే కదా పూర్తి చేసేను. గుర్తులేదా ?'

'ఎందుకు లేదు ? మనిద్దరం స్నేహితులమయినందుకు యిద్దరికీ వున్నతులైన భర్తలు చిక్కేరు— మీ శ్రీవారి లాగే నన్నూ మావారు యమ్మే పూర్తి చేయమని వొత్తిడి చేయటం యాదృచ్ఛికమే అయినా ఆనందంగా లేదూ ?'

ఆ సాయంకాలం గోపీచంద్‌కు సన్మానం జరిగింది.

వక్తలు సమకాలీన సాహిత్యం మీద తమ తమ అభిప్రాయాల్ని చెప్పేరే కాని ఎవరూ గోపీచంద్‌ను పొగడలేదు. పైగా అతను యింకా మంచి రచనల్ని చేయాలని వాంఛించారు.

పొగడ్తలు లేకపోయినా పూలదండలు బాగానే వేసేరతనికి. శాస్త్రోక్తంగా సన్మాన కార్యక్రమాన్ని నడిపించేదెవరో సారథి. గంధ ఫల పుష్పాదులతోపాటు మంచి శాలువాను కప్పేడు — కొంత డబ్బును చదివించాడు.

సన్మానానికి సమాధానం యిస్తూ తన రచనల్ని గురించి తనే చెప్పుకొన్నాడు గోపీచంద్. సన్మానానికి కృతజ్ఞతలు చెప్పి తనకు యిచ్చిన డబ్బును ఆ సంస్థకే చదివించేసేడు.

'నా రచనల్ని గురించి వక్తలు మరికొంత ప్రిపేర్ అయి మాట్లాడినట్లవుతే బాగుండేది ?' యింటికొచ్చాక గోపీచంద్ అన్నాడు.

'మీరు మీ రచనల్ని గురించికాక సమకాలీన సాహిత్య ధోరణులను గురించి — మీ పాత్రను గురించి మాట్లాడితే బాగుండేదనుకొన్నాను నేను' కాంతారావు అన్నాడు సూటిగా.

'నాకు సన్మానం అయినప్పుడు వక్తలుగాని నేనుగాని నన్నుగురించే మాట్లాడాలనుకొంటాను నేను. సమకాలీన సాహిత్య చర్చకు సన్మాన వేదిక అక్కర్లేదు కదా ?'

'ఏసీ ! సన్మానవేదికను సాహిత్య చర్చను వుపయోగించుకో కూడదని మీ అభిప్రాయం అన్నమాట !'

'అవును. దేనికైనా సందర్భోచితం వుండాలి.'

'మీరు మాట్లాడితే బాగుండేది అన్నయ్యగారూ.'

సులోచన మాటలకి మెల్లగా నవ్వేడు కాంతారావు

'నేను మాటకారిని కాదమ్మా. రాతగాడిని.'

గోపీచంద్ తప్ప మిగతా యిద్దరూ అతని మాటలకి నవ్వేరు. గోపీచంద్ మాత్రం ప్రశ్నార్థకంగా చూచాడు కాంతారావువైపు ?

భోజనాలయ్యాక తిరుగుప్రయాణం అయ్యారు దంపతులు. సన్మానం ఏర్పాటుచేసిన సంస్థ సభ్యులు వారికి స్టేషన్‌లో వీడ్కోలిచ్చారు.

'గోపీచంద్‌పట్ల మీ ధోరణి నాకు చిత్రంగా కన్పించింది' అన్నది స్టేషన్‌నుంచి తిరిగిరాగానే అరుంధతి.

'యీ సన్మానం ఏర్పాటుచేసిన మనం, వారిద్దరికీ వొకవిధంగా కీడు చేసేమేమో అరూ ! నేను అందుకు విచారిస్తున్నాను.'

'అదేలా ?'

'అన్ని బలహీనతలలోకల్లా మనిషికున్న తీవ్రమైన బలహీనత ఏమిటో చెప్పగలవా అరూ ?'

ఎన్నెన్నో చెప్పింది అరుంధతి. అన్నీ కాదన్నాడు కాంతారావు.

'మనిషి నువ్వు చెప్పిన బలహీనతల నన్నింటినీ జయించవచ్చునేమో ! కానీ విశ్వామిత్రుడు సైతం జయించలేని బలహీనత వొకటుంది. పైకి కన్పించని బలహీనత అది.'

'భలేవారే సౌమ్యత తప్ప కోపం ఎరుగని గోపీచంద్‌ని విశ్వామిత్రుడిని చేసేరే ! యింతకి ఆ బలహీనత ఏమిటో చెప్తారా !



## దాగుడు మూతలు

'చెప్పను కానీ గోపీచంద్‌లోని ఆదర్శాలని, ప్రతిభని, మంచి తనాన్ని ఆ బలహీనత మింగేయకూడదని కోరుకుంటున్నాను.'

''మొత్తానికి పత్రికా సంపాదకుడిబుద్ధి పోనిచ్చుకొన్నారు కాదు!'' అంటూ గలగలా నవ్వింది అరుంధతి !

## 8

'ఏవండీ గోపీచంద్ గారుండేది యీ యింట్లోనేనా ?'

వెంకటస్వామి మంచంలో పడుకొని కారు యింటి ముందు ఆగటం గమనించాడు. కొడుకు పేరు విని లేచి కూర్చున్నాడు. పొగాకు కాడలు దిండు క్రింద నుంచి తీసి చుట్ట చేయసాగాడు.

'అదిగో అదే యిల్లు, ఆ మంచంలో కూర్చున్నాయనే గోపీచంద్ తండ్రి' వెంకటస్వామి మనసులో గర్వం ఆనందం ! ఠీవీగా కూర్చున్నాడు.

గోపీచంద్ కోసం కాకపోతే యీ యింటికి కారులో ఎవరొస్తారు ? అసలు గోపీచంద్ కార్లలో తిరగవల్సిన వాడు కాదూ ! తన నడుంవిరగబట్టి కాని లేకపోతే...ఏమిటో ? తన కొడుకు గొప్పతనం అంతా పైకి రాకుండా పోయింది. కానీ అతడు గొప్పవాడు కావాలి. ఎప్పుడోప్పుడు అవుతాడు. అయితీరతాడు.

'ఏమండీ గోపీచంద్ గారు...'

'ఆఁ అఁ...వాడు నా కొడుకే ఆఫీసుకు ఎళ్ళేడు. యింతకీ మీరెవరూ ? వాడితో ఏం పని ?'

'ట్రైన్ లేట్ కావడంవల్ల రావటం ఆలస్యం అయిందండీ. లేక పోతే వారు ఆఫీసుకు వెళ్ళకముందే రావల్సింది నేను. నేను మద్రాసు నుంచి వస్తున్నా. వో ఫిలిం కంపెనీ మేనేజర్‌ని. శ్రీమన్నారాయణ అని సుప్రసిద్ధ దర్శకుడు— పేరు మీరు వినేవుంటారు, ఆయన పంపేరు. ఆఫీసుకు వెళ్తాను. అడ్రస్ చెప్తారా ? అర్జంటుగా కలవ్వాలి వారిని'




సినిమా వాళ్ళే ? సినిమా వాళ్ళంటే చాలా గొప్పవాళ్ళు. వారే మనిషిని పంపేరంటే చాలా పెద్ద పని అయివుంటుంది. తన గోపయ్య తప్పకుండా గొప్పవాడు కాబోతున్నాడు.

'అట్లా కూర్చోండి' అంటూ అతనితో అని 'లోచనమ్మా' అంటూ లోపలికి కేకవేసేడు.

లోచన అంత వింటూనే వుంది. ఆమె యూనివర్శిటీకి వెళ్ళటానికి ప్రయాణ సన్నాహాల్లో వుంది. సాయంత్రం ప్రయాణం. అందుకోసం గోపీచంద్ మధ్యాహ్నం నుంచి శెలవు పెట్టి వస్తానన్నాడు. యింతలో ఈయనను ఆఫీసుకు పంపటం ఎందుకు ? రెండు గంటలకు రమ్మంటే సరిపోలే ?

'అలాగేనండీ. రెండు గంటలకి వస్తాను' అంటూ వెళ్ళేడా వ్యక్తి.

ఇంటికి రాగానే సినిమా వాళ్లెవరో వచ్చారన్న వార్త చెప్పింది సులోచన. వింటూనే సంతోషించాడు గోపీచంద్. ఏమిటేమిటో మాట్లాడేడు.

'శ్రీమన్నారాయణ మంచి దర్శకుడే కదూ లోచనా ? నా నవలల్లో ఆయనకు ఏది నచ్చిందో?'

ఎన్నో గొప్ప గొప్ప విషయాల దగ్గర హుందాగా, నిర్వికారంగా వుండే భర్త, రచయితగా అంత మామూలుగా వుంటాడేం ? చిన్న చిన్న అంశాలకే అంతగా సంతోషిస్తాడేం ?

రెండు గంటలకొస్తానన్న ఆ సినిమా వ్యక్తి మూడున్నరకొచ్చాడు. ఆ గంటన్నరలో గోపీచంద్ కంగారు... ఆందోళన చూచి విస్తుపోయింది సులోచన !

సినిమా కంపెనీ మేనేజర్ వస్తే మాత్రం ?

మిగితా విషయాల దగ్గర అతను ప్రదర్శించే ఔన్నత్యం, హుందా, ఆ సినిమా వ్యక్తితో మాట్లాడుతున్నప్పుడు కనబడదేం ?

శ్రీమన్నారాయణగారి వుత్తరం చదువుకొని సంతోషించాడు.

'అరె ! నన్ను వెంటనే బయలుదేరి రమ్మన్నారే ! యిప్పుడెలా ?'

'మేం ? సినిమా వాళ్లం. రిజర్వేషన్లు అవీ మాకో ప్రోబ్లమ్ కాదు. మనం ఎంత త్వరగా వెళ్తే అంత మంచిది. నేను మధ్యలో పని వుండి విజయవాడలో ఆగటం వల్ల యిక్కడికి రావటం అసలే ఆలస్యమయింది. దర్శకుడుగారు ఎదురు చూస్తూంటారు మనకోసం. ఆయన తీస్తున్న పిక్చర్స్ యిప్పుడు మూడున్నాయి. బిజీపర్సన్. రామారావుగారు వుత్తరంలో అన్నీ రాసేరు గదా ?'

'రాసేరు. కానీ మా ఆవిడను యూనివర్సిటీలో దించటానికి ప్రయాణంలో వున్నామే మేమూ ? ఉండండి. మా సులోచనతో మాట్లాడుతాను' అంటూ లోపలికొచ్చాడు గోపీచంద్.

సులోచన వాల్తేరుకు అంతకుముందు వొంటరిగానే వెళ్తానంది. అలా వీల్లేదనీ, తనూవచ్చి అక్కడ అందరినీ కల్సి, తగు ఏర్పాట్లు చేసి రావటం భర్తగా తన బాధ్యత అంటూ బలవంతం చేసి తనూ ప్రయాణమయ్యాడు.

'లోచన్. యిప్పుడేం చేద్దామంటావ్ ? మద్రాసు ప్రయాణం వచ్చిందే— అనుకోకుండా ?'

'అక్కడికి నాలుగురోజులు ఆగిపోవచ్చు గదండీ? యింతలో మునిగిపోయిందేముంది ? ప్రయాణానికి మనం అంతా సిద్ధం చేసుకొన్నాంగా? వచ్చేవారం వస్తానని చెప్పి పంపకూడదూ అతడిని ?'

'అది బాగుండదేమో లోచన్ ! మీ రామారావు బాబాయ్‌గారు కూడా వుత్తరం రాసేరు నీకు వాల్తేరు కొత్తేం కాదుగా ? పోనీ నువ్వు వెళ్లరాదూ ? నేను మద్రాసు నుంచి నేరుగా వాల్తేరు వస్తాను.''

సులోచన యింకేమనగలదు ? ఆమెను యిటు వాల్తేరుకి బండెక్కించి, గోపీచంద్ మద్రాసు బండెక్కేడు ?

**(ఇంకా వుంది)**




"అమ్మాయిది ఆరేళ్ళ
ప్రాయం చేసేది భరత
నాట్యం, రేపిక లోకమే
నర్తనశాల
హర్షిస్తుందిక లోకం!"

# బోర్న్‌విటాతో పెరిగే ప్రాయం యిది యికే

## వాళ్ళు మిమ్మల్ని మెచ్చుకునే రోజొకటి వస్తుందిక!

పెరిగే వయస్సులోని పిల్లలు మరే మాల్టెడ్ ఆహార పానీయమూ కాకుండా బోర్న్‌విటాయే ఎందుకు కావాలంటారు? రెండు తరాల్లోని తల్లిదండ్రులు వాళ్ళ పిల్లలకి యిక మరేదీ కుదరదని ఎందుకు పట్టుబడతారు?

కేవలం ఝూమ్ అనిపించే రుచి మాత్రమే కాదు. మరి కేవలం బోర్న్‌విటా పేరు చూసీ కాదు. ఉంది అందులో మరేదో. ఉంది యింకా మరెంతో. అదే మరి బోర్న్‌విటా, పెరిగేందుకు తోడ్పడే ఆహార పానీయం.

1 కి.గ్రా. ప్యాక్‌లో కూడా దొరుకుతుంది.
దీని లోపల ఉంది ఉచితంగా లభించే మగ్.

క్యాడ్‌బరీస్
**బోర్న్‌విటా**
పిల్లలు సరిగ్గా పెరగడం,
అందుకే మరి బోర్న్‌విటా యివ్వడం.







OBM/3783 TEL




### జి. వి. కె. ఆర్. – కాశీబుగ్గ

"సర్కమ్‌సిషన్" ఆపరేషన్ అంటే ఏమిటి? "సునితీ" చేయించుకోవటం అంటే ఏమిటి?

★ ఈ రెండూ ఒకటే! మగవారి జననాంగం చివరి భాగం-మీదనున్న చర్మాన్ని శస్త్ర చికిత్సద్వారా తీసివేయటాన్ని సర్కమ్‌సిషన్ అని అంటారు. ఇలా చేయటం వల్ల అంగం-మీద స్మెగ్మా అనే తెల్లని "పాచి"వంటి పదార్థం పేరుకోదని తద్వారా స్త్రీ-పురుషులిరువురికీ కేన్సర్ వచ్చే అవకాశం తక్కువ అనీ నిపుణుల అభిప్రాయం.

### ఎ. పి. మరియు ఎల్. – తెనాలి

మా యిద్దరికి పెళ్లి నిశ్చయం అయింది. వివాహం అయిన 1, 2 సం.ల దాకా పిల్లలు కలుగకుండా ఉండాలంటే ఏ మాత్రలు వాడాలి? మొదటిసారే ఈ విధంగా చేయటం మంచిదేనా?

★ పిల్లలు పుట్టకుండా ఉండటానికి ఓవ్‌రాల్, ఓవ్యులెన్ మొదలయిన మాత్రలు వాడవచ్చును. ఈ మాత్రలను స్త్రీలు మాత్రమే వాడాలి. ముందు నుంచీ మాత్రలు వాడకం కన్నా నిరోధ్ వాడటం మంచిది.

### ఎన్. ఎన్. ఆర్. – గరుడభద్ర

నా వయస్సు 17 సం.లు. మోటర్ సైకిల్, స్కూటర్ మీద వెళ్లినప్పుడు నా కంటి నుంచి నీరు కారుతుంది. ఇది ఏమైనా లోపమా?

మా తాతగారి వయస్సు 78సం.లు. బ్లడ్‌ప్రెషర్ ఎక్కువగా ఉంది. కొంచెం దూరం నడిస్తే ఆయాసంగా ఉంటుంది. ఎన్ని మందులు వాడినా నయం కాలేదు.

★ కళ్లకి గాగుల్స్ వాడకుండా స్కూటర్ మీద ప్రయాణం చేస్తే గాలి, దుమ్ము ప్రభావం వల్ల కళ్లలో నీరు కారటం సహజం.

మీ తాతగారిని ఫిజీషియన్లకి చూపించి, బ్లడ్‌ప్రెషర్ తగ్గటానికి, అడెల్ఫేన్ - ఎసిడ్రెక్స్, ఆల్‌డోమెట్ వంటి మందులు వాడాలి. అడపా దడపా హృదయపు పని తనాన్ని ఇ.సి.జి. మూలంగా కనిపెడుతూ ఉండాలి. □

# ఓ వీధి భాగోతం

కెప్టెన్ షేక్ మౌలాలీ

ఆంధ్రదేశంలో ఒక నగరం అది. అందులో ఓ వీధి. వీధి అనేకంటె 'సందు' అంటేనే బావుంటుంది. కాని మునిసిపాలిటి దానిని వీధిగ గుర్తించింది. మనిషి నిల్చుని రెండు చేతులు అడ్డంగ చాచితే సందు కిరువైపుల గోడలు తగులవలసిందే!

దాదాపు రెండు ఫర్లాంగుల పొడవున్న ఆ సందులో ఒకప్పుడు రిక్షాబండి ఇదుకు వంతెనపై లేల్యాండ్ లారీలాగ వెళ్ళగలిగేది. కాని ఇప్పుడు ఒక్కమనిషి మాత్రమే వెళ్ళగలిగిన స్థలం ఉంది. అదీ జాగ్రత్తగా వెళ్ళగలిగితేనే!

దీనికి కారణం లేకపోలేదు.

కుటుంబనియంత్రణ ప్రచారం ప్రభుత్వం, రేడియో, పత్రికలు ఎంత విరివిగా జరిపినా — "మా పిల్లలే ఈ దేశానికి బరువయ్యారా!" అనుకుంటూ ఇంటికి అరడజనుకు తగ్గకుండ పోటీలుపడి మరీ కన్నారు పిల్లల్ని!

కాని వసతులు మాత్రం పెరగలేదు.

ఓ రోజు, ఓ యమ్మ పిల్లవాడి 'పురిటి పొత్తి'ని వీధిలో పడవేసింది. దానికోసమే కాచుక్కూర్చున్న ఓ కాకి ముక్కుతో దానిని నాలుగు పోట్లు పొడిచి పక్కవాకిట్లో పడేసింది.

అక్కడే కథ మొదలైంది.

ఆ ఇంటావిడ 'గయ్'మని లేచింది. 'పొత్తి'ని తీసెయ్యమన్నది.

"నేను వేయలేదు కనుక తీసే ప్రశ్న లేదని" వచ్చింది సమాధానం.

మాటా—మాటా పెరిగింది.

"అయితే యిక నుండి మా పిల్లల్ని మీ వాకిలి ఎదురుగుండా కూర్చోపెడతా" నంది.

"సరే చూద్దాం!" అంటే "సరే!" ననుకున్నారు.

మొత్తం మీద ఆ రెండిళ్ల పిల్లలు నడి వీధిలో కూర్చోటం మొదలెట్టారు.

"ఇదేదో ఆడవాళ్ల విషయ" మనుకొని మగాళ్లు సరిపుచ్చుకున్నారు.

ప్రక్క యిళ్ల వాళ్లందరికి వళ్లు మండింది. వారి పిల్లలు కూడా బజారును అలంకరించ సాగారు.

ఇదంతా చూసి రాత్రిళ్లలో 'మునలా — ముతకా' కూడ ఉపయోగించ ప్రారంభించారు.

వాటిమీద కసవూ, చచ్చిన ఎలుకలూ చేరి



# ఓ వీధి భాగోతం

'కుళ్ళు రాజకీయాల కంపు'ను గుర్తుకు తేసాగింది.

కాని అక్కడి ప్రజ దానికి యిమ్యూన్ అయిపోయింది.

''ఎంత శుభ్రం చేసినా ఈ వీధి బాగు పడదని'' మునిసిపాలిటీ వారు అలిగి ఆ వేపు రావటం మానివేశారు.

అందుకే ఒక్కమనిషి మాత్రమే ఒకసారి ఆ వీధిలో అడుగులు జాగ్రత్తగా వేసుకుంటూ [కొత్తగా డ్యాన్సు నేర్చుకునేవారిలాగ] వెళ్ళగలడు ఒక్కోసారి లాంగ్‌జంప్, హైజంప్ కూడ చేయాల్సివస్తుంది.

ప్రక్క వీధులవారు ఆవేపు రావటం మానివేశారు.

ఇది ఒక విధంగ ఆ వీధి ఐకమత్యాన్ని, ప్రత్యేకతను, సమరసత్వాన్ని చాటుతుంది.

కొంత కాలానికి వీధి రెండు చివరలా రెండు ఆసుపత్రులు కూడ వెలిశాయి.

కొంత కాలం గడిచింది.

అక్కడ వారందరికీ ఉన్నట్లుండి తళుక్కున ఓ ఆలోచన తట్టింది.

ఆ వీధిలో నీళ్ళ కుళాయి లేదు. వేయించాలనుకున్నారు.

సంతకాల సేకరణ జరిగింది. అర్జీలు వ్రాశారు. తిట్టుకుంటూనే ముడుపులు చెల్లించారు. వంతుల ప్రకారం ఆఫీసు చుట్టూ తిరిగారు.

కుళాయి శాంక్షన్ అయినట్లు తెలిసింది. ఆ రోజు పండుగ జరుపుకున్నంత పని అయింది.

రోజుల తరబడి ఎదురు చూశారు.

''అదిగో వస్తుంది, ఇదిగో వస్తుంది !'' అన్నారు.

కాని కుళాయి రాలేదు.

ఓసారి ఆఫీసులో కనుక్కున్నారు.

''అర్జీలు శాంక్షన్ చేసేది ఒక సెక్షన్, దానిని వేసేది మరో సెక్షన్'' అని తెలిసింది.

వారిచుట్టూ ప్రదక్షిణలు చేశారు.

దక్షిణ చెల్లించుకున్నారు. లోలోపల సహస్ర నామార్చన (తిట్లు) చేశారు.

ఒక రోజు కొందరు కూలీలు వచ్చి వీధి పొడవునా నడుములోతు గొయ్యి తవ్వారు.

ఒక నెల గడిచింది.

దానిని పట్టించుకున్న నాథుడు లేదు.

ఈ మధ్య నలుగురు పిల్లలు, నలుగురు ముసలాళ్ళు కాలుజారి అందులో పడ్డారు.

వీధి జనమంతా ఆఫీసు చుట్టూ తిరిగి వరపడ్డారు.

''వర్షంమూలాన పని ఆగింది. నాలుగు రోజుల్లో వస్తాం'' అన్నారు.

వర్షం ఎప్పుడు కురిసిందో అర్థంకాలేదు జనానికి.

తీరా మునిసిపాలిటీవారు వచ్చేసరికి ఆయమ్మ, ఈయమ్మ వేసిన కసివుతో గొయ్యి సగం పూడిపోయింది.

''మేము తవ్విన గోతిని పూడ్చారు కనుక మీరే దీనిని తిరిగి తవ్వాలి!'' నిక్కచ్చిగా అన్నారు.

ఎవరి యింటిముందు మట్టిని వారు తీశారు.

మొత్తంమీద వీధి మధ్యలో ఒక కుళాయి వెలిసింది.

లాంగ్ జంప్, హైజంప్, భరతనాట్యం వగయిరా చేస్తూనే బిందెమీద బిందె నీళ్ళు అందుకుందామనుకున్నారు పాపం వీధి వారంతా.

వీధికి ఉన్న ఉక్కగా ఒక్క 'బావి' ఆ క్షణంలో 'అడ్డు' అనిపించింది. వెంటనే చెత్తా చెదారం వేయటం మొదలెట్టారు. ఓ తాత ఈ పని వద్దని కొళాయి నీళ్లు వచ్చాక బావి పూడ్చొచ్చని మొత్తుకుంటున్నా వినకుండా ఆ పని ప్రారంభించారు.

నాలుగు చేతులూ కలిశాయి.

అరగంటలో బావిని పూడ్చారు.

''రేపు ఉదయం నీళ్ళ వస్తాయని'' పంపు బిగించినవాళ్లు చెప్పి వెళ్లారు.

ఆ రాత్రి ఏ యింటి ఇళ్లాలికీ నిద్ర పట్టలేదు. ఆదవా కన్ను మూత పడినా కుళాయి కానవచ్చేది. ఎదురింటావిడో, పక్కయింటావిడో ముందు బిందె వేసినట్లు, తనకంటే రెండు బిందెలు ఎక్కువ పట్టినట్లు కల వచ్చేది. వెంటనే కలవరింతలు. లేచి కూర్చోటం.

తొలికోడి కూసింది.

అంతా లేచి చింతపండు గ్రటా వేసి బిందెలు తోమటం మొదలు పెట్టారు.

తిరిగి నాలుగున్నర గంటలకు మళ్లీకోడి కూసింది.

ఇళ్లల్లో బిందెలవీ వీధిలోకి వచ్చాయి. ఆ చీకట్లోనే భరతనాట్యం చేశారు. కొందరు ఒడిస్సీ చేస్తే మరికొందరు కథాకళి చేశారు.

కుళాయికి ఇరువైపులా బిందెలు వంకలో పెట్టుకొని వరుసగా నిలువబడ్డారు.

చంద్రుడ్ని మింగటానికి రాహుకేతువులు ఒకేసారి తారసపడ్డారా అన్నట్లున్నాయి ఆ క్యూలు.

''పంపు ఐదింటికే వస్తుందన్నారే ?'' అంది ఒక మధ్యవయస్కురాలు.

''పంపు నిన్ననే వచ్చిందిగా ! ఇప్పుడు రావలసింది నీళ్ళు !'' చమత్కరించింది ఒక పడచు గొంతు.

ఆవిడవైపు 'కొర–కొరా' చూసిందా మధ్యవయస్కురాలు.

తెల్లవారింది.

కాని నీళ్ళు రాలేదు.

వారు నిలుచున్నచోట పాతడబ్బాలు, కుండపెంకులు గుర్తుగా పెట్టుకొని ఇళ్ళకు వెళ్ళారు.

గబగబా ముఖాలు కడుక్కొని ఆత్రంగా బిందెలు తీసుకొని తిరిగి వీధిలోకి ఉరికారు.

అదో కొత్తరకం 'రన్నింగ్ రేస్'లా ఉంది.

సూర్యుడు చెట్లచాటునుండి పైకివచ్చాడు. ఎండాకాలం మూలాన కర–కర లాడుతున్నాడు.

చిన్నపిల్లలు నిద్రలేచి వారి కార్యక్రమం సాగించారు.

మహిళలకు ఓపిక తగ్గింది. సహనం నశించింది. నిల్చోలేకపోతున్నారు.

ఇటీవల హైదరాబాదు ఆంధ్రబాలానంద సంఘంలో ప్రొ. బి.వి. పట్టాభిరామ్ హిప్నాటిజం తరగతులు నిర్వహించిన సందర్భంగా విద్యార్థులు ఒకరు నొకరు హిప్నటైజ్ చేస్తున్న దృశ్యం.



''ఇంతకూ నీళ్ళు వస్తాయా ?'' అందొకామె.

''రాకపోతే ఎందుకు నిల్చోటం. తిరిగి వెళ్ళరాదూ ?'' మరొక యువతి సమాధానం.

''నువ్వే వెళ్లరాదూ !''

''నువ్వే పో !''

''జాగ్రత్త !'' అంటే ''జాగ్రత్త'' అనుకొని చెమటలు తుడుచుకున్నారు.

కొన్ని నిముషాలు గడిచాయి. ఎవరికీ ఏమీ తోచటంలేదు.

''ముదనష్టపోళ్లు !'' అందొక గొంతు.

''ఎవరు ?'' అందుకుంది ప్రక్కనున్న మహిళ.

''ఓట్లకోసం వస్తారే ... వాళ్లు'' దీర్ఘం తీసింది.

''నీళ్ల తెచ్చేందుకే వారున్నారా ? ''

''మరి ఎందుకున్నట్లు ?''

''మనం ఎన్నుకున్నాం కనుక !''

''మన వసతులు చూడొద్దా ?''

''వసతులంటే ?''

''రోడ్డు, బస్సు, కరెంటు, నీళ్ల గట్రా అన్నీ.''

''ఇవన్నీ చేయటానికి వేరు వేరు శాఖలున్నాయి. నీళ్ల మాత్రం మునిసిపాలిటి వారి బాధ్యత'' చదువుకున్న ఒక మహిళ విశద పర్చింది.

''పోనీ వాళ్లే ననుకోండి !''

''కౌన్సిలర్ ఏడీ పత్తాలేడు !''

''మళ్లా ఎలక్షన్ల నాటికి కనపడతాడు !''

''పాపం పంపేయించాడు కదా !'' కౌన్సిలరుకు వత్తాసుగ పలికింది ఆ కులపు వనిత.

''అతనేం ఏయించలా... మనమే తలా కాస్త లంచం యిచ్చి ఏయించుకున్నాం.''

''నువ్వు కవున్సిలరు అయితే అన్నీ చేస్తావా ?'' సాగదీసింది.

''అమ్మాయ్, మాటలు జాగ్రత్తగా రానీయ్ !''

సంభాషణ అంతటితో ఆగింది.

ఎనిమిది గంటలు కొట్టింది.

కాళ్ళు పీక్కుపోతున్నయి.

ఇంతలో వీధి చివర పాలవ్యాను కనపడింది. గబగబ వెళ్ళి ప్యాకెట్లు అందుకున్నారు. అర క్షణంలో కాచి కాఫీలు కలిపి భర్తలకు పిల్లలకు యిచ్చి పర కడుపుతోనే వీధిలోకి పరుగెత్తారు.

ఎనిమిదిన్నర కావచ్చింది. కళ్ళు బైర్లు మ్ముతున్నయి. ఇంతలో పది పాములు ఏక కాటిగ బుసకొట్టినట్లు పంపులో శబ్దం గాసాగింది.

అంతా ఆత్రంగ తోసుకుంటున్నారు.

''నేను ముందంటే నేను ముంద''ను కుంటున్నారు.

''అసలు నీళ్ళు రానీయండమ్మా ! తలా ఒకటి పట్టుకోవచ్చు!'' అందో పెద్ద యిల్లాలు.

'గ్యాస్' రావటం ఆగింది.

''పరవాలేదు ! ఇక నీళ్ళొస్తయి.'' అని చకోర పక్షుల్లా ఎదురు చూడసాగారు.

కాని నీళ్ళు రాలేదు.

తొమ్మిది గంటలయింది.

''అదో నీళ్ళొచ్చాయి'' అంది ఓ పదేళ్ళ అమ్మాయి. అంతా చెమటలు తుడుచుకున్నారు.

భాగ్యలక్ష్మి లాటరీలో తలా లక్ష రూపాయిలు వచ్చినంత సంబర పడ్డారు.

''అమ్మాయ్ ! కింద పోనీ కుండ పట్టుకోండమ్మా !'' వెనుక నుండి యాభై ఏళ్ళ ముత్తైదువు కేకవేసింది.

''నీళ్ళు యింకా రానే లేదు. నాలుగు బొట్లు రాలాయి.'' ఒక యువతి నిట్టూర్చింది.

''తొందరేముందిలేమ్మా ! రాక ఎక్కడకు పోతుంది ! కాస్త ఓపిక పట్టాలి, మొదటి రోజు కదా'' మరో మహిళ ఓదార్చింది.

కొన్ని నిముషాలు ఓపిగ్గా, నిశ్శబ్దంగ నిల్చున్నారు.

తిరిగి అలజడి మొదలైంది.

'పోనీ ఇవ్వాల్టికి బావి నీళ్ళు తెచ్చుకుంటే సరిపోదూ !'' అన్నారొకరు.

''బావిని పూడ్చారుగా, ముదనష్టపు పంపును నమ్ముకొని !''

''రోజూ యింతే నేమో !''

''ఏమో ఎవరు చూచారు !''

మార్తాండుడు తీక్షణంగ నవ్వుతున్నాడు. అందరి కళ్ళూ తూలుతున్నయ్.

పది గంటలయింది.

వీధి మగవారు తమ తమ పనులకు బయలు దేరారు.

''ఏమండీ ! కాస్త ఫోను చేసికనుక్కోండి!'' ఓ యిల్లాలు ప్రాధేయపూర్వకంగ అడిగింది.

వీధి చివర ఆసుపత్రినుండి వాటర్ సప్లయికి ఫోను చేశారు.

''ఏమన్నారండి ?''

''ఏమంటారు ! నీళ్ళు వదిలామన్నారు !'' నీళ్ళు నములుతూ సమాధానమిచ్చాడు.

వదిలిన నీళ్ళు రాకుండ ఏమయ్యాయి.

''అదీ అడిగాను. పక్క వీధిలో అంతా యిళ్ళకి మోటార్లు బిగించారంట.''

''అంటే !''

''వదిలిన కాసిని నీళ్ళు వాళ్ళ మోటార్లు లాగేస్తాయి.''

''మరి మన సంగతి ?''

''మన సంగతి యింతే ! ప్రెజర్ చాలక మనకు రావు.''

''అది అక్రమం, అన్యాయం కదూ !''

''అవును !''

''మరి రిపోర్ట్ చేస్తే ?''

''ఎవరి మీద...ఏమని.''

''వారి మీద...మోటార్లు బిగించారని.''

''ఆ వీధిలో అంతా ధనవంతులు, అధికార్లు ! వారిమీద ఏ చర్యా తీసుకోరు.''

''ఇప్పుడేం చేద్దాం ?''

''బావిలో వేసిన కసవుని తిరిగి తలా కాస్త తోడేద్దాం !''

''మరి పంపు...''

''అలంకారప్రాయంగ ఉంటుంది.''

ఈ భాగోతమంతా అయ్యేసరికి పదకొండు గంటలయింది.

ఎండ చిటపట మంటుంది.

ఓపికలు నశించిన మహిళలు చైతన్య రహితంగ తమ తమ గుమ్మాల వైపు తిరిగి వెళ్లారు.

అయితే ఈసారి ఎవ్వరూ లాంగ్‌జంప్, హైజంప్, మరి ఏ నాట్యమూ చేయలేదు. దారిలో కుప్పలు తొక్కుంటూనే నడిచారు. ★



సీరియల్

# శ్రావణి



మాడుగుల కృష్ణకుమారి

*(గత సంచిక తరువాయి)*

## 19

"నీ వెనుక జీవితం అంత భయంకరందా ?" అంది శ్రావణి ఆశ్చర్యంగా.

"ఏమనుకున్నావు. ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క చరిత్ర. జీవితంలో కష్టాలు పడ్డాను కాబట్టే, నీ కష్టం గమనించాను. చేతనయితే ఏదన్నా సహాయం చేద్దామని అనుకున్నాను" అంది.

"ఇప్పుడయినా చెపుతావా మీ ఆయన నిన్ను ఎందుకు అనుమానించాడో ? నా శాయశక్తులా నీ సమస్యను పరిష్కరించి నీ కాపురం కుదుట పరుస్తాను" అంది శ్రావణి చేతిలో చెయ్యివేసి.

మొదటి చూపులోనే ప్రమీలను చూడగానే ఆత్మీయురాలిగా అనిపించిన శ్రావణికి శ్రీహరి తనను ఎందుకు పుట్టింటికి పంపేడో చెపుతూ తనకి మాత్రం ఏమీ తెలియదని చెప్పింది.

అంతా విన్న ప్రమీల —

"ఇదన్నమాట జరిగింది. కేవలం నీ మీద అభాండం మాత్రమే కదా. నీకు మాత్రం ఏం తెలియదంటున్నావు. చాలా విచిత్రంగా వుందిది. నేనూ ఎన్నో క్లిష్టతరమైన సమస్యలను ఆధారంగా తీసుకుని ఎన్నో నవల్సు రాశాను. కానీ నీ కేసు చాలా విచిత్రంగా వుంది. కానీ ఇది ఎందుకు జరిగిందో, ఎలా జరిగిందో తెల్సుకుని నీ కాపురం చక్కబరుస్తాను. సరేనా" అంది దృఢచిత్తంతో.

"నాదంత సులభంగా పరిష్కారమయ్యే సమస్య కాదు" అంది శ్రావణి.

"చంద్రమండలానికి వెళ్ళేముందు ఎవ్వరూ వెళ్ళలేమనే అన్నారు. కానీ వెళ్ళివచ్చాక సూర్య మండలానికి కూడ వెళ్ళాలని ప్రయత్నాలు జరుపుతున్నారు. తల్చుకోవాలే కానీ మనిషి సాధించలేనిది అంటూ లేదు. ఈ విషయంలో మావారి సహకారం కూడా నీకు వుంటుంది. ఇంక నువ్వు మనసు నిశ్చింతగా వుంచుకో" అని సలహా ఇచ్చింది.

"అగ్నిగోళాలు బద్దలవుతున్న నా మనసులో శాంతి ఎలా దొరుకుతుందక్కా ?"

"నిరాశను పారద్రోలిననాడే ఆశకు స్థానం వుంటుంది" అంది.

ఏమిటో ప్రమీల మాటలు విచిత్రంగా వుంటాయి. రైల్లో తనని రక్షించటం, తన జీవితాన్ని మళ్ళీ గమ్యానికి చేరుస్తానని వాగ్దానం చెయ్యటం కలలా వుందామెకు. తన సమస్య అంత సులభంగా పరిష్కారం అవుతుందా ?

ఏ మాత్రం పరిచయం లేని వీళ్ళింట్లో ఎన్నాళ్ళని వుండగలదు. దొరికిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోలేకపోయింది. ఇక్కడనుంచి వెళ్ళిపోతే ? ఎక్కడకని వెడుతుంది. కానీ ఏదో చెయ్యాలని ఆరాటం. ఏం చెయ్యాలా అని శ్రావణి ఆలోచిస్తుంటే ...

"శ్రావణీ ! త్వరగా తయారవు మనం ఒకచోటుకి వెడదాం" అంది హడావిడిగా వస్తూనే ప్రమీల.

"ఎక్కడికీ ?" అంది శ్రావణి.

"ముందు తయారవ్వు. వెళ్ళాక నీకే తెలుస్తుంది" అంది.

ఆమె మాటకు ఎదురు చెప్పటం ఇష్టం లేక అయిష్టంగానే తయారయ్యింది.

నర్సింగ్ హోం ముందు రిక్షా ఆగగానే విషయం అర్ధమయిన శ్రావణి ముఖం చిన్నబోయింది.

**జరిగిన కథ—4** బిడ్డలులేని శ్రీహరి, శ్రావణి దంపతులు డాక్టరు దగ్గరకు వెళుతారు. శ్రావణిని పరీక్షచేసి ఆమెకు పెళ్ళికి ముందే బిడ్డలు పుట్టకుండా ఆపరేషన్ జరిగినట్లు చెపుతుంది డాక్టర్. శ్రీహరి శ్రావణిని పుట్టింటికి పంపించేస్తాడు. రైల్లో కూర్చొన్న శ్రావణి జరిగిపోయిన తమ తీయని దాంపత్య జీవితం గురించి తలపోయసాగింది. శ్రావణి తల్లి తండ్రులను చేరుతుంది. కానీ జరిగిన దాంట్లో తల్లి తండ్రులకు భాగం ఉందని తెలుసుకొని ఇల్లు విడిచి వెళ్ళిపోతుంది. ప్రాణం తీసుకోబోతున్న శ్రావణిని రక్షించిన స్త్రీ ఆమెను తన ఇంటికి తీసుకెళ్ళి ఆశ్రయం ఇస్తుంది. శ్రావణి తనకు ఆశ్రయం ఇచ్చిన స్త్రీ ప్రముఖ రచయిత్రి ప్రమీలా కైలాష్ అని తెలుసుకొని ఆశ్చర్యపోతుంది. లక్ష్మయ్య దంపతులు శ్రావణి విషయాన్ని అల్లుడు శేషుకి చెప్తారు. ప్రమీల తన గత జీవిత చరిత్రను శ్రావణికి తెలియపరుస్తుంది.

"ఎందుకక్కా పదిచోట్ల నా లోపం వేలెత్తి చూపించుకోవటానికి కాకపోతే, ఇక్కడికి తెచ్చింది" అంది భారంగా.

"తప్పుగా అర్థం చేసుకోకు. ఈ డాక్టరు నాకు క్లోజ్ ఫ్రెండు. నీ విషయం చెపితే ఒకసారి తీసుకురమ్మంది. మనం చెయ్యబొయ్యే ప్రయత్నానికి ఇది నాంది. కాదనకు" అంది అర్థింపుగా ప్రమీల.

ముభావంగా ఆమె వెంట నడిచింది శ్రావణి.

అంతా పూర్తయాక డాక్టరు ప్రమీలతో చెపుతుంటే అపరాధిలా తల దించుకుని కూర్చుంది శ్రావణి.

"నువ్వుచెప్పింది కరెక్టే ప్రమీలా, ఆపరేషన్ జరిగింది. కానీ అసలామె గర్భవతి కానేలేదు. కాకుండానే ట్యూబెక్టమీ ఎందుకు జరిగిందో చాలా ఆశ్చర్యంగా వుంది. ఇది ఈమెకి తెలియకుండా జరగటం, మరొక ఆశ్చర్యం" అని ఏదో ఇంగ్లీషులో చెప్పింది ప్రమీలకు.

ఆలోచించుకుని చెపుతానని చెప్పింది ప్రమీల.

మరికాసేపటికి ఇద్దరూ బయటకు నడిచారు.

"రుజువయ్యిందా ?" అంది ముందుగా శ్రావణే.

"లేదు. ఎలా జరిగిందో రుజువు కావాలి ముందు" అంది ప్రమీల.

షాపింగ్‌కు వెళ్ళి ఏవో కటింగ్ పేపర్సు మరికొన్ని తనకు కావల్సినవి తీసుకుంది ప్రమీల. అవి మాత్రమే కాకుండా రెండుచీరలు, జాకట్లు కూడా తీసుకుంది శ్రావణి కోసం, ఆమె ఎంత వారించినా వినకుండా.

జరిగేవన్నీ కూడా భరించలేకపోతోంది శ్రావణి.

## 20

భార్యనయితే పుట్టింటికి పంపాడేకానీ అప్పటినుంచి శ్రీహరి పూర్తిగా మారిపోయ్యాడు. ఎప్పుడూ నిరాశగా ఆలోచిస్తూ వుండటంలోనే కాలం గడిచిపోతోందతనికి. అయిదు సంవత్సరాల కాలం శ్రావణి ముంచెత్తిన అనురాగపు జల్లుల తాలూకు అనుభూతులనుండి అతని మనసు మళ్ళించలేకపోతున్నాడు.

శ్రావణి ఇంట్లోలేదన్న విషయం భ్రమేమో అని కూడా అన్పిస్తుంది ఒక్కొక్కసారి.

తను భార్యని పుట్టింటికి పంపటంలో ఏదన్నా పొరపాటు చేశాడేమో అని ఒకొక్కసారి అన్పించినా జరిగింది తల్చుకుంటే మాత్రం భరించలేకపోతున్నాడు. శ్రావణికి, తనకి మధ్యనున్న బంధం చాలా ఎక్కువే. పగలు, రాత్రి, అనే తేడా లేకుండా వంటరిగా గదిలో కూర్చుని భార్య స్మృతులను నెమరువేసుకోవటం

శ్రీహరి వంతయితే కొడుకుని రెండో పెళ్ళి చేసుకొమ్మని పోరటం తల్లివంతయింది.

తన ఒక్కగానొక్క కొడుకు అలా పిచ్చి వాడిగా తయారవటం ఆ తల్లి హృదయం భరించలేక పోరుమొదలుపెట్టింది.

"అమ్మా!" అన్నాడు శ్రీహరి బాధగా.

"ఏరా నేనన్న మాట తప్పంటావా ?" రెట్టించిందావిడ.

"తప్పు ఎంత మాత్రం కాదమ్మా! నీ కొడుకు విషయంలో నీకా ప్రేమ ఉండటం సహజమే. కానీ, ఒకసారి భార్య మరణిస్తే రెండో పెళ్ళికి సిద్ధపడటం భావ్యమమ్మా. అంతేకానీ భార్య బ్రతికి వుండగానే మళ్ళీ పెళ్ళికి తయారయి పెళ్ళాంవున్న పెళ్ళికొడుకుగా నల్గురిలో పేరు తెచ్చుకోవటం నాకు ఇష్టం లేదమ్మా."

"మరి ఆజన్మాంతం పెళ్ళాం వుండికూడా బ్రహ్మచారిగా గడిపేస్తావా ?" అంది కోపంగా.

"ఎలా అనుకున్నా సరేనమ్మా. నా అభిప్రాయం ఒకటే. తొలిసారిగా ఈ ఇంట్లో నా భార్యస్థానాన్ని అలంకరించిన శ్రావణి లేదనుకుని, మరొకరికి నా జీవితంలో స్థానం ఇవ్వటానికి నా మనసు అంగీకరించటంలేదమ్మా" అన్నాడు గద్గదంగా శ్రీహరి.

"నువ్వింత అమాయకుడివికాబట్టే అదలా చేసిపోయింది. ఇలాటివాళ్ళుకూడా వుంటారని తెలిస్తే, ఇక ముందునుంచీ ఆడపిల్లల్ని పరీక్ష చేసి మరీ చేసుకోవాలి" అందావిడ ఈసడింపుగా.

"ఎందుకమ్మా, ఆ అనవసరపు మాటలు. ఆ రోజే వస్తే ఆడపిల్లలే కాదమ్మా మగవాళ్ళని కూడా పెళ్ళికి ముందే పరీక్ష చేస్తారు" అన్నాడు ఆ సంభాషణ భరించలేనట్లుగా.

"అనవసరం కాదురా బాబు. నట్టింట పసిపాపల నవ్వులకోసం, కుమిలిపోయే ఈ తల్లి ఆవేదనతో నీకు పనిలేదు. నీ తండ్రి వంశం నీతో అంతరించిపోయినా నీకేం విచారం లేదు అంతేనా..." మందలిస్తూనే నచ్చచెప్పపోయిందావిడ.

"అమ్మా! ఇల్లాలి జీవితంలో పిల్లల్ని కనటం ఒక భాగమే కానీ సరస్వం కాదమ్మా. జరిగింది విని తట్టుకోలేక ఆమెను దూరం చేసుకున్నాను. శ్రావణి బ్రతికుండగా నాకు మరొక పెళ్ళి జరగటం అసంభవం. దయచేసి మళ్ళీ నా దగ్గర ఆ ప్రసక్తి తీసుకురాకు."

స్థిర నిశ్చయాన్ని తెల్పిన శ్రీహరి అక్కడ నుండి లేవబోయాడు.

"అయితే నా నిర్ణయంకూడా విను. ఏ అచ్చటా, ముచ్చటా లేని కొంపలో నేనుండ లేను. ఏ కాశీకో, రామేశ్వరానికో పోతాను. మనశ్శాంతి అయినా లభిస్తుంది" అని గొణుక్కుంది తనలో తానే అసహనంగా.

"నీవే కాదమ్మా మనశ్శాంతి లేనిది నాకుకూడానమ్మా" అనుకున్నాడు మనసులో.

తన మాట కాదంటున్నాడని ఒకరిద్దరు పరాయివారితో చెప్పించింది.

వాళ్ళేదో హితబోధ చేస్తున్నట్లుగా చెపుతుంటే శ్రీహరికి అమితమైన కోపం వచ్చింది. అదే కోపంతో ఇంటికి వచ్చి...

"ఎందుకమ్మా నల్గురిలో నా పరువు తీస్తావు. నన్నీమాత్రం మనశ్శాంతిగా అయినా బ్రతకనియ్యవా? నిన్ను కాదని పరాయివాళ్ళ మాట విని మనసు మార్చుకునేందుకు నేనంత బుద్ధిహీనుడ్ని కాదు. ఒక రకంగా నా పరువు ఇప్పటికే పోయింది. పోయిన పరువుతోపాటు మనశ్శాంతిని కూడా కరువుచెయ్యకమ్మా, నీకు నమస్కారం చేస్తాను"

కొడుకు మాట విన్పించుకోకుండా తన పాతపాటే మొదలుపెట్టింది రవణమ్మ. ఎంతగా చెపుతున్నా, మొండిగా తన అభిప్రాయమే సరయినదన్నట్లుగా వేధిస్తున్న తల్లి మాటలకు విసిగి కోపం వచ్చిన శ్రీహరి చరచరా తల్లి దగ్గరకు వెళ్ళి ఆమె చెయ్యి తన నెత్తినుంచుకుని "మళ్ళీ ఇంకెప్పుడూ నన్ను పెళ్ళి గురించి ఒత్తిడి చెయ్యకమ్మా. అలా చేస్తే నామీద ఒట్టే, మళ్ళీ నీ కంటికికూడా కన్పించను జాగ్రత్త" అన్నాడు, బెదిరింపుగా.

కొడుకు అలా చేస్తాడని ఊహించని ఆ తల్లి హృదయం తల్లడిల్లిపోయింది. వారించపోయింది. కానీ అందుకవకాశం ఇవ్వలేదు శ్రీహరి.

అప్పటి నుండి రవణమ్మ కూడా మనసు మార్చుకుంది. తన పని తను చేసుకోవటం, ఏ వేళకో వచ్చిన శ్రీహరికి ఒడ్డించటం. మునుపటిలా మాటలు కూడా తగ్గించేసింది.






తల్లిపోరు తగ్గినందుకు సంతోషించినా, అలా మూగగా సాధించటం భరించలేకపోయాడు శ్రీహరి.

"అందరూ వుండికూడా నన్ను ఒంటరిగా చేశారు. ఎందుకు శ్రావణీ, నా జీవితంలోకి ప్రవేశించి మర్చిపోలేనంతగా గుర్తుండిపోయ్యావు. మరొకరిని జీవితంలోకి తెచ్చుకుందామంటే నిన్ను మరువలేను. మర్చిపోయి జీవితంలోకి తెచ్చుకుందామంటే తెచ్చుకోలేను. ప్రేమించి ఆరాధించినందుకు ప్రతిఫలంగా మిగిలింది నాకీ అశాంతేనా. కనీసం కన్నతల్లి కూడా నన్నపార్థం చేసుకుంటే నేను ఎవరికోసం బ్రతకాలి." అని నిద్ర పట్టని రాత్రిళ్ళు వాపోయేవాడు.

భార్య జ్ఞాపకాలు తనను మరువనియ్యవని, మరువలేనని స్థిరనిశ్చయానికి వచ్చిన శ్రీహరి తనకు తెల్సిన వాళ్ళెవరో బిజినెస్‌లో పార్టనర్‌షిప్ అడగటం గుర్తుకు వచ్చి అప్పటి తన స్థితిలో మనసు ఏ పని మీదయినా కేంద్రీకరించటమే మంచిదని తను కూడా వారితో కలిశాడు.

పనిలో కాలం గడిచిపోతుంటే కొంతవరకు బాధను మర్చిపోగల్గుతున్నాడు.

## 21

"శ్రావణీ! నేను కొన్ని ముఖ్య విషయాలు అడుగుతాను. దాచకుండా చెపుతావా?" అంది గంభీరంగా ప్రమీల.

"కొత్తగా చెప్పేదేముంది. నా గురించి నీకంతా తెల్సిందేగా."

"చెప్పావనుకో! కానీ నీ గురించి నాక్కొన్ని అనుమానాలున్నాయి" అంది.

"అంటే నా శీలాన్ని గురించా?" అంది సూటిగా ప్రమీల కళ్ళల్లోకి చూస్తూ.

ఆమె చూపుల్లోని వాడి, మాటల్లోని తీవ్రతను గమనించిన ప్రమీల "అపార్థం చేసుకోకూడదని ముందే చెప్పాను. నువ్వు చెప్పే ప్రతీ మాట నీకు మేలే కానీ, కీడేం చెయ్యదు. నేను అడిగే ప్రశ్నలు నీకు బాధ కల్గించవచ్చు. కానీ అడగక తప్పదు. చెప్పటానికి నీకు అయిష్టమన్పిస్తే మాత్రం చెప్పవద్దు. నేనేదో, నీ గురించి

# శ్రావణి

తెల్సుకుని నిన్ను అవమానిస్తున్నానని అభిప్రాయపడితే మాత్రం అది నా దురదృష్టం" అంది.

"నన్ను క్షమించక్కా! ఏదో మనసు బాగుండక మాట్లాడుతున్నాను కానీ మనిద్దరి మధ్యా పరిచయం స్వల్పకాలమయినా నా గురించి నువ్వు పడే ఆవేదనను అర్థం చేసుకున్నాను. నా జీవితాన్ని వెలుగుతో నింపాలని నువ్వు తాపత్రయపడటం నాకొక వరంగా భావిస్తాను. ఏమడిగినా పర్లేదు. అడుగు. అన్నిటికి జవాబులు నా దగ్గిర సిద్ధంగానే వున్నాయి" అంది.

"జరిగిందంతా నీకు తెలియకుండానే జరిగిందంటే నాకు నమ్మశక్యం కావటంలేదు" అంది శ్రావణి ముఖంలోని భావాలను జాగ్రత్తగా వెతకటానికి ప్రయత్నిస్తూ.

"నన్ను అర్థంచేసుకుంది ఈ మాత్రమేనా. ఎవరు ఎన్ని అన్నా నేను భరించాను. కానీ నువ్వు, నువ్వు కూడా నమ్మనంటే నేనిక బ్రతకటం దుర్లభం" అంది ఏడుస్తూ.

"ఛ! పిచ్చిదానా నమ్మకం లేకకాదు. కేవలం అనుమాన నివృత్తికోసం అడిగానంతే."

అమాయకంగావున్న శ్రావణి ముఖంలోని భావాలు ఆమె మాటలు నిజమని గట్టిగా చెపుతున్నాయి.

"మరయితే, ఈ నిజం మీ వాళ్ళకి తెల్సే వుంటుంది. అవునా?" అంది ప్రమీల.

శ్రావణేం చెప్పలేదు.

"తెల్సిన నిజాన్నే దాచిపెట్టి నీకీ పెళ్ళి జరిపించారు. పిల్లల కోసం పడే తపనతో మీ ఆయన నిన్ను డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళాడు. అప్పుడు ఈ నిజం తెల్సింది. నిజంగా మీవాళ్ళకేం తెలియకుండా వుంటే నువ్వు ఇంటికి వెళ్ళగానే కంగారు చూపించి నీకాపురం చక్కపర్చాలని ప్రయత్నించేవారు. నిమ్మకు నీరెత్తినట్లుగా వున్న వాళ్ళ వైఖరి... మీ నాన్నకు, మీ అమ్మ కనుసైగ చెయ్యటం ఇవన్నీ స్వయంగా నీ కళ్ళతో నువ్వే చూశావుకదా! నీ మాటలను ఆధారంగా తీసుకుంటే వాళ్ళేదో దాస్తున్నారు అన్పిస్తోంది" అంది ప్రమీల.

"కన్నపిల్లల భవిష్యత్తును పాడుచేసే తల్లిదండ్రులుంటారా" అంది శ్రావణి.

"ఎందుకుండరు? కన్నకూతుళ్ల శీలాన్నే అపహరించే నా తండ్రి లాంటివాళ్ళు వున్నపుడు, కూతురి భారం వదిలించుకోవటం కోసం, లోపాలను దాచి పెళ్ళి జరిపించి తర్వాత తమకు పట్టనట్లు బాధ్యతారహితంగా ప్రవర్తించే నీ తల్లిదండ్రులు వుండటంలో ఆశ్చర్యమేముంది" అంది ప్రమీల.

"పెళ్ళికాకముందు నీకు ఎవరయినా పరాయి మగవాళ్లతో పరిచయం వుందా?"

"ఊహూఁ" అంది శ్రావణి.

"జాగ్రత్తగా గుర్తు తెచ్చుకో. పెళ్ళికాక ముందు పరాయి మొగవాడెవరయినా నీ మీద ఆశ పడటంకాని, బలవంతంగా నువ్వు ఇరుక్కుపోవటంకానీ, నీమీద ఎవరన్నా పగ వున్న వ్యక్తులు కానీ లేక నీ చేత తిరస్కరింపబడ్డవాళ్ళు కానీ ఎవరయినాసరే మెల్లిగా ఆలోచించి చెప్పు." అంది ప్రమీల.

కాసేపు ఆలోచించిన శ్రావణికి ఎంత వద్దనుకున్నా కొన్ని విషయాలు లీలగా గుర్తుకు వచ్చాయి. కానీ అవి ప్రమీల కెంతవరకు ఉపయోగపడతాయా అన్న అనుమానం వచ్చి అదేమాట చెప్పింది.

"అతిచిన్న విషయం కూడామనకి ఉపయోగపడవచ్చు. చెప్పు ఏమిటది?" అంది ఉత్సాహంగా.

"నాకు చిన్నప్పుడు ఏదో సెగ్గడ్డలేస్తే ఎన్నాళ్లకీ తగ్గకపోతే ఆపరేషన్ చేశారని మాత్రం నాకు తెలుసు. కానీ తర్వాత టైఫాయిడ్ జ్వరం వచ్చింది. నాకు అసలు స్పృహలేని పరిస్థితిలో రెండు నెలలు వున్నానుట. ఆ రోజులు ఎలా గడిచాయో అని మా అమ్మ ఎప్పుడూ చెప్పి బాధపడుతూ వుండేది." అంది శ్రావణి.

"రెండునెలలు టైఫాయిడ్— అదీ స్పృహ లేకుండానా? నేను నమ్మనీవిషయం — ఇది మరీ ఆశ్చర్యంగా వుంది. పిచ్చిదానా! నిజంగా నువ్వు అమాయకురాలివని మరొకసారి రుజువు చేసుకున్నావు. టైఫాయిడ్‌లో ఒక్కసారయినా నీకు తెలివి రాలేదా? కనీసం వచ్చినపుడయినా పరిసరాలు గుర్తున్నాయా?" అంది.

"ఊహూఁ నాకసలేం తెలియదు. మా దూరపు చుట్టాలింట్లో గది తీసుకుని అక్కడ వుంచారట. మా వూరిలో మంచి డాక్టరు లేరు. మళ్ళీ మా వూరు వచ్చాకే నాకు తెల్సిందిదంతా?" అంది.

"మరి నీకు జ్వరం రావటానికి ముందు రెండు మూడు రోజులనుంచీ ఏవన్నా చిహ్నాలు కన్పించాయా?" అంది.

"నాకు తెల్సినంతవరకు బాగానేవున్నాను. మామూలుగా ఆ రోజు రాత్రి భోజనం చేసి పడుకున్నానంతే. నా కంతవరకే తెల్సు" అంది శ్రావణి.

ఆ మాటలు ప్రమీలని చాలావరకు ఆశ్చర్యంలో ముంచాయి.

''సరే! ఇందాక ఏదో చెపుతానన్నావు. చెప్పమరి'' అంది.

''చెపుతాను అక్కా చెపుతాను. నాకు గుర్తున్నంతవరకూ ప్రతీ చిన్నవిషయం కూడా చెపుతాను'' అని చెప్పటం ప్రారంభించింది.

కుతూహలంగా వింటోంది ప్రమీల.

## 22

అప్పుడే యుక్తవయసులోకి అడుగుపెట్టిన శ్రావణి వరద గోదారిలా, ఉత్సాహంగా, అల్లరిగా స్నేహితులతో తిరుగుతూ వుండేది. కానీ ఆ వయసు కుండవల్సిన తెలివికన్నా అమాయకతే ఎక్కువ వుండేది ఆమెలో.

ఆ వూళ్ళో వున్న బోర్డు ఇస్కూల్ చదువుతో ఆమె చదువుకి స్వస్తి చెప్పింది. తండ్రి సామాన్యంగా పొలం చేసుకునే రైతు. ఉన్న ఒక ఎకరం పొలం, పండించుకుని ఏదో కాలం గడుపుతున్నారు. పెద్దకూతురు రాజ్యానికి పెళ్ళిచేసి పంపినా శ్రావణి భారం మాత్రం వుండిపోయింది. అది దింపుకుందామని ప్రయత్నిస్తున్నా కాలం కల్సిరాక వూరుకున్నాడు.

సావిట్లో కూర్చున్న తన ఈడుపిల్లలతో చింతగింజలు ఆడుకుంటున్న శ్రావణికి తల్లి పిలవటంతో కోపంగా లేచివెళ్ళింది.

రెండు చేతులతోనూ తలుపు దర్వాజాను పట్టుకుని లోపలికి చూస్తూ ''ఏమిటమ్మా ఆడుకుంటుంటే పిలుస్తావు?'' అంది కోపంగా చూస్తూ.

''ఈ ఆటలు ఎప్పుడూ వున్నవేగా. ఈ కూర తీసుకువెళ్ళి అక్కయ్యకి ఇచ్చిరా'' అంది.

''పెద్దపని వున్నట్టుగా పిలుస్తావు. తీరావస్తే ఇదన్నమాట. ఎప్పుడూ వండే కూరేగా నేనివ్వను ఆడుకోవాలి'' అని వెనక్కి తిరగబోయింది.

''నా తల్లికదు. మా శ్రావణి మంచిపిల్ల. చెప్పినమాట వింటుంది. పాపం ఈ కూర అక్కయ్య కిష్టమే. అందుకని మరి కాస్త చేశాను. ఇచ్చిరావే తల్లీ. నీ ఇష్టం వచ్చినప్పుడు వదన్నా పోతూంటావు. నే వెళ్ళమన్నప్పుడే వస్తుంది నీకు తిక్క'' అంది శాంతమ్మ.

''అదిగో విసుక్కుంటున్నావు. నేను అసలు వెళ్ళనే వెళ్ళను తెల్సునా?'' అంది చిరుకోపంగా బుంగమూతిపెట్టి కోపం నటిస్తూ.

''విసుక్కోను. మరి నువ్వు త్వరగా వెళ్ళు'' అని క్యారియర్ తెచ్చి కూతురికిచ్చి అక్కయ్య నొకసారి రమ్మను'' అంది.

''అమ్మా! నాకు తెలియక అడుగుతాను. నాల్గు వీధులవతల వున్న అక్కయ్యను మనం రోజూ ఎవరో ఒకరు చూస్తూనే వుంటాం. లేక అదన్నా వస్తూనే వుంటుంది. ఇంకా ఎందుకీ ప్రేమ. అసలు దూరం అవాల్సింది, ఏంచేసేవారో'' అంది తనకు పట్నంలో సంబంధమే కుదురుతుందన్న నమ్మకంతో.

''పెద్దదాన్ని ఉన్న వూళ్ళోనే ఇచ్చాం. నిన్ను కూడా ఇక్కడే ఇస్తే ఉన్న ఇద్దరూ మా కళ్ళెదురుగానే వుంటారు. రేపు నీకు కూడా పెళ్ళయి ఒక నలుసు కల్గిననాడు ఆ ప్రేమ తెలుస్తుంది. కానీ ముందు వెళ్ళిరా. నువ్వు వెళ్ళేసరికి వాళ్ళ భోజనాలు కూడా పూర్తవుతాయి'' అంది శ్రావణిని తొందర పెడుతూ.

''వెళతానుండు నాకేం నాల్గు కాళ్ళున్నాయా'' అని ముందుకి వెళ్ళి మళ్ళీ వెనక్కువచ్చి—

''నేను ఈ పల్లెటూరివాడినేం చేసుకోను. ఇంచక్కా పట్నంలో వున్నవాడినే చేసుకుంటాను తెల్సునా?'' అంది గారంగా.

''సరేలేకానీ ముందు నువ్వెళ్ళు'' అంది.

''ముందుగానే చెపుతున్నాను. ఊ, గుర్తుంచుకో'' అని చేతిలోని క్యారియర్ వూపుకుంటూ వయ్యారంగా ముందుకు కదిలింది.

వెడుతున్న కూతురువైపు చిరునవ్వుతో చూస్తుండిపోయిందా తల్లి.

## 23

''అక్కా!'' అని పిలుస్తూ లోపలికి అడుగుపెట్టింది శ్రావణి.

''ఎవరూ? మరదలు పిల్లా. బొత్తిగా నల్లపూసవయినావే ఈ మధ్య. పోస్టుకార్డులా ఎప్పుడూ రెండిళ్ళ మధ్య తిరుగుతూవుండే దానివి'' అన్నాడు బావ శేషు.

''నాకేం పనిపాటు లేదనుకున్నావా? తిరగటానికి'' అంది కోపంగా.

''ఎందుకులేదు పొద్దున్నేచద్దన్నం తినటం, అది అరిగేదాకా తిరిగిరావటం, మళ్లీ రెండోసారి ఆరగించటం అది కూడా అరిగేదాకా తిరగటం, ఇదేగా నీ పని'' అన్నాడు సిగరెట్ పొగ రింగులు రింగులుగా మరదలి ముఖాన వూది పకపకా నవ్వుతూ.

ఆ పొగకి వుక్కిరి బిక్కిరవుతూ ''ఛీ, వెధవకంపు, ముఖంమీదకు వదులుతావే పొగ'' అంది ఇంకా దగ్గుతూనే.

''మరదలిని తమాషా చేద్దామన్పించి'' అన్నాడు శ్రావణిని తినేశాలా చూస్తూ.

''ఏడ్చినట్లేవుంది నీ తమాషా?'' అంది ముఖం చిట్లించి.

''ఇదిగో అక్కా అమ్మ నీ కోసం పనసకాయ కూర పంపింది, అని క్యారియర్ అక్క చేతికిచ్చి ''నే వెళ్ళాలి'' అని వెళ్లబోయింది.

''ఆగవే ఏమిటా తొందర కాసేపుకూర్చో. మీ బావ వెళ్ళాక నేను కూడా వస్తాను.'' అంది రాజ్యం.

''నే వెళ్ళాలి బాబు, నాకు ఇంటిదగ్గర చాలాపనుంది'' అని అయిష్టంగానే కూర్చుంది అక్క బలవంతం మీద.

''ఏమిటాపని?తోటలు దీవించటం,కాకపోతే చింతగింజలాడటం అంతేగా?'' అన్నాడు వెకిలిగా నవ్వుతూ.

''ఆ పెద్ద నువ్వు చేస్తున్నావుగా పని'' అంది.

''నాకేం అయిదెకరాల పొలం వ్యవసాయం చేసుకుంటున్నాను. పట్నంలో వ్యాపారంలో పావలా వాటా వుంది. నాలాటివాడ్నే ఒకడిని చూసి నీకు కూడ కట్టబెట్టమన్నావేంటి? లేకపోతే నన్నేచేసుకో—హాయిగా అక్కచెల్లెళ్లిద్దరూ ఒకే చోట నడుండవచ్చు.'' అన్నాడు.

''చాల్లేండి మీ సరసాలు. అది వచ్చినప్పుడల్లా ఇలాగే ఏడిపిస్తారు. అందుకే అదసలు మీరున్నపుడు రావటంలేదు. నిన్న కారప్పూస వండాను పెడతానుండవే'' అని లోపలికి వెళ్లింది రాజ్యం.

''ఏం శ్రావణీ నాకన్నా అందగాడు, గొప్పవాడు వస్తాడేమిటీ, నన్నే చేసుకో. అన్నాడు దగ్గరగా వచ్చి కళ్ళల్లో కళ్ళుపెట్టి చూస్తూ.

''ఆ! ఇంతకన్నా అందగాడు నాకు దొరకడు పాపం. మా అక్క వుంది చాలదు నీ ముఖానికి. అసలే కోతల రోజులు, పొలం దగ్గరకు వెళ్ళక పోయ్యావంటే బాగా అవుతుంది పెళ్ళి'' అంది పకపకా నవ్వుతూ.

అందంగా బొద్దుగా వుండే శ్రావణలా నవ్వుతుంటే మరింత ఆకర్షణీయంగా; తనను కవ్విస్తున్నట్లుగా అన్పించింది శేషుకు.

సమయం దొరికినప్పుడు తప్పకుండా ఓ చూపు చూడాలని కూడా అనుకున్నాడు. అన్ని విధాలా అనుకూలవతిగా వున్న భార్యను వుంచుకుని కూడా వ్యాపారం పేరుతో వారానికోసారి పట్నం వెళ్ళి భర్త ఏం చేస్తాడో బాగా తెల్సు రాజ్యానికి. కానీ పెద్దగా పట్టించుకోదు. మగవాళ్ళన్నాక ఆ మాత్రం తిరగరా అని ఆమె అభిప్రాయం.

అయిదెకరాల మాగాణిలో, వచ్చే రాబడితో విలాసంగా గడుపుతున్నాడు శేషు. ఎప్పుడూ తెల్లటి పంచె, లాల్చీతో చూపరులకు పెద్ద మనిషిగా కన్పించే అతని బుఱ్ఱలో వున్న ఆలోచనలు, బుద్ధిలో వున్న వక్రతా ఎవరికీ తెలియదు.

ముఖ్యంగా మామగారి దృష్టిలో మంచి వాడు, ప్రయోజకుడు. అందుకే తన ఇంటి విషయాలకి అల్లుడిని సలహా అడుగుతాడు ఆయన.

''ఏమిటే, రోజురోజుకి మరీ మిసమిస లాడిపోతున్నావు.'' అని చెయ్యి పట్టుకున్న బావ మాటలకు ఉలిక్కిపడింది శ్రావణి.

''ఛీ! చెయ్యి వదులు. సిగ్గులేదు. నేనింకా చిన్నపిల్లని అనుకున్నావేమిటి'' అంది కోపంగా చూస్తూ.

"అబ్బో! అంత పెద్దదానివయినావేమిటి,' అన్నాడు బుగ్గన చిటికేస్తూ.

"నా దగ్గర పిచ్చివేషాలేశావంటే మర్యాద దక్కదు తెలుసా? నేను అక్కని కాదు. గుర్తుంచుకో" అని చివాల్న లేచి "ఇదిగో అక్కా నేను పోతున్నాను" అని రాజ్యం పిలుస్తున్నా వినకుండా పరుగుతీసింది.

"మీరు ఏదో అన్నట్లున్నారు. దానికి కోపం వచ్చింది" అంది రాజ్యం.

"ఏదో మరదలుపిల్ల కదా అని సరసమాడ బోయ్యాను, కయ్యిమంది."

"అది ఇంకా చిన్నపిల్లనుకున్నారా?"

"కాదని అదే చెప్పిందిలే ఆ మాట" అన్నాడు ఏదో ఆలోచిస్తూ శేషు.

## 24

మునిమాపువేళ దొడ్లో కొబ్బరిచెట్టుకింద, పట్టెమంచంమీద తల్లి పక్కలో పడుకుని శ్రావణి ఏవో కబుర్లు చెపుతోంది.

అక్క మొగుడంటే సదభిప్రాయంలేని శ్రావణికి, తను చిన్నపిల్లగా వున్నప్పుడు తెలియని వయసులో చూపించే చనువే ఇప్పుడుకూడా చూపించటం సుతరాము నచ్చటంలేదు.

అదే మాట తల్లితో చెప్పింది.

"మనింట్లోవాడిలా కల్సిపోయాడు. నువ్వు పరాయిదానిలా అన్పించక అలా సరదాగా అంటాడే" అని చెప్పింది తల్లి.

"ఏంకాదు? నాకు ఇష్టంలేదు అలా వుండటం" అంది.

సరేలే. అందావిడ.

"అమ్మా! ముందే చెపుతున్నాను అక్కలాగా నాకు ఈ పల్లెటూరి సంబంధం తెస్తే నేను మాత్రం చేసుకోను తెలుసా" అంది తల్లివైపు తిరిగి ఆమె మెడచుట్టూ చెయ్యివేసి.

"పట్నంవాళ్ళకు బోలెడు కట్నం కావాలి. పైగా నీకు చదువుకూడా లేదు" అంది తల్లి.

"అందరూ అలాటివాళ్ళే వుంటారేమిటి? నా ఇష్టం చెప్పాననంతే" అంది.

"అక్కయ్య ఎప్పుడూ ఇలా అడగలేదు. నువ్వు అలాకాదు" అందావిడ.

"ఆ రోజులు వేరు. ఈ రోజులు వేరు" అంది శ్రావణి.

"ఏమే, పాపాయిలాగా అమ్మ పక్కన చేరావు. పొద్దున్నే పిలుస్తున్నా వినకుండా పరుగెత్తు కొచ్చావే?" అంది రాజ్యం మంచం చివరగా కూర్చుంటూ.

"అవును ఈ ఇంట్లో చిన్నపిల్లని నేనేగా. పడుకుంటే ఏం" అని మరింతగా తల్లి కంఠం పెనవేసుకుంది ప్రేమగా.

"అబ్బా! వదలవే నీ ప్రేమ పాడుగాను" ప్రేమగానే విసుక్కుంది శాంతమ్మ మంచం మీదినుంచి లేస్తూ.

# ఇవేమన పద్యాలు




బిడ్డలను సుతులను పేరైన చుట్టాల
సంపదల తనువుల చాలనమ్మి
సంతసిల్లుచుందు క్షణభంగురములన్ని
తెలియలేరదేమి తెలుపువేమ

"అమ్మా! దీని అల్లరి ఎక్కువయిందే! పెళ్ళి చేసేస్తేసరి" అంది రాజ్యం.

"మీ ఆయన మాత్రం సంబంధం చూడక్కర్లేదులే?" అంది శ్రావణి.

"నేను చూడందే నీకు మొగుడు దొరికి నట్లే?" అన్నాడు మల్లెపూల పొట్లాంతో వచ్చిన శేషు.

అల్లుడికి కుర్చీ తెచ్చివేసింది శాంతమ్మ.

కాళ్ళూపుతున్న శ్రావణిని చూస్తూ,

"అత్తవారిల్లు దూరం అవుతుంది తెల్సునా?" అన్నాడు.

"అయితే! మరీ హాయి. నీలాగా రోజు రాము" అంది పెంకెగా.

కూతురిని మందలించపోయింది శాంతమ్మ.

"చిన్నపిల్ల ఏదో చనువుమీద అంటుందని" భార్యాభర్తలిద్దరూ సమర్థించారు. కానీ తన మాటలతో, చేష్టలతో మరింత తన మనసు రెచ్చగొడుతోందని, కోరికతోపాటు కోపంకూడా పెరుగుతోంది శేషుకు, శ్రావణిమీద.

**(ఇంకా వుంది)**



# సినిమా



ారాధ, కృష్ణ, "కంచుకాగడా"

కృష్ణ, రాధ, విజయశాంతి, సత్యనారాయణ, రావుగోపాలరావు, ప్రభాకరరెడ్డి, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, పరుచూరి గోపాలకృష్ణ



"అభిమన్యుడు"లో

## ీ కృష్ణ దర్శకత్వంలో చిత్రాలు

ు మొదట 'ఛత్రపతి శివాజీ' చిత్రానికి దర్శ-
వహిస్తానని తెలిపాను. కాని, చిత్రాల
ివల్ల ఆ బాధ్యతను నిర్మలకు అప్పగించాను.
ీనా అభిమానులు చాలామంది నిరాశ చెంది-
ఉత్తరాలు రాశారు. మా పద్మాలయా సంస్థ
లో ప్రారంభించే జానపద చిత్రాన్ని నేనే డైరెక్ట్
పలిచాను. షూటింగ్ మొత్తం రాజస్థాన్ పరి-
లో జరుగుతుంది" అన్నారు కృష్ణ. "హేమా
ంతో భారీ ఎత్తున తయారయ్యే ఈ చిత్రం
ుడ్ చిత్రాల స్థాయిలో ఉంటుందనడంలో
ి అతిశయోక్తి లేదు. ఆ తర్వాత డాక్టర్
తిరుపతిరెడ్డి నిర్మించే సంయుక్తా మూవీస్
చిత్రానికి హీరో కృష్ణ దర్శకత్వ బాధ్యతలు వహి-
స్తారు.

## కృష్ణతో రాఘవేంద్రరావు దర్శకత్వంలో అశ్వనీదత్ చిత్రం "అగ్ని పర్వతం"

"బొబ్బిలి బ్రహ్మన్న - ఫ్రేమ్ డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు, రైటర్స్ పరుచూరి బ్రదర్స్ కాంబినేషన్‌లో తయారయ్యే ఈ చిత్రం మా హీరో నట జీవితంలో మరో మైలు రాయి కాగలదు. ఈ దీక్షతోనే మా వైజయింతి మూవీస్ యూనిట్‌లోని ప్రతి ఒక్కరూ కృషి చేస్తున్నారు." అన్నారు నిర్మాత అశ్వనీదత్. ఈయన కొత్త చిత్రం "అగ్నిపర్వతం"లో

# విశేషాలు

-జి. వి. జి.

ప్రభృత తారాగణం, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కర రాజు శిల్పం, కోటగిరి వెంకటేశ్వర రావు కూర్పు, రామారావు



శోభన్‌బాబు, స్మిత



"ఎదురులేని మొనగాళ్ళు" నూతన్‌ప్రసాద్, కల్పనారాయ్

• పట్టాభి ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు. జులై 21 - 30, ఆగస్టు 11 - 20, సెప్టెంబరు 11 - 20 మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుందని డైరెక్టర్ కె. రాఘు వేంద్రరావు తెలిపారు.

## "ఆనంద భైరవి" శత దినోత్సవం

"దర్శకత్వంలో నేను కె. విశ్వనాథ్‌గారికి ఏకలవ్య శిష్యుడ్ని. నిర్మాతలందరి చలువ, రసజ్ఞుల ఆశీస్సులతో నే నీ స్థాయికి రాగలిగాను" అన్నారు దర్శక రచయిత జంధ్యాల. 'కళాసాగర్' విశిష్టమైన రీతిలో ఏర్పాటు చేసిన ఈ శత దినోత్సవానికి ముఖ్య అతిథులుగా ఆంధ్రప్రదేశ్ సమాచార శాఖామాత్యులు చేగొండి హరి రామ జోగయ్య, కన్నడ దర్శకుడు పుట్టన్న కణగాల్, తమిళ దర్శకుడు భారతీ రాజా, ప్రత్యేక ఆహ్వానితులుగా కమలహాసన్, శ్రీదేవి విచ్చేయడం సభకు మరింత నిండదనాన్నిచ్చింది. "ఈ ఏడు వరుసగా రెండు హిట్ పిక్చర్స్‌ను అందించిన జంధ్యాల మహాశిల్పి" అన్నారు ప్రముఖ నిర్మాత, 'కళాసాగర్' అధ్యక్షులు, సహజ కవి ఎం. ఎస్. రెడ్డి,

## కొమ్మినేని దర్శకత్వంలో "మంత్రదండం"

"శివకృష్ణ, అరుణ జంటతో అక్టోబర్ 4 నుంచి ప్లాన్ చేశాం," అన్నారు భీమవరపు బుచ్చిరెడ్డి. ఈయన సమర్పించే కౌసల్యా పిక్చర్స్ వారి పై చిత్రానికి చక్రవర్తి సంగీతం, కొమ్మినేని దర్శకత్వం, బి. అంజిరెడ్డి నిర్వహణతో బి. కౌసల్య నిర్మాత.

# సినిమా

## డైరెక్టర్ కట్టా సుబ్బారావు చిత్రాలు

తాతినేని సుబ్బారావు సమర్పణలో డాక్టర్ టి. . ఎం. ఛటర్జీ నిర్మించిన "సీత పుట్టిన దేశంలో" చిత్రం ఆగస్ట్ లో విడుదలవుతుంది. మురళీమోహన్ విజయశాంతి, శారద, శ్రీధర్, రూపా చక్రవర్తి, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, పి. ఎల్. నారాయణ, సూర్యకాంతం పాల్గొన్నారు. కాశీ విశ్వనాధ్ మాటలు, రాజన్ నాగేంద్ర సంగీతం, రంగా ఛాయ, కొడవనేని రామలింగేశ్వరరావు శిల్పం, కె. సత్యం కూర్పు నిర్వహించారు. రామ్ శ్యామ్ క్రియేషన్స్ నిర్మాణం.

ఏ. కె. ఇంటర్నేషనల్ పతాకంలో వేగి జగదీష్ నిర్మించే చిత్రానికి "నాన్ పాడుమ్ పాడల్" అనే తమిళ చిత్రం మూలం. మొదటి షెడ్యూల్ జులై 5నుంచి 10 వరకు మద్రాసులో జరిగింది. సుమన్, చంద్ర మోహన్, శరత్‌బాబు, సుహాసిని, రమణమూర్తి, రాజేష్, రాజేంద్ర ప్రసాద్, వేలు, జి. ఎన్. స్వామి, అనిత, శ్రీలక్ష్మి, పుష్ప కుమారి నటిస్తున్నారు. ఆత్రేయ రచన, ఇళయరాజా సంగీతం, రాజరాజన్ ఛాయ, తరణి శిల్పం నిర్వహిస్తున్నారు. కన్యాకుమారిలో రెండవ షెడ్యూల్ ఆగస్టు 25 నుంచి సెప్టెంబర్ 15 వరకు జరుగుతుందని నిర్మాణ సారధి వేగి విజయకుమార్ తెలిపారు. సమర్పణ : ఏ. బాబూరావు.

మదమంచి లక్ష్మి సమర్పించే ఇంటర్నేషనల్ ఆర్ట్ ఫిలిమ్స్ వారి "ఇదీ మన భారతం" చిత్రం తొలిషెడ్యూల్ గుంటూరులో జులై 14 నుంచి 20 వరకు జరిగింది. శివకృష్ణ, రాజేష్, ప్రభాకర రెడ్డి,




**నేను ఈ సినిమాకెళ్తొస్తాగానీ – నువ్వు లోపలికొచ్చి అటూ, ఇటూ తిరగొద్దు – జనం కంగారు పడతారు.**

నూతన్ ప్రసాద్, మోహన్ రావు, పి. ఎల్. నారాయణ, గోకిన రామారావు, శ్యామల గౌరి, వనితశ్రీ, సాధన, జ్యోతిలక్ష్మి, జయమాలిని, అనిత, రాగిణి, పుష్ప కుమారి, కల్పనారాయ్, జయ విజయ, నవ నటి గాదె ప్రమిద పాత్రధారులు. చక్రవర్తి సంగీతం, రాజ రాజన్ ఛాయ, కె. సత్యం కూర్పుతో పరిమి శెట్టి బసవయ్య నిర్మాణ సారధి. రెండో షెడ్యూల్ మద్రాసులో ఆగస్టు 1 నుంచి 20 వరకు జరుగుతుంది.

మోహన్ బాబు, సత్యనారాయణ, జగ్గయ్య, అల్లు రామలింగయ్య ఆదిగా గల వారు నటించే కమలాలయ పిక్చర్స్ "రాముడేలిన రాజ్యం" చిత్రానికి అక్టోబర్‌లో అంకురార్పణ జరుగుతుంది. నిమ్మకాయల ధర్మయ్య నిర్మాత.

కృష్ణంరాజు, జయసుధ, "భారతంలో శంఖారావం"



"భలేరాముడు"లో మాధవి, మోహన్‌బాబు

"మున్నబుగారి అల్లుడు"లో గిరిబాబు, శ్రీగీత

## కె. ఎస్. రెడ్డి దర్శకత్వంలో రెండు చిత్రాలు

"రెండూ యాక్షన్‌తో పాటు సెంటిమెంట్ మిళితమైన చిత్రాలు," అన్నారు కె. ఎస్. రెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎం. కె. రాధ నిర్మించే చిత్రానికి ఆగస్టులో పాటల రికార్డింగ్ జరుగుతుంది. అదే నెలాఖరు నుంచి చిత్రీకరణ మొదలవుతుంది. పేరాల కథ, మాటలు రాశారు. రాధాకృష్ణా కంబైన్స్ పతాకంలో తయారయ్యే ఈ చిత్రం పేరు "రౌడీపిల్ల" ఇందులో కొందరు నవ నటీ నటులకు అవకాశమివ్వబడుతుంది.

రెండో చిత్రం కె. మురళీకృష్ణ, డి. సుబ్బారెడ్డి నిర్మించే స్టార్ ఆర్ట్ క్రియేషన్స్ వారి తొలి చిత్రం. దీనికి ఆగస్టు నెలాఖరులోగా పాటల రికార్డింగ్ జరిపి, సెప్టెంబరు నుంచి షూటింగ్ ప్రారంభిస్తామని కె. ఎస్. రెడ్డి తెలియజేశారు.

## సుమన్ హీరోగా పద్మప్రియ క్రియేషన్స్ చిత్రం

"నేటి భారతం - చిత్రంలో సుమన్ నటన నన్ను ముగ్ధుణ్ని చేసింది. కొత్త తరహా ఫైట్స్‌తో మార్షల్ ఆర్ట్స్ ప్రధానంగా హాలివుడ్ చిత్రాల స్టాయిలో ఒక పక్కా కమర్షియల్ చిత్రాన్ని సుమన్‌తో తీయాలనిపించింది. ఈ విషయంలో సుమన్, తర్ఫీదు పొందిన ఆయన మిత్రులెందరో సహకరిస్తున్నారు.



భానుప్రియ, చంద్రమోహన్, "రామాయణంలో భాగవతం"

అనువైన కథను భరణి, కుమార్‌లు సమకూర్చారు. గగుర్పాటు కలిగించే కొన్ని సన్నివేశాలను ఒక దీవిలో చిత్రీకరించదలిచాం. మొదటి షెడ్యూల్ ఆగస్టు 1 నుంచి 20 వరకు, రెండవ షెడ్యూల్ సెప్టెంబరులో. అక్టోబర్‌లో రిలీజ్ చేస్తాం." అన్నారు దామరాజు హనుమంతరావు. ఈయన గుంటూరు లక్ష్మి టాకీస్, వరంగల్లు రాజేశ్వరీ టాకీస్ నిర్వాహకులుగా ప్రదర్శనా రంగంలోనూ, "మన్మథలీల" చిత్రాన్ని హిందీలో డబ్ చేసి నిర్మాణ రంగంలోనూ పేరు ప్రఖ్యాతులు గాంచారు. భరణి సంభాషణలు, డి. ప్రసాద్ ఛాయ, కృష్ణ-చక్ర సంగీతం, కె. సత్యం కూర్పుతో రాజశేఖర రెడ్డి దర్శకుడు.

## జయసుధ దర్శకత్వంలో తొలి చిత్రం

"ఎంటర్‌టైన్‌మెంట్ పిక్చర్. ఆగస్టులో రెండు రోజులపాటు షూటింగ్ జరుగుతుంది. కొంత భాగం బొంబాయిలో కూడా షూట్ చేయవలసి ఉంటుంది.... ఇంత వరకు ఎందరో డైరెక్టర్ల చిత్రాల్లో పని చేసి నటిగా గడించిన అనుభవాన్నంతా రంగరించి పోసి, ఒక చక్కని చిత్రాన్ని తయారు చేయడానికి నా యావశ్శక్తినీ వినియోగిస్తాను." అన్నారు జయసుధ. ఈమె తొలి సారిగా దర్శకత్వం నెరపే చిత్రంలో ఈమెతో పాటు ఈ చిత్రాన్ని రూపొందించే మోహన్‌బాబు, మురళీమోహన్ ప్రధాన పాత్రధారులు. కాశీ విశ్వనాథ్ రచయిత. దీని తర్వాత జయసుధ మరో నటుని చిత్రానికి కూడా దర్శకత్వం వహిస్తారు.

## బాలకృష్ణ, శోభన్‌బాబు, కృష్ణంరాజులతో వజ్జే సుబ్బారావు నిర్మించే మూడు చిత్రాలు

విజేతా కంబైన్స్ పతాకంలో 1985 ఫిబ్రవరిలో ప్రారంభమై, మార్చిలో పూర్తయ్యే "నేను నక్సలైట్‌ను కాను!" చిత్రంలో బాలకృష్ణ హీరో. వేజెళ్ల సత్యనారాయణ దర్శకుడు.

శోభన్‌బాబు, సుమలత జంటతో ఆగస్టు నుంచి అక్టోబర్‌లోగా చిత్రీకరణ ముగిసే చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

1985లో నిర్మాణం జరిగే చిత్రంలో కృష్ణంరాజు హీరో.

## "సాగరమథనం"

"అలనాటి మేటి నటీమణి స్వర్గీయ కన్నాంబ మనుమరాలు రేఖను మా చిత్రం ద్వారా నాయికగా పరిచయం చేస్తున్నాం. ఈ అమ్మాయి ఒక తమిళ చిత్రంలో హీరోయిన్‌గా నటించింది కూడా. అడయార్ ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందిన రజనీష్‌కు హీరోగా అవకాశమిస్తున్నాం. ఈ యువకుడు కరాటే, జిమ్నాస్టిక్స్, డాన్సులలో శిక్షణ పొందాడు." అన్నారు మంజులూరి భీమేశ్వర రావు. ఈయన కథ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారయ్యే స్వజనచిత్ర వారి "సాగరమథనం" చిత్రంలో బిందు మరో నాయిక. విశ్వనాథ్ శర్మ, శ్రీరామ్, డాక్టర్ రజనీకాంత్ వేదుల, అనిల్, నండూరి ఎల్. ఎన్., ఇతర పాత్రధారులు. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. కె. వి. మహ దేవన్ సంగీతం, నిమాయ్‌ఘోష్ ఛాయతో ఈశ్వర రెడ్డి లక్ష్మం సహ నిర్మాత. "ఆగస్టు 6నుంచి 20వరకు మద్రాసులో, సెప్టెంబర్ 10నుంచి 20వరకు వరంగల్‌లో షూటింగ్ పూర్తయిపోతుంది." అన్నారు నిర్మాత ఆంజనేయశర్మ.

"మంగమ్మగారి మనవడు"లో బాలకృష్ణ, సుహాసిని



# సినిమా జోకులు

భర్త ఆఫీసు నుంచి ఇంటికి చేరుకోగానే "ఏమేవ్, నిన్ను సినిమాకు తీసుకెళ్ళి చాలా కాలమైందని నిన్నంతా గొడవ చేశావు కదా? త్వరగా ముస్తాబు చేసుకో. 'పతియే ప్రత్యక్ష దైవం' అనే మంచి సినిమా వచ్చిందట. దానికి పోదాం," అన్నాడు.

"దాని కన్నా 'ఇంటికి దీపం ఇల్లాలే' సినిమా ఇంకా బాగుంటుందని పక్కింటి పిన్నిగారు చెప్పారండి. దానికి పోదాం," అంది భార్య.

* * *

"ఇదేమిటండీ, ప్రొడ్యూసర్‌గారూ! మీది కొత్త పిక్చర్ కదా? మరి, ప్రతి అడ్వర్టయిజ్‌మెంట్‌లోనూ 'సరికొత్త కాపీ' అని వేయించారేమిటీ?"

"ఇటీవల పాత పిక్చర్లనే జనం విరగబడి చూస్తున్నారు కదా? వాళ్ళను ఆకట్టుకోడానికి అలా వేయక తప్పింది కాదు."

* * *

వర్షంలో హీరో హీరోయిన్‌ల మీద పాట చిత్రీకరిస్తున్నాడు డైరెక్టరు. వాళ్ళిద్దరూ కలిసి నటించడం అదే తొలిసారి అవడం వల్ల ఇద్దరూ కాస్త జంకుతున్నట్లు గమనించిన నిర్మాత "బాగా ఫ్రీగా యాక్ట్ చేయండి," అన్నారు.

"ఫ్రీగానే ఆక్ట్ చేస్తున్నామండీ. ఇంతవరకు మాకు అడ్వాన్సు ముట్టలేదు కదా?" అన్నాడు హీరో తపీమని. దాంతో నిర్మాత గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్లయింది.

* * *

ఒక నిర్మాత, డిస్ట్రిబ్యూటర్‌కు ట్రంక్ కాల్ బుక్ చేసి, "ఏంటండీ, మా పిక్చరు స్లో స్లోగా పోతోందని నిన్న మీరు చెప్పారే! ఈవేళ ఉదయం మీ ఊర్నించి ఇక్కడికొచ్చిన నా మిత్రుడు 'కలెక్షన్‌లు ప్రతి ఆటకూ పెరుగుతున్నట్లు టాక్ వచ్చింది' అన్నాడే?" అని ప్రశ్నించాడు.

"అది నిజమే. నిన్న మ్యాట్నీకి 10 టిక్కెట్లు అమ్ముడైతే, ఈవెనింగ్ షోకి 12, నైట్ షోకి 13 టిక్కెట్లు అమ్ముడయ్యాయి," అని డిస్ట్రిబ్యూటర్ జవాబు.

* * *

షూటింగ్ మధ్య విరామ సమయంలో సెట్ బయట దీర్ఘాలోచనతో కూర్చొనున్న తారను మరో తార చూసి, "ఏమిటండీ, అంత సీరియస్‌గా ఆలోచిస్తున్నారు?" అంది.

"మీరీ రహస్యాన్ని కడుపులో దాచుకోవాలి సుమా. ఈ పిక్చర్ ప్రొడ్యూసర్‌కీ నన్ను వివాహం చేసుకోవాలని ఉంది; డైరెక్టర్‌కీ నన్ను వివాహం చేసుకోవాలని ఉంది," అందా తార.

"ఐతే, మీకు భర్త అయ్యే ఆ అదృష్టవంతుడెవరో చెప్పరా?"

"భర్త అయ్యేది ప్రొడ్యూసరే."

"ఐతే అదృష్టవంతుడు డైరెక్టరన్న మాట."అంటూ ఆ మరో తార అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

* * *

ఒక నిర్మాత, ఒక సెక్సీ డాన్సరును బుక్ చేయడానికి వచ్చాడు. ఆమె బింకంగా "క్షమించాలి. 1998 వరకు నా కాల్ షీట్లు బుక్ అయిపోయాయి," అంది.

"ఐతే, ఈ తర్వాతే ఇవ్వండి" అన్నాడు నిర్మాత.

ఆ నటి నివ్వెరపోయింది. "అదేమిటండీ! అప్పుడు మీరేం సబ్జెక్ట్ తీస్తారు? అందులో ఏ ఏ వేషాలుంటాయో, నాకేం ఇస్తారో ఇప్పుడే ఎలా నిర్ణయించగలరు?" అంది.

"ఏ సబ్జెక్టయినా మీకిచ్చేది తల్లి వేషం. అప్పటికి మీ వయసు బాగా ముదిరిపోతుంది కదా?" అన్నాడు నిర్మాత.

* * *

ఒక గ్రామం వద్ద ఔట్ డోర్ షూటింగ్ చూడ్డానికి చాలా మంది జనం వచ్చారు. వాళ్ళు నిశ్శబ్దంగా ఉండాలని చెప్పమంటూ అసిస్టెంట్ డైరెక్టర్‌కు పురమాయించాడు డైరెక్టర్. వెంటనే అసిస్టెంట్ డెరెక్టర్ ఆ గుంపును ఉద్దేశించి, "ఇప్పుడు కామెడీ సన్నివేశాన్ని తీస్తున్నాం. ఎవ్వరూ నవ్వకూడదు!" అన్నాడు. ఆ సీన్‌ను తీశారు. ఎవ్వరూ నవ్వలేదు. అసోసియేట్ డైరెక్టర్ మళ్ళీ ఆ గుంపుని ఉద్దేశించి," మీకందరికీ థాంక్స్," అన్నాడు.

"ఎందుకు?" అన్నారు ఆ గుంపులోని ఒకరు.

"మీరెవ్వరూ నవ్వనందుకు."

"మీరు తీసిన సీన్‌లో నవ్వు పుట్టించేదేముందని?"

అంతే. ఆ సహాయ దర్శకుడు నిస్సహాయంగా డైరెక్టర్ వంక తిరిగి, బరువుగా నిశ్వాస వదిలాడు.

—జి.వి.జి.

## "ముద్దుల చెల్లెలు"లో మంచి అన్నయ్య

అప్పుడే పొలం నుంచి రంగనాథ్ ఇంటికొచ్చాడు. చెల్లెలు లక్ష్మి (తులసి) కుంటుకుంటూ రావడం చూసి గాభరాతో "ఏమ్మా, ఏమైంది, ఎక్కడన్నా పడ్డావా?" అడిగాడు.

"గాజు పెంకు గుచ్చుకుంది," అంది లక్ష్మి.

వెంటనే రంగనాథ్ తువ్వాలు చింపి, కట్టు కడ్తూ, "ఎంత రక్తం పోయింది! అసలు ఎక్కడికెళ్ళావ్?" అన్నాడు.

"గొబ్బిపూలు కోసుకుందామని...."

"గొబ్బిపూలా? అవి నీకెందుకు? నువ్వెళ్ళావా, ఎవరైనా తీసుకెళ్ళారా?"

"దుర్గ తీసుకెళ్ళింది."

రంగనాథ్ కోపంతో దుర్గ (వైజయంతి) చెంప చెళ్ళుమనిపించాడు. "దుర్గా! నీకు బుద్ధుందా లేదా? ఎవర్నడిగి తీసుకెళ్ళావ్?" అన్నాడు.

దుర్గ రోషంతో "ఎవర్నడగడమేంటి? ఆడవాళ్ళకు పూలన్నా కూడా ఇష్టం ఉండకూడదా?" అంది.

"నీకెన్నయినా ఇష్టాలుండొచ్చు. అవి ఎదుటి మనిషికి కష్టం కాకూడదు.... లక్ష్మికి కాలు తెగింది. బోలెడంత రక్తం పోయింది," అన్నాడు రంగనాథ్.

దుర్గ అర్థోక్తిలో "నీకు బయిట పడిన గాయాలు మాత్రమే కనిపిస్తాయి, మాఁవా!" అంది.

"ఏమో.... అవన్నీ నాకు తెలియవు. నీ వల్ల మా చెల్లికి ఇంకెప్పుడయినా ఏమైనా జరిగిందో- నిన్నేం చేస్తానో నాకు తెలియదు," అన్నాడు తీక్షణంగా రంగనాథ్.

దుర్గ కనుకొలకుల్లో నీటి బిందువులను చూసి లక్ష్మి మనసు చివుక్కుమంది.

ఇమంది రామారావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. రామయ్య శెట్టి సమర్పించే శ్రీ యోగప్రియ ఆర్ట్ క్రియేషన్స్ "ముద్దుల చెల్లెలు" చిత్రానికి ఎ. రాజారావు, ఎ. రమణయ్య నాయుడు నిర్మాతలు. 

# భూగర్భ నిధి నిక్షేపాలను డౌసింగ్ ద్వారా కనుగొన్న లేత్‌బ్రిడ్జ్



భూగర్భంలో ఉన్న నీటిని, ఖనిజాలని, నిధులను కనిపెట్టడానికి శాస్త్రజ్ఞులు ఇటీవలి కాలంలో అత్యంత ఆధునిక పరికరాలను కనిపెట్టారు. కానీ దాదాపు పన్నెండు శతాబ్దాల క్రితమే మన పూర్వీకులు కేవలం ఒక కర్ర ఆధారంతో భూగర్భ జల నిధులను కనుగొనేవారని తెలిస్తే ఆశ్చర్యంగా ఉంటుంది. మన దేశంలోనే కాక దాదాపు ప్రతీ దేశంలోను పన్నెండు శతాబ్దాల క్రితం నుంచి ఈ "డౌసింగ్" అనే విద్య బహుళ ప్రచారంలో ఉంది. పదిహేనవ శతాబ్దంలో జర్మనీ దేశస్థులు ఈ విద్యకు సంబంధించిన ఒక గ్రంథం విడుదలచేసి మరింతగా ప్రచారం చేసారు. ఇంగ్లండుకు చెందిన టి. సి. లేత్ బ్రిడ్జి అనే మానవ శాస్త్ర నిపుణుడు ఈ విద్యను ప్రభుత్వంచేత గుర్తింపు పొందించడానికి ఎంతో కృషి చేసి కృత కృత్యుడయ్యాడు.

"ప్రతీ మనిషిలోను కొన్ని అతీంద్రియ శక్తు లనేవి ఉంటాయి కొందరు ఎదుటివారి మనసులో ఏముందో తెలుసుకోగలరు, మరికొందరు ఒక ప్రదేశంలో ఏముందో తెలుసుకోగలరు, మరికొందరు ఒక ప్రదేశంలో ఉండి మరో ప్రదేశంలో ఏం జరుగుతుందో చెప్పగలరు. అలాగే డౌసింగ్ నిపుణులు కూడా భూగర్భ జల నిధీ, నిక్షేపాలను తమ అతీంద్రియ శక్తితో తెలుసుకోగలరు" అని గాఢంగా విశ్వసించే లేత్ బ్రిడ్జి మానవ శరీర నిర్మాణ శాస్త్రంలో పట్టా పొంది, ఎన్నో ప్రయోగాలు చేసిన అనంతరం డౌసింగ్ విద్యను చేపట్టారు

ఇంగ్లీషు అక్షరం "వై" ఆకారంలో ఉండే ఒక కర్రను రెండు చేతులతో పట్టుకుని భూమిపై నడుస్తూంటే, ఎక్కడైతే నీరు, నిధులు ఉన్నాయో, సరిగ్గా ఆ ప్రదేశంలో అప్రయత్నంగా, చేతిలోని కర్రను భూమి ఆకర్షించి తన వైపు లాగుకోవడం జరుగుతుందిట. అక్కడ తవ్వి చూస్తే నీరు పడినట్లు నిధులు దొరికినట్లు ఎన్నో దాఖలాలు ఉన్నాయి. అలాగే ఒక బొంగరంలాంటి వస్తువుకు (పెండ్యులమ్) తాడు కట్టి భూమి పైన నడుస్తూంటే నిధులు ఉన్నచోట, ఆ బొంగరం క్రిందకు లాగుతుందిట, ఇలాగ కొందరు ప్రదర్శిస్తూ ఉంటారు.

మొదటి పద్ధతికన్నా రెండవ పద్ధతి ద్వారాఎక్కువ ఫలితాలను సాధించవచ్చుని లేత్ బ్రిడ్జి ఋజువుచేసి చూపించారు. లేత్ బ్రిడ్జి ఈ విద్య గురించి ఒకసారి విలేఖరులతో మాట్లాడుతూ "అసలు నిజం చెప్పాలంటే కర్రలో కానీ, పెండ్యులమ్‌లో కానీ ఎటువంటి శక్తి లేదు. ఆశక్తి, ప్రదర్శించే వ్యక్తిలోనే ఉంది. అతనిలో ఉన్న కొన్ని అయస్కాంత శక్తులు, భూమిపై నడిచినపుడు భూగర్భంలో ఉన్న ఖనిజాలను ఆకర్షించి, అతనిలో కొంత మార్పును తెస్తాయి. ఈ మార్పు ఒళ్ళు జలదరించడంలాగనో, అదే స్థలంలో కొంచెంసేపు నిలబడాలని అనిపించటమో లేదా వెంటనే అక్కడినుంచి కదలాలని అనిపించటమో లేదా నరాలు జివ్వున లాగటమో జరుగుతుంది. ఈ మార్పు అతి స్వల్పంగా ఉంటుంది కాబట్టి అందరూ ఇది గమనించలేరు. ప్రయత్నం చేస్తే దాదాపు ప్రతీ ఐదవ మనిషిలోనూ ఈ శక్తి ఉంటుంది. ఈ మార్పును గమనించడం కొరకు డౌసింగ్ నిపుణులు చేతిలో ఒక కర్రనో, పెండ్యులమ్‌లో వాడుతుంటారు. శరీరంలో మార్పు జరిగినప్పుడు అ ప్రభావం ఆ కర్రమీద తప్పనిసరిగా ఉంటుంది. అపుడు ఆ కర్ర క్రిందికి లాగటం జరుగుతుంది. దానివలన ఆ క్రెడిట్‌ను కర్రకు ఇస్తున్నారు. నిజానికి ఆ కర్ర కేవలం ఒక పరికరం మాత్రమేనని అన్నారు.

భూగర్భ శాస్త్ర నిపుణులు ఉపయోగించే సాధనాలేవీ లేకుండా భూమిలో ఎక్కడ నీరు పడుతుందో, ఎక్కడ బొగ్గు ఉందో, ఎక్కడ బంగారం ఉందో, ప్రతీ డౌజరూ అతి సునాయాసంగా చెప్పగలడనీ, బాగా ప్రాక్టీసు చేసిన వారైతే అక్కడ ఎంత మొత్తంలో పడుతుందో కూడా ఖచ్చితంగా చెప్పగలరని లేత్‌బ్రిడ్జి అభిప్రాయం. ఇది ఎన్నో సార్లు ఋజువు అయిన దాఖలాలు కూడా ఉన్నాయి. "దీ ఘోస్ట్ అండ్ డివైనింగ్ రాడ్" అనే పుస్తకంలోనూ, "ది మంకీస్ టైల్" అనే పుస్తకంలోనూ లేత్ బ్రిడ్జి తన అనుభవాలను చక్కగా విశదీకరించారు.

పూర్వం మన దేశంలో కూడా జువ్వి చెట్టు కర్రను పట్టుకుని భూమిలోని నిధి నిక్షేపాలను కనుగొనేవారని మన పురాణాలు చెప్తున్నాయి. పదిహేడవ శతాబ్దంలో కూడా ఈ జువ్వి చెట్టు కర్రను పట్టుకొని పొలాలలో తిరుగుతూ ఎక్కడెక్కడ నీళ్ళు పడుతాయో తెలుసుకునేవారని మన గ్రంథాలలో రాసి ఉంది. ఆ కాలంలో బ్రహ్మచారులుగా ఉండే బ్రాహ్మణోత్తములు ఈ విద్యను ఎక్కువగా ప్రదర్శించి, ప్రజలకు ఎంతో సహాయం చేస్తూండేవారని పలు గ్రంథాలలో లిఖించబడి ఉంది.

అమెరికాలో కూడా ఈ విద్యను చాలా కాలంగా ప్రదర్శిస్తున్నారని చారిత్రక ఆధారాలున్నాయి. ప్రస్తుతం అక్కడ ఏభై వేల మంది డౌజర్లున్నారు. అలాగే ఫ్రాన్సులో కూడా ఇరవై రెండు వేల మంది డౌజర్లున్నారు. వారిలో కొందరు భూగర్భ నిధి నిక్షేపాలే కాకుండా హత్య చేసి భూమిలో పాతి పెట్టిన శవాల ఆచూకీ తెలుపటంలో కూడా సిద్ధహస్తులయ్యారు. వారిని అక్కడి పోలీసువారు తమ కేసులను పరిష్కరించటంలో సంప్రదించి, విజయం సాధించ గలుగుతున్నారు.

మన దేశంలో కూడా నూట ఎనభై మంది డౌజర్లు ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో చిత్తూరుజిల్లా సదుము గ్రామానికి చెందిన శ్రీ ఎమ్. కృష్ణమూర్తిగారు కూడా ఈ విద్యలో చాలా ప్రావీణ్యత సంపాదించి రాయలసీమ ప్రాంతంలో నూట ఏభయి ప్రదేశాలలో నీళ్ళు, మైకా, ఇతర ఖనిజాలు పడే ప్రదేశాలను కనుగొన్నారు. రెండు మూడు ప్రదేశాలలో భూగర్భ శాస్త్ర నిపుణులు నీళ్ళు పడవన్న చోట కూడా ఆయన నీళ్ళు పడతాయని చెప్పి ఋజువు చేసారు.

రష్యా, జెకోస్లోవేకియా దేశాల్లో కూడా "డౌసింగ్" విద్యపై ఎన్నో పరీక్షలు, పరిశోధనలు జరిగాయి. చివరకు ఇందులో మోసం లేదని నిర్ధారణ అయిన తరువాత ఈ విద్యను ఒక అతీంద్రియ శక్తిగా వర్ణిస్తూ వారి "ది జర్నల్ ఆఫ్ ఎలెక్ట్రిసిటీ" అనే పత్రికలో సీరియల్‌గా ప్రచురించారు.

ఇంగ్లండులో మొదట్లో ఈ విద్యను ప్రదర్శించే వారిని క్షుద్ర శక్త్యుపాసకులుగా భావించేవారు. రాను రాను పేరాసైకాలజీ శాస్త్రం అభివృద్ధి చెంది "డౌసింగ్"ను ఒక అతీంద్రియ శక్తిగా శాస్త్రజ్ఞులు భావించడంతో ప్రభుత్వం కూడా ముందుకువచ్చి కొన్ని పరీక్షలు నిర్వహించింది. లేత్ బ్రిడ్జి ఈ విషయంలో ఎంతో శ్రమ తీసుకుని, ప్రభుత్వం ఈ విద్యను గుర్తించడానికి ఎంతో కృషి చేసారు. భూమిలో కొన్ని ఉప్పుతో నింపిన పీపాలు, కొన్ని నీళ్ళతో నింపిన పీపాలు, కొన్ని పెట్రోలుతో నింపిన పీపాలు పాతి పెట్టి, ఎక్క డెక్కడ ఏయే పీపాలున్నాయో "డౌసింగ్" ద్వారాచెప్పమని బ్రిటిష్ ప్రభుత్వం ఆదేశించినపుడు తొమ్మిది మంది డౌజర్లు తమ కర్ర

(66వ పేజీ చూడండి)

అద్భుత వ్యక్తులు

బి.వి. పట్టాభిరామ్
మెజీషియన్—హిప్నాటిస్ట్

# పాత్రదానం

స్వప్నసుధ



అభిరామ్ ఆలోచిస్తున్నాడు.

చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం మానవ నైజమా?

అనాధలయాక ఆదుకోవడం మానవత్వమా?

వేశ్య అయాక సంస్కరించడంగొప్పతనమా?

అనాధల్ని, వేశ్యల్ని, ఏప్పవకారుల్ని ఇంకా చాలా మంది పధవిహీనలను ఈ వ్యవసే అవిష్కరిస్తున్నది. ఈ వ్యవస్థ ఈ వ్యక్తులతోనే కూడి ఉన్నది. కాబట్టి వ్యక్తి సంస్కరణ ముందు జరగాలి.

చేతులు కాలని సౌకర్యం ముందే చేస్తే.

అనాధలవక ముందే ఆదుకుంటే.

వేశ్య కాక ముందే ఆమెకు ఆధారం కల్పిస్తే—ఆ వెచ్చించేదేదో ఆదిలోనే వెచ్చిస్తే ఈ స్థితి ఉండదు గదా. ఎవరేమనుకున్నా తనకి మాత్రం ఈ అనాధల్ని ఆదుకోవడం, వేశ్యల్ని సంస్కరించడం మేం ఆదుకుంటాం మేం సంస్కరిస్తాం మీరలా అవండి అన్నట్లు ఉంటుంది. అసలు ఈ వ్యవస్థలో స్వార్థం బుసలుకొడుతుంది, హెచ్చు తక్కువలు పెచ్చురిల్లుతూ ఉన్నప్పుడు ఆ సంస్కరణ తాత్కాలికమే అవుతుంది.

అయితే ఇంతా చేస్తే తానింకా మనుగుడుపుల పెళ్లికొడుకు. మామగారితో తన అభిప్రాయాన్ని ఎలా చెప్పాలో తెలియక ఆలోచిస్తున్నాడు.

రవళి చెప్పి వెళ్లిపోయింది.

అనాధాశ్రమం వాళ్ళు వస్తున్నారట. తన చేతుల మీద వాళ్ళకు విరాళం ఇప్పించాలని మామగారు అనుకుంటున్నారట.

రవళి లక్షలార్జిస్తున్న కంట్రాక్టర్ గారమ్మాయి.

అభిరామ్‌కు తల్లి ఒక్కర్తే ఉంది. మంచి ఉద్యోగముంది. ఉండడానికి చిన్న ఇల్లుంది. మరీ బాదరా బందీ లేదనే రవళిని అభిరామ్‌కు ఇచ్చి చేసారు కంట్రాక్టరుగారు.

"ఇక్కడెందుకండి? క్రిందకు రండి. వాళ్లొచ్చే లోపల టిఫిన్ చేద్దురుగాని." రవళి అంది.

"ఇలా కూర్చో రవళి. నా మనోభిప్రాయాలు కొన్ని చెప్పాలి."

"దేనిమీద, మళ్లీ వాత్సాయనుడి...." అందంగా సిగ్గుపడ్డాడు అభిరామ్. తొలిరాత్రి ముచ్చట్లవి.

"ఛ..ఛ.. అదిగాదు. ఇప్పుడు నా చేతిమీద ఇప్పించడం దేనికి?" సున్నితంగా తప్పుకోడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. తన అభిప్రాయాలు వెల్లడిస్తే తల తిరుగుడు అంటారు కాని అర్థం చేసుకోరు మరి.

"ఎందుకంటే నాన్నగారు ప్రతి సంవత్సరం ఎంతో కొంత ఆ ఆశ్రమానికి ఇస్తారు. ఈ సారి శుభప్రదంగా ఈ ముద్దుల అల్లుడి చేత ఇప్పిద్దామని..."

"అదే ఇప్పిస్తే ఏమవుతుందని?"

"అనాధలను ఆదుకుంటున్న పుణ్యం మనకు దక్కుతుంది. సంఘం మనల్ని ఆశీర్వదిస్తుంది."

"సమాజమే సరిగా నడవలేనప్పుడు సంఘాలు సరిగా నడుస్తాయని నేననుకోను రవళి. ఈ సొమ్మును అనాధలు పేరు అడ్డం పెట్టుకొని ఆ సంఘపు పెద్దలే సగం స్వాహా చేస్తారు. పధకాలు, ప్రణాళికలు నిర్వాహకులకే లాభిస్తాయి కాని అది ఉద్దేశించిన వారికి కాదు. అందుకనే నాకిష్టంలేదు."

చిరాకేసింది రవళికి. మూడు రోజుల ముద్దుల మొగుడు మీద చూపలేకపోయింది.

"ఆలోచించు రవళి. మనలాంటి వాళ్లిచ్చే డబ్బుతో ఈ సంఘాలు ఎలాగోలా నడుస్తాయి అనుకుందాం. ఈ సంఘాలున్నాయి గదా అని- అనాధల్ని చేయడానికి వెనుకాడరు కొందరు. అంటే

పరోక్షంగా అనాథలు ఏర్పడేందుకు సహకరిస్తున్నా-యన్న మాట."

కొంత వింతగా అర్థమయింది రవళికి. మరల వసలేని వాదం అనిపించింది. అందుకే అంది.

"బాగుంది. దానం ధర్మం ఉండొద్దు. ఇచ్చినంత వరకే మన బాధ్యత. ఆ తరువాత ఎవరి పాపం వాళ్ళది."

"అది సరి కాదు రవళి. పేరుకోసం కాదు మనం దానం చేయాల్సింది. ప్రాప్తం అనుకుని కాదు చేయాల్సింది. పాత్ర మెరిగి చేయాలి. మనం సద్వినియోగం అవుతుందో లేదో చూడాలి."

"బాగుందండి. మన వ్యాపకాలు మనకు లేవు. ఎందుకొచ్చిన రొద కాని–"

"అలా అనకు రవళి. నువ్వు నా అర్థాంగివి. నన్నర్థం చేసుకో–ప్లీజ్"

"అంటే దాన ధర్మాలు కూడదంటారు అంతేనా?... అలాగేలెండి. ఎలాగు మన ఇంటికి మనం పోతాం. అప్పుడిలాగే చేద్దాం. ఇది మా వాళ్ళ ముచ్చట.... ఈ సారికి కానీయండి." ఆపుకుందా మనుకున్నా రోషాన్ని ఆపుకోలేకపోయింది రవళి.

"అలా నేననను.... మన చుట్టుచాలామంది డబ్బు సృష్టించిన సమస్యలతో సతమతమయే వాళ్ళున్నారు. వాళ్ళని మనం నేరుగా ఆదరించవచ్చు. వో పెళ్ళి కావల్సిన అమ్మాయికి పెళ్ళి చేస్తే ఓ వేశ్య తయారు కాకుండా ఆవొచ్చు. ఓ నిరుద్యోగి నిస్పృహ పొగొడితే ఓ విప్లవకారుడు తయారు కాకుండా ఆపవచ్చు. ఓ బీద విద్యార్థికి సహాయం చేయొచ్చు. ఇలా ఎన్నో–ఎన్నో. లోకమంతా అక్కరలేదు ఇలా మన పరిధిలోని వాళ్ళకి సహకరించుకుంటూ పోతే ఈ దళారీ సంఘాల

## పాత్రదానం

అవసరమే లేదు గదా."

ఆవేశంగా అంతవరకు చెప్పి అసలు రవళి వింటున్నదా? విని ఎలా రియాక్టు అవుతున్నది?అని వెరికించి చూడసాగాడు అభిరామ్.

రవళి అతడి ఆవేశపూరితమైన అభిప్రాయాల గురించి ఆలోచిస్తున్నది. అతడు చెప్పేవన్నీ పచ్చి నిజాలనిఆమె మనసు అంగీకరిస్తున్నది. కాని....

"ఇవన్నీ నాన్న గారికెలా చెప్తామండి... ఇదొక్కసారికి...."

"ఫర్వాలేదమ్మాయ్... అల్లుడు చెప్పిందంతా విన్నాను. చాలా నిజం చెప్పాడు."

"కానీ వాళ్ళొచ్చేస్తుంటారునాన్నా."

"రానీయ్ రవళి. మావయ్యగారు మీరంతా విన్నారు గదా– డబ్బు సృష్టించిన సమస్యలతో సత మత మయ్యే వాళ్ళు మీమీ పరిచయంలో ఉంటే పిలిపించి వాళ్ళకి వాళ్ళ ద్వారానే ఇవ్వమందాం."

బయట కారాగిన చప్పుడు వినపడింది. అంటే వాళ్ళొచ్చారన్న మాట.

"చూసావా రవళి... అనాథల పేరు మీద ప్రోగయిన డబ్బేగదా వాళ్ళకా వాహన యోగం కల్పించింది... నా ఫ్రెండొకడు అనాథాశ్రమంలో పెరిగినవాడే. అక్కడ తిండి, అక్కడి వాతావరణం చెపితే అసహ్యించుకుంటావు... పదండి మామగారు వస్తాను."

"రవళి. నువ్వెళ్ళి విమలని– రఘుని– ఆదెమ్మని, రాముని పిల్చుకురా..."

రవళి వెళ్ళింది.

సమాజపు పెద్దలు వచ్చి కూర్చున్నారు. రావాల్సిన నలుగురు వచ్చారు.

"చూడండి. ప్రతీ సంవత్సరం మీ ఆశ్రమానికి నేను విరాళం ఇస్తూనే ఉన్నాను. ఈ సారి మా అమ్మాయి వివాహ సందర్భంగా అల్లుడిచేత మీకిప్పిస్తున్న విరాళాన్ని మీచేతుల మీదుగా వీరికి అంద చేయండి."

సభ్యుల మొహాల్లో రంగులు మారాయి.

అభిరామ్ క్రీగంట చూసాడు. అతడొక్కడే వారి భావాల్ని అర్థం చేసుకోగలడు. ఎవరికి లాభించాలో వారికే లాభిస్తున్నప్పుడు దాన్ని ఆశించి దాని మీద బ్రతికే దళారి ఎలా మొహం పెడ్తాడో అలా ఉన్నాయి వాళ్ళ మొఖాలు.

"ఈ అమ్మాయి విమల. కట్నాలుఇచ్చుకోలేక పెళ్ళికాకుండా ఉండి పోయింది. ఈ అమ్మాయికి కుట్టు వచ్చు. మిషను కోసం ఈ అమ్మాయికి ఓ వేయి రూపాయలు. రఘు అనబడే ఈ నిరుద్యోగ పట్టభద్రునికి తనకి ఇష్టం వచ్చిన చిన్న వ్యాపారం చేసుకోడానికి రెండు వేలు. భర్త బిడ్డలు లేక ముసలిధనంలో కష్టపడి బ్రతుకుతున్న ఈ ఆదెమ్మకు ఓ వేయి. ఈ బీద విద్యార్థి రాముకు ఓ వేయి మీ చేతుల మీదుగా అందించండి."

సభ్యులు ఒకరి మొహాలు ఒకరు చూసు-కున్నారు.

వయసులో ఉన్న అమ్మాయిలు ఆర్థికంగా ఇలా నిలద్రొక్కుకుంటే అనాథలు ఎలా కాగలరు? ఆమె వ్యభిచారో ఏదో అయితే అక్రమ సంతానాన్నైనా అనాథగా తమకు అందిస్తుంది. ఆ నిరుద్యోగి సంఘ విద్రోహశక్తిగా మారితే సుకరం గదా. ఆ విద్యార్థిచదువుకుంటే ఆలోచించడం నేర్చుకుని తమలాంటి వాళ్ళని తుదముట్టిస్తాడు.

"వస్తాం శేషయ్యగారు. ఆ పనేదో మీరే చేసు-కోండి. మీ దాన గుణాల ధర్మగుణం ఏమైంది.? అనాథల్ని ఆదుకోవలసింది పోయి అన్నీ ఉన్న వారిని ఆదుకోవడమా?" ఓ సభ్యుడు కండువా దులిపి అన్నాడు.

"మావయ్యగారి దానగుణం ఎక్కడికి పోలేదండి. పాత్రదానం జరుగుతోంది. అనాథలకు మీరిచ్చే నిర్వచనం ఏమిటో నా కర్థం కాలేదు. అయినా అనాథల్ని ఆదుకోవడానికి మీలాంటి పెద్ద-మనుషులున్నారు.అనాథలు తయారవకుండా మావయ్యలాంటివాళ్ళు కృషి చేయాలి. ఇరు వర్గాల ధ్యేయం ఒక్కటే గదా?....లేకుంటే డాక్టర్లు పేషెంట్లను, కాటి కాపరి శవాన్ని, పోలీసులు నేరస్తుల్ని తమ స్వార్థాలకు కోరుకుంటున్నట్టు మీరు అనాథల్ని కోరుకుంటున్నారా?"

అభిరామ్ చురక వేశాడు.

మారు మాట్లాడకుండా ఓ తీక్షణమైన చూపు విసరి వెళ్ళిపోయారు వారు.

ఆ చూపుల్లో "ఇలా అయితే మేము బ్రతికేదేలా" అనే దుగ్ధను స్పష్టంగా చూసాడు అభిరామ్.

అలాగే విమల,రఘు, ఆదెమ్మ, రాము, అభిరామ్ ద్వారా డబ్బు అందుకుని చెమర్చిన కళ్ళతో నమస్కరిస్తుంటే ఎన్నడూ లేనంత మహదానందం కలగసాగింది శేషయ్యగార్కి. ●



# పిల్లదాని వంటి తెల్లదనం పరంపరాగతమా కేవలం—చెప్పవే ఓ మనసా!

మీ కళ్ల రంగు, ముఖ ఆకారం, మీ ఎత్తు, తెల్లని శరీర ఛాయ— ఇవన్నీ సాధారణంగా వంశపారంపర్యంగా వస్తాయి. మీకు తెల్లని వంటి ఛాయ వచ్చినా, అది అలాగే నిలిచి వుండకపోవచ్చు. దానికి కారణం, ఏళ్లు గడుస్తున్న కొద్దీ మీరు నల్లబడుతూ ఉండటమే.

## మీ చర్మం రంగును నిర్ణయించేది ఏమిటి?

మీ చర్మం లోపల మెలానిన్ అనే నల్లని రంగు పదార్థం వుంది. ఇది చర్మంలో ఎంత ఎక్కువగా వ్యాపిస్తే మనుషులు అంత నల్లగా కనబడతారు. మీ చర్మం రంగు మీద ప్రభావం చూపే బయటి కారణాలు కూడా ఉన్నాయి. ఎండలో మీరు బయటకి వెళ్లినప్పుడు సూర్యరశ్మిలోని అల్ట్రావయొలెట్ కిరణాలు మిమ్మల్ని మరింత నల్లబరుస్తాయి.



## వంటి చాయను పెంచడానికి సరియైన పద్ధతి ఏదైనా ఉందా?

ఉంది. మొట్టమొదటిసారిగా సాధించిన ఓ వైజ్ఞానిక విజయం ఫెయిర్ అండ్ లవ్లీ....నల్ల చర్మాన్ని తెల్లపరిచే క్రీమ్. ఇది మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టి తిరిగి ఎర్రగా రంగు తేలేలా చేస్తుంది.

## ఫెయిర్ అండ్ లవ్లీ ఎలా పనిచేస్తుంది?

లోపలా, బయటా 2 విధాలుగా.

<u>చర్మం లోపల:</u> ఫెయిర్ అండ్ లవ్లీ క్రీము చర్మం అడుగున మృదువుగా, సురక్షితంగా పనిచేసి, నల్లబడుతున్న చర్మం తిరిగి రంగు తేలేలాగ చేస్తుంది.

<u>చర్మం బయట:</u> ఫెయిర్ అండ్ లవ్లీలో గల 'సూర్యరశ్మిని వడబోసే' ప్రత్యేక పదార్థాలు, అల్ట్రా వయొలెట్ కిరణాలు మీ చర్మాన్ని నల్లబరచకుండా అడ్డగిస్తాయి. అయినప్పటికీ, సూర్యరశ్మిలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు.

## రంగు తేలడానికి కేవలం 6 వారాలు!

ఫెయిర్ అండ్ లవ్లీని ఆరు వారాలపాటు క్రమం తప్పకుండా రోజుకు రెండుసార్లు రాసుకోండి. మొదట చర్మంమీద కాస్త జిమజిమలాడవచ్చు. ఫెయిర్ అండ్ లవ్లీ పనిచేస్తున్నదనడానికి అది నిదర్శనం. ఆరు వారాల్లో ఖచ్చితమైన తేడా మీకు కన్పిస్తుంది, ఇతర్లకి కన్పిస్తుంది. క్రమం తప్పకుండా వాడుతూ ఉండండి, ఫెయిర్ అండ్ లవ్లీ శరీర ఛాయతో అలాగే వుంటారు.

ఫెయిర్ అండ్ లవ్లీ గురించి మీరు మరిన్ని వివరాలు తెలుసుకోవాలనుకుంటే ఈ విరునామాకు వ్రాయండి:

FAIR & LOVELY ADVISER,
P. O. BOX 758,
BOMBAY 400 021.




**ఫెయిర్ అండ్ లవ్లీ**
నల్ల చర్మాన్ని ఎర్రపరిచే క్రీమ్

హిందూస్థాన్ లీవర్ వారి
విశిష్ట ఉత్పత్తి

ఇది సహజంగా, మృదువుగా మీ వంటి చాయను పెంపొందిస్తుంది.

LINTAS FALOV 31 2316 TL




### మధు – కొటాల

ఈ ఆర్థిక యుగంలో ప్రేమ దోమ ఏమిటి గురూ, హాయిగా కట్నానికి అమ్ముడు పోక.

★ అంతే – బానిసగా వుండడంలో హాయి వుంది అనుకునేవాళ్లు – అనుకునేది!

### డి. వి. ఆర్. – విజయవాడ

నేను ప్రేమించాను. కాని.... ఆమె మోసం చేస్తే తట్టుకోలేనేమోనని అనుమానంగా వుంది.

★ చూడు మిత్రమా – కట్న విషయాలలో – మోస గించబడడం మెరుగు – యిలా అనుమానంతో సతమత మయ్యే-కంటే!

### బి.పి.ఆర్;బి.ఆర్.ఆర్;సూర్యాపేట

నేటి చలన చిత్రములపై మీ అభిప్రాయం?

★ ప్రేక్షకాభిరుచికి అద్దం పడుతున్నాయి.

### ఎమ్. ఆర్. డి. బళ్ళారి

29-6-84 పత్రికలో మీ జవాబు చదివి మీ కడుపున నేను పుట్టి వుంటే ఎంతో బాగుండేది అనిపించింది.

★ దీన్నే పొరుగింటి పుల్లకూర రుచి అంటారు రమాదేవీ! కడుపున పుట్టిన పిల్లలు – ముఖ్యంగా ఆడ పిల్లలు చిన్నప్పుడంతా తల్లులమీద మండి పడుతూనే ఉంటారు. ఆమె క్రమ శిక్షణ అమలు పరుస్తుంది కనుక – కఠినురాలు అనిపిస్తుంది.....

ఇంత మంది రచయిత్రులు, కవి వున్న మీ యిల్లు – సాహితీ వనంలా వుంటుందేమో కదా? చూడాలని కోరికగా వుంది.

★ చెప్పి మరీ రా తల్లీ. దుమ్ము దులిపి యిల్లు శుభ్రంగా వుంచేలా చూస్తాను! నందనవనం లాగా వుండదు. పుస్తకాల చిట్టడవి లాగా వుంటుంది! ఒక్క నా టేబిలే శుభ్రంగా వుంటుంది. నాబల్లమీద ఎవరూ ధైర్యం చేసి ఏం పెట్టరు. విసిరేస్తానని! నా బల్లమీద కరక్కాయ నదిలోంచి ఏరి తెచ్చిన చిన్న నల్ల రాయి, నా పెద్ద కూతురు ఫస్టు ఫారంలో కాబోలు, స్కూల్లో ఎక్కడికోవెళ్ళినప్పుడు నా కోసమని తెచ్చిన – కర్ర దిమ్మ (దానిమీదే ఎఫోర్ట్సు నెవ్వర్ ఫైల్ అని వుంటుంది) ఓ చిన్ని పాలరాతి కృష్ణుడు (మధురనుంచి వచ్చినది). ఇక గోడకి పాత కాలపు తంజావూరు చిత్రం వుంటుంది. ఈ వీటిని మాత్రమే నేను శుభ్రంగా వుంచుకునే పని చేస్తాను. రాసే కాగితాలు, నా బాల్ పోయింట్ పెన్నులు కూడా ఎవరూ తియ్యరు, భయం చేత కాదు – నా మీద యిష్టంచేత.

సినిమా వాళ్ళు చాలామంది తెలుసు-కదా. వారి జీవిత చరిత్రలు యితి వృత్తాలుగా నవల రాయకపోయారా?

నేను జీవిత చరిత్రలు రాస్తానేమో గాని – జీవితాలని కథలుగా మలిచి వారి వారి జీవితాలలో ఆటలాడుకోను. నవల – వాస్తవాలకీ రచయిత్ర ఆదర్శానికీ, ఊహకీ అల్లిక అని నా నమ్మకం.

### డి. పి. ఆర్. – హైదరాబాదు

మా వివాహమై తొమ్మిది సంవత్సరాలైంది. సంతానం కలుగలేదు. డాక్టరుచేత ట్రీట్‌మెంట్ చేయించుకున్నాము. కాని ఫలితం కలుగలేదు. రెండు సంవత్సరాల తరువాత మళ్లీ యింకో డాక్టరు ట్రీట్‌మెంటు సంవత్సరం జరిగింది.....మళ్లీ వేరే డాక్టరు దగ్గిరకి కూడావెళ్ళాము. విసుగు కల్గుచున్నది. ఏదైనా అనాధాశ్రమం నుండి బిడ్డను తెచ్చుకుని పెంచుకుందామని నా శ్రీమతి సలహా. నాకూ నచ్చింది.....

★ అనాధ శిశువును పెంచుకుని ఆశ్రయం కల్పించడం అన్నంత ఆనందం యింకో దాన్లో లేదు. నిజమే. కాని వివాహమైన తొమ్మిది సంవత్సరాలే – ఆలస్యం అనుకోనక్కరలేదు. పిల్లలు కలగరని నిర్ధారించడానికి....మీరు చూసిన డాక్టర్ల రిపోర్టులు – ట్రీట్‌మెంటు వివరాలు పట్టుకుని ఏ ప్రముఖ గైనకాలజిస్టునైనా సంప్రదించండి. సెక్సు డాక్టర్లని కాదు. వారు లాభం లేదండీ. అప్పుడు పెంచుకునే ప్రయత్నం చేయవచ్చు. తప్పక – ముద్దు లొలికే పసివాళ్ళు – ప్రేమకు నోచుకోని వాళ్ళు ఎందరో వున్నారు మీలాంటి వారి కోసం.

### ఎస్. ఆర్. అనంతపురం

ఆశ మనసుని పీడిస్తుంది. నిరాశ రొద్దున యీడిస్తుంది. ఆశ నిరాశలు లేకపోతే మనిషి జీవితానికి అర్థం వుందా! లేదా?

★ ఆశ – నిరాశల మధ్య జరిగే కాలమే మనిషి బ్రతుకు. యిక అవి లేకుంటే మనిషి జీవితం ఏమిటి?! ☐




ఈ వేళ కూడా ఆఫీసులో
రోజంతా పనే...ఇక యింటికి వచ్చేటప్పుడు,
బస్సులో అబ్బ, ఊపిరాడనంత మంది
జనం. అయితే ఏం! ఇంటికి రాగానే స్నానం
చేస్తే హాయిగా ఉంటుంది. ఒక కప్పుడు
హార్లిక్స్ త్రాగితే అలసటంతా పోతుంది.
మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమంలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం.
పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్మారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?
Horlicks
The Great Nourisher
కొత్త సమయం,
కొత్త రూపం
మంచి పుష్టికరమైనది
8241

సీరియల్

# ఓ అమ్మ కథ – అమృతవర్షం

మూర్తి ఉత్తరాన్ని చూసుకొని ఓ రోజు సాయంత్రం బయలుదేరి కొండపాడు వచ్చేశాడు జగన్.

అప్పుడు మూర్తి, మణి తమ మూడేళ్ళ బాబు ఉదయ్‌తోపాటు తోటలో ఒకచోట మెత్తని పచ్చికమీద కూర్చొని విశ్రాంతిగా కబుర్లాడు కుంటున్నారు. సరాసరి అక్కడికే వచ్చిన జగన్‌ను గమనించిన వాళ్ళ ముఖాలు విప్పారాయి... అతిథి మర్యాదకోసం లేచినిలబడి ఉభయ కుశలోపరి తెలుసుకొంటూ సత్రంలో తమ బసవైపు దారితీశారు... ఆ మాట ఈ మాట మాట్లాడుకొంటూండగానే చాలా సమయం గడిచిపోయింది... తర్వాత 'అమ్మ'ను గురించి అడిగాడు జగన్.

"ఇప్పటిదాకా మంటపంలోనే కూర్చొని ఉంది ఆమె... జనం లేరుగామలు. లోపలికి వెళ్ళిపోయింది." అని చెప్పాడు మూర్తి.

"ఆవిణ్ణి చూడటానికి ఇప్పుడు పర్మిషన్ దొరకదా ?" అడిగాడు జగన్ ఉత్సుకతతో.

"అమ్మ చాలా మంచిది... ఇప్పుడు మనం వెళ్ళినా అభ్యంతరం పెట్టకపోవచ్చు... ఐనా... ప్రయత్నిద్దాం పద" అంటూ లేచాడు మూర్తి. జగన్‌తోపాటు మణికూడా బయలుదేరింది ఉదయ్‌ను తీసుకొని.

దాదాపు చీకటి పడిందప్పుడు. విద్యుత్ సౌకర్యం ఉంది కాబట్టి అమ్మ కుటీరంలోనూ లైట్లు వెలుగుతున్నయ్... ద్వారం ముందు అభ్యంతరం పెట్టేవాళ్ళు ఎవరూ లేకపోవటంతో సరాసరి లోపలికే వెళ్ళారు మూర్తివాళ్ళు.

ముందు గదిలో వాల్చి ఉన్న మంచంమీద కూర్చొని ఉన్నాడు ఒక వృద్ధుడు. క్రింద చాపమీద కూర్చొని తలవంచుకొని పళ్ళరసం తీస్తోంది అమ్మ... అతి సామాన్యురాలిలా వ్యవహరిస్తున్న ఆమెను మనసులో తెగ మెచ్చుకొంటోంది మణి. ఆ దృశ్యం చూస్తుంటే మూర్తి మనస్సు పూర్తిగా ఆర్ద్రవౌతోంది... అమ్మవైపే తదేకంగా చూస్తున్న జగన్ ముఖంలో రంగులు మారిపోతున్నయ్.

వృద్ధుడు సైగచేయగా తల ఎత్తిన అమ్మ,



(గత సంచిక తరువాయి)

"మీరా... రండి... కూర్చోండి." అంటూ చేస్తున్న పని వదిలి లేచి మరొక చాప పరిచింది. తర్వాత తను మామూలుగా కూర్చొని, "ఏమిటి, ఈవేళప్పుడు వచ్చారు ?... అన్నట్లు వీరు ఎవరు ?" అని అడిగింది పరిశీలించి చూస్తూ.

"ఇతడి పేరు జగన్‌మోహన్... ఒకే ఆఫీసులో పనిచేస్తున్నాం. స్నేహితులం... కూర్చో జగన్" అంటూ తను నీరసంగా కూర్చుండిపోయాడు మూర్తి. మణికూడా కూర్చొంది ఉదయ్‌ను ఒళ్ళో పెట్టుకొని... జగన్ మాత్రం అలాగే నిలబడిపోయి అమ్మవైపే తీవ్రంగా చూడసాగాడు.

కానీ, అమ్మ అతణ్ణి పట్టించుకోవటం లేదు... లేచి పళ్ళరసం నిండిన గ్లాసు వృద్ధుడికి అందించింది.

"నీ పేరు అమృత కదూ ?" — అదే సమయంలో అడిగాడు జగన్.

"ఔను. ఏం ?" — జటిలంగా చూసింది అమ్మ జగన్‌వైపు — ఒక్కసారిగా తలత్రిప్పి.

"అమ్మగా — ఇది నీ సరికొత్త అవతారమా అమృతా ?" — అడిగాడు జగన్, ఎగతాళి ధ్వనించే స్వరంతో.

"...మూర్తిగారు నీ పేరు చెప్పినప్పుడే గుర్తుపట్టాను జగన్ నిన్ను. కానీ, గతం గుర్తు

> **జరిగిన కథ—1 :** మూర్తి భార్య బలవంతంపై భార్య మణి, కుమారుడు ఉదయ్‌లో కలసి కొండపాడు 'అమ్మ' ఆశ్రమానికి వెళతాడు. అక్కడ 'అమ్మ' భక్తుల ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు అతనికి నచ్చాయి. తన అనారోగ్యం గురించి ఆమెకు నివేదించుకొని ఆమె సలహాప్రకారం ఆ ఆశ్రమంలోనే కొద్ది రోజులు ఉండను నిశ్చయించుకున్నాడు. పై విషయాలన్నీ స్నేహితుడు జగన్‌కు ఉత్తరం ద్వారా తెలియ పరచి అతనిని ఒకసారి వచ్చి ఆశ్రమం దర్శించమని రాసాడు.

చేయటం ఇష్టంలేకే నేను బయటికి పొక్కలేదు. చివరికి నువ్వే తొందరపడ్డావ్... మాసిన గడ్డం, పీక్కుపోయిన ముఖం — మానసికంగా నీలో మార్పు వచ్చిందేమోనని అనుకున్నాను మొదట. కేవలం అది నా భ్రమ అని ఒక్క మాటతో తేల్చిపారేశావ్ కద ?" అన్నది అమ్మ కొంచెం రోషపడి.

జగన్ మాటలు రానట్లు ఉండిపోయాడు కొద్దిసేపు.

"నీవన్నట్లు నేను ఎన్నో అవతార్లాలు ఎత్తి ఉండవచ్చు. కానీ, ఏ పేరుతోనూ నా విలువలు మార్చలేదు. లోకాన్ని వంచించలేదు. మరి నీ మాటేమిటి ?"-- తిరిగి అమ్మ అలా సూటిగా అడిగేసరికి తల దించేసుకున్నాడు జగన్.

"... మా జగన్ మీకు లోగడే తెలుసన్న మాట !"— అన్నాడు మూర్తి కొంత ఆశ్చర్యాన్ని కనబరుస్తూ.

"ఔనండి ! మా ఇద్దరి పరిచయము కొద్ది రోజులే ఐనా నా చరిత్రగతినే మార్చి వేశాడు ఈ జగన్.

ఒకనాడు ప్రముఖ సినీ నటి చంద్రవంకగా మారటానికి, ఈనాడు కొండపాడులో ఒక 'అమ్మ' గా మీ అందరి ముందు నిలబడటానికి మూలకారకుడు ఇతడేనంటే నమ్మతారా ! ?"

"మీరు ఒకప్పటి ప్రముఖసినీనటికూడానన్న మాట !... ఆనాడు మిమ్మల్ని యక్ష ప్రశ్నలు వేసి విసిగించాడు ఒక యువకుడు. అప్పుడతడు 'మీరు సినీ నటి చంద్రవంక కదూ ?' అని అడిగితే కాదని చెప్పారు ?"

"ఔను. ఆ సినీ నటి చంద్రవంక ఏనాడో సమాధి ఐపోయింది. అమ్మగా వచ్చిపోయేజనంతో ఇప్పటికే ఎంతో సతమతమైపోతున్నాను. అలాంటిది 'నేనొక సినీ నటిని కూడా' అని ప్రచారం జరిగితే మరిన్ని ఇబ్బందులు ఎదుర్కొనవలసి వస్తుందని ఆనాడు ఆ యువకుడికి అబద్ధం చెప్పాను... అసలు ఇదంతా నిజమోకాదో ముందు జగన్‌ను అడగండి."

అమృత అలా అనేసరికి, "ఏం జగన్...?" మిత్రుడి వైపు తిరిగి అడిగాడు మూర్తి.

"ఒకప్పుడు నేను ఉన్న పరిస్థితిలో

అయితే 'ఇదంతాశుద్ధబద్ధం' అని కొట్టిపారవేసే వాణ్ణి మూర్తి. కానీ అప్పటిలా ఇప్పుడు ఆత్మవంచనకు దిగలేను!... అమృత చెప్పింది నిజమే!... ఇంకావివరాలు తెలుసుకోవాలంటే ఆమెనే అడుగు. అమృతఅబద్ధం చెప్పదు..." అన్నాడుజగన్ హృదయపరితాపంతో.

"... అసలు జరిగినదేమిటి ?... మీకు అభ్యంతరం లేకపోతేనే చెప్పండి..." అన్నాడు మూర్తి ఆసక్తి కనబరుస్తూ.

ఖాళీ ఐన గ్లాసును తండ్రి దగ్గరి నుంచీ తీసుకొని ప్రక్కన పెట్టి, "నా జీవితమే ఒక విచిత్ర కథ... మీరు అడిగారు. ఎందుకో నాకూ చెప్పాలనిపిస్తోంది. ఓపిక చేసుకొని వింటానంటే చెప్పటానికి నాకేం అభ్యంతరం లేదు' అంది అమృత.

"చెప్పండి... మీ కథ తెలుసుకోవాలని మనస్ఫూర్తిగా ఉంది మాకు" అన్నారు మణి, మూర్తి ముక్త కంఠంతో

మణి ఒడిలో కూర్చొని ఉన్న ఉదయ్‌కు ఒక యాపిల్ కాయ ఇచ్చి తన జీవితం గురించి వివరంగా చెప్ప సాగింది అమృత... దాదాపు పదిహేను సంవత్సరాల క్రితం మాట... అసలు జరిగింది మాత్రం ఇది...



## 2

దూరంగా ఆకాశం లో దూదిపింజల్లా తేలియాడుతున్న మేఘ పరంపర! ఒక్కో మేఘాన్ని చూస్తుంటే 'ఏదో దేశపు భౌగోళిక పటమేమో' అని అనిపిస్తోంది అమృతకు యథాలాపంగా.

ఉదయం బాలభానుడుగా తూర్పున అవతరించి, మధ్యాహ్నానికి ప్రచండుడై జీవరాశిని ఝుళిపించి, సాయంకాలమయ్యేసరికి తన అన్ని తప్పులకు పశ్చాత్తాపపడుతున్నట్లు కృంగి కృశించి పోతున్నాడు దినకరుడు పశ్చిమాద్రిన... రోజు కొండ మీదికి కూర్చోవటం, అలా ప్రకృతి శోభ చూసి దానిలో తాదాత్మ్యం చెందటం అమృతకు అలవాటే. అలాగేఆమె ప్రతి కదలికను గమనించటానికి అలవాటు పడ్డ కొందరు కుర్రకారు కూడా అదే సమయానికి చేరటం మొదలు పెట్టారు ఈ మధ్య. కోతుల్లా నవ్వుతూ, వెకిలిగా వ్యాఖ్యానాలు చేస్తున్నా వాళ్ళను పట్టించుకోవటంలేదు. తన ఏకాగ్రతను సడలనీయటం లేదు అమృత.

ఐతే అదే కొండమీద అనాదికాలంగా ఉంటున్న వేణు గోపాల స్వామి ఆలయంలో అర్చకుడిగా పనిచేస్తున్న అమృత తండ్రి గోవిందయ్యకు మాత్రం సంకటంగా ఉంది ఈ పరిస్థితి... తన కూతురి మొండితనం, గ్రామ పెద్దల పిల్లల అల్లరితనం భరించలేకుండా ఉన్నాడు ఆయన.

# ఒక అమ్మ కథ

"అమృతా ! నువ్వు ఒంటరిగావెళ్ళి కొండ మీద అలా గంటల తరబడీ కూర్చోటం నాకేం నచ్చలేదమ్మా. నిన్ను చూసి కొందరు ఆకతాయి వెధవలుకూడా చేరుతున్నారు అక్కడ... నీపై వాళ్ళేమైనా అఘాయిత్యానికి తలపడితే మనం ఏం చేయగలమమ్మా ? గ్రామ మూలవిరాట్టులైన పెద్దలతో తలపడి బ్రతకగలమా? నిజానికి మన జీవితాలు అరిటాకులతో సమమమ్మా... తప్పు ముల్లుదేఐనా నష్టం అరిటాకుకే కద ?" అంటూ సాధ్యమైనంతవరకు తన కూతురికే నచ్చచెప్పాలని చూస్తుంటాడు గోవిందయ్య. మరి గ్రామపెద్దల పిల్లలకు చెప్పేంతటివాడా తను ?

"సున్నితమైన అరిటాకుతో పోల్చకు నాన్నా మన బ్రతుకుల్ని... అసలు నేను కొండమీదికి వెళ్ళి అలా ఒంటరిగా కూర్చోవటం, ప్రశాంతంగా ఆలోచించుకోవటం — ఈ వేళ కొత్తగా మొదలు పెట్టిందికాదుగద ? చిన్నతనంచుంచీ అలాగే చేస్తున్నాను. ఇప్పుడూ అంతే." అంటూ తనని తాను సమర్థించుకొంటుంది అమృత.

"అదివరకంటే ఆ దారి వేరమ్మా... ఇప్పుడు నువ్వు పెద్దదానివైనావు. పంటతో నిండిన చేనుతో సమానమమ్మా యవ్వన ప్రాంగణంలో అడుగుపెట్టిన ఆడది. పుష్కలంగా పండిన చేనుకు గట్టి కావలా పెట్టటం భూస్వామి అవసరం. అలాగే ఈడేరి ఉన్న ఆడపిల్ల ఏ ఊబిలోనూ దిగబడిపోకుండా కాపాడుకోవటం ప్రతి కన్నతండ్రి కర్తవ్యం."

"ప్రతిదానికీ ఏదో ఒక ఉపమానం చెప్పి నన్ను నిరుత్సాహపరచాలని చూడకు నాన్నా. ఐతే నేనొకటి చెబుతాను విను నా మీద నాకు ఎంతో నమ్మకం ఉంది. నన్ను ఎవరూ ఏమీ చేయలేరు. వేణుగోపాలస్వామి మనకు ఎన్నటికీ అపకారం తలపెట్టడు. అదే నా ధైర్యం."

— అలా సమాధానమిస్తుంది అమృత. ఇంకేం మాట్లాడతాడు గోవిందయ్య ?... 'సర్వజ్ఞుడు తను' అని అనుకొనే 'మరొకసారి గర్భం దాలిస్తే నీ భార్య బ్రతుకదు' అన్న డాక్టరు సలహాను పెడచెవినపెట్టి... ఆమెను పోగొట్టుకున్నాడు... కొడుకు మనసు స్కూలు చదువులమీద ఉన్నదని గ్రహించీ, పట్టుబలవంతానా అతడికి 'స్మార్తం' నేర్పించాలని మొండితనానికిపోతే — కొడుకు దూరమైపోయాడు. ఎవరికీ చెప్ప పెట్టకుండా ఇల్లువదిలి వెళ్ళిపోయాడతడు. తర్వాత మనసు మార్చుకుని వాడి ఇష్టప్రకారమే చదివిద్దామనుకొన్నా ప్రయోజనం లేకపోయింది. ఎంత వెతికించినా కనపడలేదు కృష్ణ... ఇక మిగిలింది అమృత. కూతురిమీదే తన పంచ ప్రాణాలు పెట్టుకొని బ్రతుకుతున్నాడు గోవిందయ్య.

... కొద్దిసేపటినుంచీ పెద్దగా మాటలు, వెర్రి నవ్వులు — అన్నీ గమనిస్తూనే ఉంది అమృత. ఐనా అటు చూడటంలేదు. కిమ్మనటం లేదు... కుర్రకారు తాము ఎంత ప్రయత్నించీ— కనీసం ఆమె తలనైనా తమ వైపుకు తిప్పుకో లేకపోతున్నారు. అదే వాళ్ళ అహం దెబ్బతినటానికి మూల కారణం ఐంది... 'తండ్రి గుడిలో పూజారి. కూటికి గతిలేకపోయినా దీనికి ఎంత పొగరు ?... సంగతేమిటో తేల్చేసుకోవాల్సిందే ఈ వేళ'అని తమలో తాముకూడ బలుక్కున్నారు.

వాళ్లలో ఒకడు దస్తీలో చిన్నరాయిపెట్టి ఉండలా గిట్టిగాచుట్టి విసిరాడు. అదివెళ్లి సరిగా అమృత వీపు మీద బలంగా తగలటంతో లేచి టక్కున వెనక్కుతిరిగి చూసింది.

అందరూ కోతుల్లా గెంతుతూ పగలబడి నవ్వటంతో ఆమె రెచ్చిపోయింది. క్రిందపడిఉన్న దస్తీ ఉండను తీసి చేతపట్టుకొని, "దీన్ని నా మీదికి విసిరింది ఎవరు ?" అనడిగింది.

"మాకేంతెలుసు ? మేమెవరం విసరలేదు ... కొండక్రిందినుంచిగాని ఎవడైనా విసిరాడేమో చూడు !" అన్నారు అంతా అమాయకంగా ముఖంపెట్టి.

"సరే...నామీదికి విసిరినవాడికే ఇదివచ్చి తగుల్తుంది" అని శక్తికొద్దీ విసిరింది ఆ ఉండను. అది సరిగ్గావెళ్లి గ్రామ పెద్ద లక్ష్మీపతి కొడుకు రాజారావు కంటిమీద తగిలింది.

'అబ్బా' అంటూ పెద్దగా మూలిగాడు అతడు. 'తన మీదికి ఆ దస్తీని విసిరింది రాజాయేనని అమృతకు ఎలాతెలిసిపోయిందబ్బా ! ఛాలెంజి చేసినట్లు చెప్పింది. అలాగే చేసింది మరి !' అంటూ ఆశ్చర్యపడటం మిగతావాళ్ల వంతైంది.

"నా కంటి మీద ఇంత దెబ్బ కొడతావా ? నీ సంగతేమిటో చూస్తాను ఉండు" అని బెదిరించాడు రాజారావు. తర్వాత తన మిత్ర బృందంతో వెళ్లిపోయాడు.

అమృతకు కూడా మరి అక్కడ ఉండబుద్ధి కాలేదు. దేవాలయం వైపు వెళ్లింది.

భక్తుల రాకకోసం నిరీక్షిస్తూ ఆలయ మంటపంలో కూర్చొని ఉన్నాడు గోవిందయ్య. ఉత్సవాలు, వేడుకలు — అప్పుడు తప్పితే మిగతా రోజుల్లో రద్దీ ఉండదు అక్కడ. అమృత వెళ్లి గర్భగుడికి ఎదురుగా మంటపంలో కూర్చొంది చేతులు జోడించి, కళ్లుమూసుకొని.

కూతురు కొన్ని సందర్భాలలో అలా దైవ సాన్నిధ్యంలో కూర్చొని తననితాను మైమరచి పోవటం చాలాసార్లు చూశాడు గోవిందయ్య. కాబట్టి అదేంపట్టించుకోలేదు ఆయన.

బాగా చీకటిపడి కొంచెం ప్రొద్దుబోయిన తర్వాత గుడి తలుపులు మూసి, లాంతరు చేత పట్టుకొని ఇంటికి బయలుదేరటానికి సిద్ధమై "అమ్మా" అని పిలిచాడు కూతుర్ని. అమృత కళ్లుతెరిచి చూసేసరికి గుడి తలుపులు మూసి ఉన్నాయ్. బయట బాగా చీకటిగా ఉంది. ఎదురుగా లాంతరు పట్టుకొని నిలబడ్డ తండ్రిని చూసి "పద నాన్నా" అంటూ లేచి నిలబడింది.

కొండమెట్లుదిగి కొద్దిదూరం నడిస్తే గోవిందయ్యగారి ఇల్లు వస్తుంది. అదొక్కటే ఆయన స్వార్జితం. ఇతరంగా సెంటు భూమి కూడా లేదు. ఆలయ ధర్మకర్తలు దయా దాక్షిణ్యాలతో ముట్టజెప్పే కొద్దిజీతం డబ్బుతో ఎలాగోలా రోజులు గడుపుకొస్తున్నాడు గోవిందయ్య. దాదాపు పాతిక సంవత్సరాలుగా అదే ఊళ్లో, అదే గుడిలో దైవాన్ని నమ్ముకొని బ్రతుకుయాత్ర సాగిస్తున్నాడు పాపం.

పర్వదినాలలో పురాణ శ్రవణం చేస్తుంటాడు. భారత భాగవతాదులను అర్థయుక్తంగా చదివి విడమరిచి చెబుతుంటాడు గ్రామస్థులకు. అందుకే అక్కడ ఆయనంటే ఓ విధమైన భక్తి, గౌరవభావం. దానివల్లే ఆదాయం తక్కువైనా ఆత్మతృప్తిగా బ్రతుక గలుగుతున్నాడు గోవిందయ్య. గ్రామస్థులు కూడా కూరగాయలంటే, పాలు పెరుగంటే ఉచితంగానే సప్లయ్ చేస్తుంటారు ఆయనకు.

## 3

మర్నాడు దేవాలయంలో నిత్యనివేదనా కార్యక్రమం ముగించుకొని వచ్చి, "అమ్మాయ్, అమృతా ! భోజనం వడ్డించమ్మా" అంటూ భుజం మీది తడి కొల్లాయి గుడ్డను ఎండపొడకు ఆరవేద్దామని ఇవతలికి వచ్చిన గోవిందయ్యకు ఉసిరిగాడు వస్తూ కనిపించాడు "దండాలు అయ్యగోరూ" అంటూ. అతడు గ్రామపెద్ద లక్ష్మీపతిగారి పాలేరు.

"ఏం ఉసిరీ, బావున్నావా?... ఈ వేళప్పుడు ఇటు వచ్చేవేమిటి ?" అనడిగాడు.

"తఁవరి కోసమే బాబూ ! పెద్దదొర మిమ్మల్ని పిలుచుకరమ్మన్నారు."

"లక్ష్మీపతిగారు పట్నం నుంచీ ఎప్పుడు వచ్చారు ?"

"ఇంతకు ముందేనండీ ... ఆరు వచ్చీ రావటంతోనే నన్ను ఇటు పంపారు."

"ఏమిటి విశేషం ?"

"ఏఁమో... నాకు తెల్దు బాబూ ..." అనేశాడు పైకి. 'దొరగారు మీమీద కారాలు మిరియాలు నూరుతున్నారు. నిన్న మాపిటేళ దేవుడి కొండమీద తఁవరి అమ్మాయిగారు ఏదో పుచ్చుకొని కొడితే ఆరి అబ్బాయి కంటికి దెబ్బ తగిలింది...' అంటూ తనకు తెలిసిన విషయం చెప్పేద్దామనుకున్నాడు మొదట. అంతలోనే 'పెద్దోరు ఆరూ ఆరూ చూసుకుంటారు. మద్దిన చిన్నాళ్ళకెందుకు తగలాటం ?' అన్న ఇంగిత జ్ఞానం వెన్నుతట్టగా తనకేమీ తెలియనట్లు ఊరుకుండిపోయాడు ఉసిరి.

"సరే... పద, వస్తాను..." అని లోపలికి వెళ్ళి,"లక్ష్మీపతిగారు పిలిచారట... నేను వచ్చిన తర్వాత వడ్డిద్దుగానిలే అమృతా" అంటూ కూతురికి చెప్పి, పట్టుబట్ట తీసి ధోవతి కట్టుకొని, మెడ చుట్టూ నిండుగా ఉత్తరీయం కప్పుకొని బయలుదేరాడు గోవిందయ్య.

తన తండ్రిని లక్ష్మీపతి అలా అర్థాంతరంగా పిలిపించటానికి కారణాలను ఊహించుకొంది అమృత. ఐతే జరిగిందేమిటో గోవిందయ్యకే తెలియదు...కూతురు చెప్పలేదు. 'మీ అమ్మాయి చూశారా ఏం చేసిందో ?' అని రాజారావూ ఫిర్యాదు చేయలేదు... నిన్న సాయంత్రం కొండ మీద జరిగిన తతంగం ఊళ్ళోనూ పొక్కినట్లు లేదు. అందువల్లే గ్రామస్తుల్లో ఒక్కరూ ఆయన ముందు ఈ ప్రస్తావన తేలేదు.

ఇక లక్ష్మీపతి నిజంగానే లక్ష్మికి పతి ! యాభై ఎకరాల సుక్షేత్రమైన మాగాణి, పెద్ద మామిడితోట, ఉండటానికి స్వర్గధామం లాంటి భవంతి— మకుటంలేని మహారాజే ఆయన ఆ గ్రామానికి. లక్ష్మీపతిలోని సుగుణం ఏమంటే



తన సొమ్ము పోకుండా జాగ్రత్త పడతాడు తప్పితే ఎదుటి సొమ్మూ తనదే కావాలని దురాశకు పోడు ... ఆయన పూర్వీకులే ఆ ఊళ్ళో వేణుగోపాలస్వామిని ప్రతిష్ఠించి, కొండ మీద ఆలయం కట్టించారు. అందువల్ల దాని ధర్మకర్తృత్వం వంశపారంపర్యంగా లక్ష్మీపతికి వచ్చింది. ఆయనలో ఏదో కొద్ది దయాగుణం ఉండబట్టే పాతిక సంవత్సరాలనాడు పైమీద బట్టలతో వచ్చిన గోవిందయ్యకు తమ ఆలయంలో అర్చకత్వం ఇప్పించటం, అతడు ఇన్ని సంవత్సరాలూ ఆ గ్రామంలో గౌరవమన్ననలతో బ్రతకగలిగేలా చేయటం జరిగింది. లక్ష్మీపతికి కూడా గోవిందయ్య మాట అంటే ఒక విధమైన గురే.

ఐతే ఇప్పుడు తన ఆశ్రితుడైన గోవిందయ్య కూతురు ప్రదర్శించిన ధైర్యం, ప్రవర్తించిన తీరు లక్ష్మీపతిని వివశుణ్ణి చేస్తున్నాయి. 'తన ఒక్కగానొక్క గారాలబిడ్డ రాజాను కంటిమీద కొట్టటమా ?... తను ఊళ్ళో లేకపోయినా సమయానికి డాక్టరువచ్చి వైద్యంచేసి పరవాలేదని చెప్పబట్టి సరిపోయింది. లేకుంటే ఏమై ఉండేది ?... ఎంతైనా హద్దుల్లో పెరగవలసిన ఆడపిల్లకు ఇంత తెంపరితనమా ?... వీళ్ళను ఇలా వదిలేస్తే లాభంలేదు. బుద్ధి చెప్పవలసిందే గిట్టిగా' అలా నిశ్చయానికివచ్చే గోవిందయ్య కోసం కబురుపెట్టాడు, ఊరునుంచీ వచ్చి విషయం తెలియగానే.

బిక్కు బిక్కుమంటూ లక్ష్మీపతిగారి భవంతిలోకి ప్రవేశించాడు గోవిందయ్య.

హాలులో లక్ష్మీపతి, ఆయన తాలూకు ఆశ్రిత జనం — అవధాని, ఆంజనేయులు కొలువుదీరినట్లు కూర్చొని ఉన్నారు.

''నమస్కారమండీ''మరి కొంచెం ముందుకు వెళ్ళాడు గోవిందయ్య. తల పక్కకు తిప్పుకున్నాడు లక్ష్మీపతి. ''కూర్చోండి గోవిందయ్యగారూ'' అన్నారు అవధాని, ఆంజనేయులు.

# ఒక అమ్మ కథ

''తమరెందుకో కబురు చేశారట ?... విషయం సెలవిస్తే...'' అన్నాడు గోవిందయ్య కూర్చొంటూ.

''ఒరే రాజా...'' అంటూ కొడుకును పిలిచాడు లక్ష్మీపతి గోవిందయ్య అడిగినదానికి సమాధానం అన్నట్లు.

''పిలిచారా నాన్నగారూ...'' అంటూ వచ్చాడు రాజారావు ఎంతో బుద్ధిమంతుడిలా ముఖం పెట్టుకొని.

''మా రాజా కుడికన్ను చూడండి గోవిందయ్యగారూ... '' అన్నాడు లక్ష్మీపతి గంభీరంగా.

అలాగే చూశాడు గోవిందయ్య. ''కన్ను ఎర్రబడిందిబాగా... దెబ్బ ఎలా తగిలింది ?'' అన్నాడు పైకి.

''ఆ విషయం మీకు నిజంగానే తెలియదా గోవిందయ్యగారూ ?'' అనుమానంగా అడిగాడు లక్ష్మీపతి.

''ప్రమాణంగా చెబుతున్నాను. నాకేం తెలియదండీ.''

''మీకు తెలియకుండానే మీ అమ్మాయి అనేక నిర్వాకాలు చేస్తోందన్నమాట !... మావాడి కన్ను పోవలసిందే. కానీ కొద్దిలో తప్పిపోయింది. నిన్న సాయంత్రం మీ కూతురే ఏదో తీసుకొని మా రాజా మీదికి విసిరిందండీ...''

''అలాగా !... జరిగిందేమిటో నాకు చెప్పనేలేదు అమ్మాయి... నిజంగా అది మరీ పెంకి ఘటమైపోతోంది... దాన్ని కోపం చేస్తాను'' అన్నాడు గోవిందయ్య.

''ఏ ప్రమాదమూ జరగకపోబట్టి సరిపోయింది... అదే మరోలా జరిగిఉంటే రాజా జీవితం ఏమైపోయేదో పాపం !'' — ఆరుతున్న పొయ్యిలోకి పుల్లల్ని ఎగదోశాడు ఆంజనేయులు, ఆ వెనకే అవధాని అందుకొని.

''ఈడేరిన ఆడపిల్ల. అదే మనకు బుద్ధి చెప్పగలిగే స్థితిలో ఉంటే దాన్ని మనం కోప్పడగలవ్, కట్టుబాట్లలో పెట్టగలవ్ గోవిందయ్యా ?'' అంటూ అవహేళన చేసినట్లు మాట్లాడాడు.

గోవిందయ్యలో అప్పటికే సగం ప్రాణాలు పోయాయి... నోటివెంట మరి మాట పెగిలి రావటంలేదు.

''నాకిదంతా తెలియదు గోవిందయ్యగారూ. ఆలయ ధర్మకర్తలం, మేమిచ్చే జీతం డబ్బుతో బ్రతుకుతున్నారు మీరు ! అలాంటిది రాజా మా అబ్బాయేనని తెలిసి ఉండీ ఇంతపని చేస్తుందా మీ అమ్మాయి ?'' అని లక్ష్మీపతి మరేదో అనబోతూండగా ఆంజనేయులు అందుకున్నాడు.

''ఒక్క మీ అబ్బాయే ఏమిటండీ, లక్ష్మీపతిగారూ! రేపు మా అబ్బాయి, కాకపోతే అవధానిగారి అబ్బాయి ! ఎవరినైనా అలాగేచేస్తుందండీ. మరి మదపిచ్చి కద ?'' అంటూ.

ఆ మాటలు శూలాల్లా వచ్చి గుచ్చుకున్నయ్ గోవిందయ్యకు. ఐనా తప్పు తన కూతురిది కనుక నిగ్రహించుకున్నాడు.

''నిజమేనోయ్, ఆంజనేయులూ ! మరి ఏ వయసులో జరగవలసిన ముచ్చట ఆ వయసులో జరగకపోతే పరిస్థితులు ఇలాగే వక్రిస్తుంటయ్. అమృత ఈడేరి నాలుగేళ్లు కాలా ? కూతురి పెళ్లి పేరంటం గురించి ఏమైనా పట్టించుకుంటున్నాడా ఈ గోవిందయ్య ?'' దెప్పిపొడుపుగా అన్నాడు అవధాని.

''గోవిందయ్యగారూ చివరిగా చెబుతున్నాను, వ్యక్తిగతంగా మీ మీద నాకు కోపంలేదు. అలా అని మీ అమ్మాయి చేసిన పనిని హర్షించి ఊరుకోలేను. ఎవరు ఎవరో, ఎవరి విషయంలో ఎలా నడుచుకోవాలో తెలియని ఉన్మత్తురాలు అమృత. వెంటనే ఆమెకు పెళ్లిచేసి అత్తవారింటికి పంపివెయ్యండి. అలాకాదు, అమ్మాయిని వదులుకొని ఉండలేను అనుకొంటే అర్చకత్వం మానుకొని తక్షణం ఈ ఊరు వదిలిపెట్టి పొండి'' శాసించినట్లు మాట్లాడాడు లక్ష్మీపతి.

గుండెలమీద కుంపటిలాంటి ఎదిగివచ్చిన కూతుర్ని ఎల్లకాలం తన ఇంట్లోనే అట్టేపెట్టుకోవాలని ఏ తండ్రి చూస్తాడు ? ... అమృత వివాహం గురించి తను ఆలోచించని రోజు లేదు. ప్రయత్నాలూ చేశాడు. ఐతే తగ్గ సంబంధమే దొరకటంలేదు. ఈ సంగతి అవధానికి తెలియదా, లక్ష్మీపతికి తెలియదా ? తెలిసీ సమయం దొరికింది కదా అని దెప్పిపొడుస్తున్నారు. అందుకే కొంత రోషపడ్డాడు గోవిందయ్య.



ఇతనెవరో మతిమరుపు భక్తుల్లా వున్నాడే! అన్నీపెట్టి అసలు నన్ను పెట్టడం మర్చిపోయాడు !!



— శేఖర్

"తగిన సంబంధం దొరికితే ఈ రోజు కావాలంటే ఈరోజే దాని వివాహం జరిపించి వేయగలను లక్ష్మీపతిగారూ! కాకపోతే రోజులే కలిసిరావటంలేదు. మీకూ తెలుసును... ఏదైనా మీ మాట ప్రకారమే త్వరలో మా అమృతకు పెళ్లిచేసి అత్తవారింటికి పంపే ప్రయత్నం చేస్తాను. తప్పితే, ఇన్ని సంవత్సరాలుగా వేణుగోపాలస్వామినే నమ్ముకొని, ఆయన్నే కొలుచుకొంటూ బ్రతుకుతున్న నన్నుమాత్రం నా స్వామి నుంచీ దూరం చేయకండి బాబూ" అంటూ రెండు చేతులూ జోడించాడు.

"అమృతకు పెళ్లి చేయాలని నీకు ఉండాలే గాని సంబంధాలకేం కొదువ గోవిందయ్యా! నువ్వు 'ఊఁ' అను, రేపీపాటికి ఓ మాంచి సంబంధాన్ని సెటిల్ చేసేస్తాను!" ముక్కుపొడుం నసాళానికి దట్టించి సందర్భం కలిసి వచ్చింది కదా అని అన్నాడు అవధాని.

"తప్పకుండానండీ అవధానిగారూ! వెంటనే సంబంధం కుదర్చండి." అవకాశాన్ని వినియోగించుకొనే రీతిలో అన్నాడు గోవిందయ్య. మరి ఈ అవధాన్నే సంబంధాలను గురించి అడిగితే, 'కనుచూపు మేరలో—ఎక్కడా తగలటం లేదు గోవిందయ్యా' అని ఎన్నోసార్లు అన్నాడు. అలాంటిదిప్పుడు గోవిందయ్యను ఇరకాటానపెటి లక్ష్మీపతి మెప్పు పొందటంకోసం ఆ మాట అన్నాడు. దాంతో సందర్భాన్ని వినియోగించుకున్నాడు గోవిందయ్య.

"ఇక్కడికి దగ్గిరే అనుకో... వరుడు ఉద్యోగం అదీ ఏమీ చేయటంలేదు. ఐనా అలాంటి అవసరం వాళ్ళకు లేదు ... పుష్కళంగా ఆస్తిపాస్తులుగలవాళ్ళు..."

"... అంతటి ఆస్తిపాస్తులున్నవాడు కట్నకానుకలు ఇచ్చుకోలేని నాకు అల్లుడు కాగలడా?"— మరుక్షణమే తన సందేహం బయటపెట్టాడు గోవిందయ్య.

"నీ స్థితిగతులు నాకు తెలియనివా గోవిందయ్యా! మరో మరో అత్యాశపర సంబంధమైతే నీకు ఎందుకు చెబుతాను?... వరుడు కట్నకానుకలు లేకుండానే పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడు. అదీ కాకుండా అమృత కడిగిన ముత్యంలా ఉంటుంది...- పిల్లను చూశాడంటే సరి. ఎగిరి గంతేసి మరీ నీ అల్లుడౌతాడు! కాకపోతే ..." అంటూ నాన్పుడు వ్యవహారంలోకి దిగాడు అవధాని.

"చల్లకొచ్చి ముంత దాచినట్లు — ఏదో చెప్పదలుచుకొని మొదలుపెట్టారు. ఆ మిగతాది కూడా చెప్పెయ్యండి అవధానిగారూ" అన్నాడు ఆంజనేయులు.

"విషయమేమింటే గోవిందయ్యా, వరుడు రెండోపెళ్ళివాడు ..." టక్కున చెప్పేశాడు అవధాని.

ఆలోచనలో పడ్డాడు గోవిందయ్య.

"ఆస్తిపాస్తులు లేవు. కట్నకానుకలు ఇచ్చుకోలేరు...అలాంటప్పుడు అన్ని యోగ్యతలూ కలిగినవాడు, మొదటి సంబంధం వరుడు ఎలా వస్తాడు గోవిందయ్యగారూ?"— యదార్థాన్ని గుర్తు చేశాడు లక్ష్మీపతి.

"భాగవత భగవద్గీతలు చదువుతావ్. పది మందికీ మంచి చెబుతావ్...కాలమాన పరిస్థితులు నీకు తెలియనివా గోవిందయ్యా? ఎంతసేపూ నీ కూతురు, దాని సుఖము అని ఆలోచించకుండా ఒక తండ్రిగా నీ బాధ్యత, కర్తవ్యం వీట్ని గురించి ఆలోచిస్తే బావుంటుంది"— అవధాని సలహా.

ఏ ఉద్దేశ్యంతో అన్నా లక్ష్మీపతి, అవధానుల మాటలు గోవిందయ్యకు వెన్ను చరిచాయి. కొద్దిసేపు లోతుగా ఆలోచించాక వరుడి గురించిన మిగతా వివరాలు తెలుసుకొనే ప్రయత్నం చేశాడు.

వరుడి వయస్సు నలభైదాకా ఉంటుందనీ, తల్లి ఉన్నదనీ, మొదటి భార్యకు ఒక కొడుకనీ చెప్పి, "తంతే గారెల బుట్టలో పడ్డట్లు — నామాట విని ఈ సంబంధం చేస్తే మీ అమ్మాయి అన్ని విధాలా సుఖపడుతుంది గోవిందయ్యా" అని ఊరించాడు అవధాని.

"పెద్దలు మీరు అంతగా చెబుతున్నారు... సరే. మీ మాట ప్రకారమే జరిపిం చేస్తాను అవధానిగారూ" అని అక్కడికక్కడే మాట ఇచ్చేశాడు గోవిందయ్య.

లక్ష్మీపతి కూడా శుభస్య శీఘ్రం అన్నాడు. అంతేకాదు. "పెళ్ళి ఖర్చులూ వాటి గురించి మీరేం బెంబేలుపడిపోకండి. అన్నిటికీ నేనున్నాను.. ముందు మంచిరోజు చూసుకొని అక్కడికి వెళ్ళి రండి అవధానిగారితో... నేనింకా భోజనం చేయలేదు మరి ..." అంటూ లేచాడు లక్ష్మీపతి. అయ్యగారితోపాటు ఆశ్రితజనమూ లేచారు.

అవధాని పురోహిత్యం చేస్తుంటాడు. పెళ్ళిళ్ళపేరయ్యగా కూడా వ్యవహరిస్తుంటాడు సందర్భాన్నిబట్టి. ఇక ఆంజనేయులుకు పెద్దలు మిగిల్చిపోయిన ఆస్తి కొంత ఉంది. దాంతోనే బ్రతుకుతున్నాడు. లక్ష్మీపతికి కుడి భుజంలాంటి వాడు.

తనని ఘోరంగా పరాభవించిన అమృతకు తండ్రి విధించిన శిక్ష కేవలం 'పెళ్ళిచేసి అత్తవారింటికి పంపటమా?'— తీవ్ర 'అసంతృప్తి' అనిపించింది రాజారావుకు. అతడు పట్నం కాలేజీలో చదువుతున్నాడు. శలవులకని ఇంటికి వచ్చాడు కొద్ది రోజుల క్రితం.

గోవిందయ్యకు తన కూతురి మనస్తత్వం బాగా తెలుసు. చీమకు హాని చేయాలన్నా వెనుకాడుతుంది ఆమె. అలాంటిది అనవసరంగా దురుసుతనానికి ఎందుకు పోతుంది?... ఈ రాజారావు తన బృందం వాళ్ళతో కలిసి ఏదో చేసే ఉంటాడు... అందుకేగామలు నిన్న సాయంత్రం అమృత దైవమంటపంలో అలా ఏకాగ్రంగా కూర్చుండి పోయింది!... 'జరిగింది ఇది నాన్న' అని తనకు ముందే చెప్పినా బాగుండేది. పిచ్చిపిల్ల. మనసులో తను ఇదైపోయిందిగాని బయటికి పొక్కలేదు...పోనిలే. అలా జరగటం కూడా మంచిదే ఐంది. లక్ష్మీపతి గారి మెప్పుపొందటం కోసం సంబంధం కుదర్చటానికి ఒప్పుకున్నాడు అవధాని. అమృత నెత్తిన నాలుగు అక్షింతలు పడి అది అత్తవారింటికి వెళ్ళిపోతే తనకిక చీకు చింత ఉండదు.

కాకపోతే రెండవ సంబంధం వరుడు... ఐనా తన మాట కాదనదు అమృత. ఇందులో సందేహం లేదు— తేలిక పడిన మనసుతో పెద్ద పెద్ద అంగలు వేయసాగాడు గోవిందయ్య.

[ఇంకా వుంది]



## పరీక్షలలో సినిమా!

తమిళనాడులో మొన్న జరిగిన ప్లస్ టు పరీక్షలలో వో పరీక్షా పత్రంలో ప్రఖ్యాత నటుడు, రచయిత, దర్శక నిర్మాతా భాగ్యరాజ్, నటి పూర్ణిమ వివాహాన్ని గురించి 200 వాక్యాలు గల వ్యాసమును రచింపుము అని వున్నదట. అది రాయలేకపోతే "మనము సాధించగలము అని ఇందిరా గాంధి చెప్పెను" అన్న విషయంమీద రాయమనుందట. దీనిమీదదే బెటరులా వుందా!

## జర్మనీలో పుట్టిన లాటరీ!

1612 వ సంవత్సరంలో జర్మనీకి చెందిన హేంబర్గ్‌లో మొట్ట మొదటిసారిగా లాటరీ పుట్టిందట. ఈ లాటరీ టిక్కట్లను ఆనాడు వో కూలీనునికి యిచ్చేవారట. అతనే ఈ అమ్మకం నిర్వహించేవాడట. ఇది మొదట "వీనల్" అనే ఆయనకు వచ్చి, ఆన కది వంశ పారంపర్యపు హక్కుగా మారి, ఆ కుటుంబంవారే యీ లాటరీ టిక్కట్లు అమ్ముతూండేవారట. ఈవిధంగా 371 సంవత్సరాల క్రితం పుట్టిన ఈ "లాటరీ" చిలవలు పలవలు కమ్మి జనుల్ని లాటరీ కొట్టిస్తోంది.




## అరబ్బు షేకులకోసం కన్నె పిల్లల ఎగుమతి!

భారతదేశం వో రకంగా వ్యాపార పరంగా అభివృద్ధి బాగనే చెందుతున్నట్టు వొప్పుకోవాలి. వయసొచ్చిన ఆడపిల్లలను అరబ్బు దేశాలకు ఎగుమతి చేయడం జోరుగనే వుంది. సుఖం అనుభవించాలని వుబలాట పడే కన్నె పిల్లల బలహీనతలను రెచ్చగొట్టి, వారికి ఆశ చూపి, వారిని షేకుల కమ్మేస్తున్నారు. ఏటా ఎంత లేదన్నా వెయ్యి మంది అమ్మాయిలు ఎగుమతి అవుతున్నారు. అరబ్బు షేకులు యీ ఆడ పిల్లలను పెళ్ళి చేసుకుని, తీసుకుపోయి అక్కడ వారినన్నింటికి వాడుకుంటారు. ఇంకో పద్ధతిలో వుద్యోగాల కాశపడిన అమ్మాయిలను ఎగుమతి చేయడం. అరబ్బు షేకుల ఆశలకు బలై వివాహం పేరిట అమ్ముడుపోయే అమ్మాయిలకు హైదరాబాద్ ముఖ్య నగరం. బొంబాయి మరో నగరం. ఇటీవల వారి కళ్ళు బెంగుళూరు కన్నడ అందాలమీద పడి, అటు కూడా మళ్ళుతున్నారట.




## ఉత్తర భారతంలో పిల్లల దొంగలు!

అమ్మాయిల అమ్మకం ముఠా వలెనే ఉత్తర భారత దేశంలో చిన్న పిల్లల్నెత్తుకుపోయే ముఠాలు కూడా వున్నాయట. (దక్షిణ దేశంలో లేవని కాదు.) బీహారు దాల్మియా నగరుకు చెందిన వో రిటైరుడు డి.ఎస్.పి. గారిని వో ముగ్గురు కుర్రాళ్ళు వో ఆశ్రమానికి చందా వేయమని వేపించుకు తింటే ఆయన ఆసక్తితో ఆ చందా ఫారం తీసుకుని చూస్తే అది పేరు మోసిన వో నాగపూరు ఆశ్రముందట. ఆయన కనుమానమొచ్చి ఆ పిల్లల్ని కదిపితే వారు తమ మాస్టారని వొకాయన్ని చూపారట. అనుమానమెక్కువయిన ఆ డియస్పీగారా మాస్టార్ని రెండు పీకులు పీకితే ఆయన పిల్లల్నెత్తుకుపోయే వో పెద్ద గ్యాంగుకు స్థానిక కార్యదర్శి అని తేలిందట. పిల్లల్ని ఎత్తుకుపోయి, భయపెట్టి, వారిచేత శత కోటి విధానాలలో డబ్బు సంపాదింపచేసి, ఆ సంస్థ లాక్కుంటుందట. దీని బ్రాంచి ఆఫీసులు చాలా నగరాల్లో వున్నాయట.

## మహా వ్యక్తి!

పాలిటిక్స్‌ను సినిమా గ్లామరుతో ముడి పెట్టిన ఘనత తమిళనాడుకు వస్తుంది. ఈనాడు వారు పట్టినసోము అందరూ (అన్ని రాష్ట్రాలు) పడుతున్నారు. అయినా కొన మెరుపులో ఆ రాష్ట్రం ఆ రాష్ట్రమే. ఒహనాటి సినీమణి, యీనాటి రాజకీయమణి జయలలితను బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్‌తో "పోల్చుము" అని తమిళ పాఠ్య భాగాలలో వున్నదట. ఈ విషయంలోని వివాదంలో పాల్గొని మాట్లాడిన తమిళనాడు రాష్ట్ర విద్యామంత్రి నెడుంఝెళియన్ జయలలిత (ప్రస్తుతం ఎం. పి.) అలనాటి చక్కని నటి అనీ, యీనాడు అన్నా డి. యం.కే. కు ఎనలేని సేవ చేస్తోందని, అటువంటి మహా వ్యక్తి పేరు పాఠ్య పుస్తకాల్లోనే గాక, దేశ చరిత్రలో నే నే కూడా ఎక్కవలెననీ ఎసెంబ్లీలో నొక్కి వక్కాణించారట!!

## సి. ఐ. ఏ. ఏజంటు మత్తాయ్!

అలనాటి భారత ప్రధాని స్వర్గీయ పండిట్ నెహ్రూకు స్పెషల్ అసిస్టెంటుగా పని చేసిన యం. ఓ. మత్తాయి అమెరికా గూఢచారి సంస్థ సి. ఐ. ఏ. కు ఏజంటుగా వుండేవారని, దాని కాయన చక్కని బరువైన పారితోషికం తీసుకునేవారని, 1949 – 1959 మధ్య కాలంలో నెహ్రూ కార్యాలయంనుంచి వెళ్ళిన ప్రతి పేపరు నఖలూ అమెరికావద్ద వున్నాయని, డాక్టర్ గోపాల్ "నెహ్రూ జీవిత చరిత్ర"లో రాశారట.

## పురుషులను మత్తెక్కించే స్త్రీల వేషధారణ!

స్త్రీలు పనిచేసే చోటుల్లో పురుషుల పని వేగం తగ్గుతుందని, యీనాటి స్త్రీల వేషధారణ మగాళ్ళ బుర్రలు పురుగు దొల్చినట్టు దొలిచేస్తోందని బొంబాయికి చెదిన వో విశ్వ విద్యాలయంలో సైకాలజి చదువుతున్న నితిన్ అనే వో విద్యార్థి తేల్చి చెప్పాడట. ఆడవాళ్ళు బొడ్డు క్రిందకు కట్టే చీరలు, లోనెక్ జాకట్లు, స్లీవ్‌లెస్ జాకట్లు, వారి మేకప్, నడక, వగైరాలు ముఖ్యంగా వివాహితులను వెర్రెత్తించేస్తున్నాయట. పెళ్ళి కాని వాళ్ళకన్నా అధి ఆయన-




వారే మరీ గంగ వెర్రులెత్తుతున్నారనీ, తత్ఫలితంగా పనితనం ఆఫీసులలో తగ్గిపోతోందనీ ఆయనన్నారట.

## కర్ర కాలుతో సైకిల్ పోటీలో గెలుపు!

పూనానుంచి కన్యాకుమారికి గల దూరం 1960కిలో మీటర్లు సైకిలు త్రొక్కే పందెం భారత్ దర్శన్‌లో మరో 32 మందితో పాల్గొన్న 36 ఏళ్ళ పీతాంబరన్ అనే అతనికి కుడి కాలు తొడ వరకు లేకపోయినా, కర్ర కాలు పెట్టుకుని యీ పోటీలో ప్రథముడుగా వచ్చాడట. ఈ దూరాన్నతడు 58 రోజులలో త్రొక్కాడట.






# కలువబాల

## ప్రారంభ సంచిక
(ఆగస్టు 15-31, 1984)

మరచిపోకు నేస్తం } సీరియల్సు
మౌనరాగం

విచ్చిన పూలు } కథలు
కెవ్వుమన్న కేక

ఇంకా.....

ఆడవారు-ఆస్తి హక్కులు, మీరూ మీ బుద్ధీ, బొమ్మా-బొరుసా, ఆహా.... అయ్యో!, ఆడవారూ - ఆరోగ్య సమస్యలు, తారావళి, తొలి మహిళా విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌తో ఇంటర్వ్యూ, గడుసు జింకపిల్ల, సినీ తార ఛాయ, అరటి పండు, కుట్టు పని చిట్కాలు..... మొదలైన శీర్షికలు-వ్యాసాలు.

గ్లామర్‌నటి విజయశాంతి
ముఖచిత్రంతో వెలువడినది

విడిప్రతి 150 పైసలు

## చందా వివరములు

**ఏజంటు ద్వారా:**

3 నెలలకు ....... రు. 9-00
6 నెలలకు ....... రు. 18-00
1 సం॥ నకు ....... రు. 36-00

**పోస్టు ద్వారా:**

3 నెలలకు ....... రు. 9-90
6 నెలలకు ....... రు. 19-80
1 సం॥ నకు ....... రు. 39-60




( గత సంచిక తరువాయి )

ఆరుగుమీద పక్క పరచుకుని పడుకొన్నాడతను.

వెన్నెల విరగకాస్తోంది. హఠాత్తుగా అతని మనసు గతంలోకి పరుగుతీసింది.

ఈ వెన్నెల రాత్రులు బీచ్‌లో ఎవరో ఒక అమ్మాయితో గడుపుతూండేవాడు తను. సావిత్రి ఎన్ని రాత్రులు తనతో ఉంది. సావిత్రి ఆత్మహత్య తరువాత ఈ రోజు వరకూ తనసలు వెన్నెల చూడనేలేదు. ఒకవేళ చూసినా తన మనసు గ్రహించనేలేదా విషయం.

అప్పుడే సావిత్రి దూరమయి సంవత్సరం గడచిపోయింది.

బహుశా ఆమె బంధువులకూ, తనకూ తప్ప ఇంకెవరికీ సావిత్రి అనే ఒక అమ్మాయి ఉండేదనికూడా తెలీదు.

ఎంత అమాయకంగా మాట్లాడేది సావిత్రి?

ఆమె అమాయకత్వం తననెందుకు కదల్చలేకపోయింది ? కేవలం ఆమెను అనుభవించి వదిలేయాలన్న తన మనస్తత్వాన్ని ఎందుకు మార్చలేకపోయింది ?

ఆమె గురించి ఇప్పుడాలోచిస్తున్న విధంగా, కనీసం ఈ ఆలోచనకు దగ్గరగానయినా ఆ రోజున ఎందుకు ఆలోచించలేకపోయాడు తను ?

ఆ ఆలోచనలతో మనసంతా అల్లకల్లోలంగా తయారయిందతనికి.

అతనికి హఠాత్తుగా ఉష గుర్తుకొచ్చింది.

ఇటీవల తరచుగా— ఆమె గుర్తుకొస్తోంది, ఎప్పుడయినా అర్ధరాత్రుళ్ళు మెలకువ వచ్చినప్పుడూ, ఏ పనీ లేకుండా ఖాళీగా కూర్చున్నప్పుడూ. ఆమె అదివరలా తనతో చనువుగా మసలడంలేదు. మాట్లాడడంలేదు.

బహుశా తన ప్రవర్తన ఆమెను గాయపరచి ఉంటుంది.

ఆమెకు ఇంటర్‌వ్యూ అయిన దగ్గర్నుంచీ తనకు తెలీని అశాంతి మొదలయింది మనసులో.

ఆమెకు ఆ ఉద్యోగం వస్తే ఇక ఆమె కనిపించడం అసంభవం ! ఎంచేతో ఆమెకా ఉద్యోగం రాకూడదనీ, ఆమె ఇదే ఆఫీస్‌లో పని చేస్తూ ఉండాలనీ అనిపిస్తోంది.

కానీ మళ్ళీ అంతలోనే విరుద్ధమయిన ఆలోచనలు—

ఆమె ఎక్కడికెళ్ళిపోతే తనకెందుకు ? ఆమె కనిపించకపోతే మునిగిపోయిందేముందీ ? ఆమాటకొస్తే అసలు ఎవరేమయిపోతే తనకేం ? ప్రసాద్ తన ప్రాణస్నేహితుడు ! అతను తనకోసం ఎన్నోసార్లు ఆఫీసుకొచ్చాడు. ఇంటికొచ్చాడు. ఆ ఇల్లూ— తను చేసే ఉద్యోగం ఇవేమీ అతనికి నచ్చలేదు. ఆ ఉద్యోగం మానేయమనీ, తనింట్లోనే ఓ గదిలో ఉండమనీ బతిమాలాడు.

అయినా తను వినిపించుకోలేదు.

తన మీద కోపం వచ్చి అతను తనను కలుసుకోవడమే మానేశాడు. అయినా తను లెక్కచేయలేదు. ఏదో తెలీని నిర్లక్ష్యం, నిర్లిప్తత. రోజులెలా గడుస్తున్నాయో, తనేం చేస్తున్నాడో, చుట్టూ ఏంజరుగుతోందో తెలీటంలేదు— తెలుసుకోవాలనీలేదు.

ఇప్పుడనిపిస్తోంది—తనిలా ఒంటరితనంలోని నరకాన్ని భరించగలడా ? తను మర్చిపోవాలని అనుకుంటున్న గతాన్ని ఇలా ఒంటరిగా ఉంటూ మర్చిపోగలగడం సాధ్యమేనా ?

ఉషలాంటి అమ్మాయి సహచర్యం ఉంటే తను ఈ మానసిక క్షోభ నుంచి బయటపడగండేమో !

అనుక్షణం తనను నీడలా వెన్నాడే సావిత్రి ఆలోచనల నుండి తప్పించుకోగలడేమో !

సావిత్రిని మర్చిపోవడం ఎంత అసాధ్యమవుతుందో, ఉష ఆకర్షణ నుంచి తప్పించుకోవడం కూడా అంత కష్టమవుతోంది. ఆమె తనతో ముభావంగా మసలడం ఆమె ఆకర్షణని మరింత పెంచుతోందేగాని తగ్గించడంలేదు. ఇలాంటి వాటన్నిటికీ దూరంగా జీవితం గడపాలనుకుంటే తిరిగి వాటిమధ్యే ఇరుక్కుపోతున్నాడు.

అతనికి ఎప్పుడో నిద్రపట్టేసింది.

తిరిగి మెలకువ వచ్చేసరికి పూర్తిగా తెల్లారిపోయింది.

టైమ్ ఎనిమిదవుతోందప్పటికే. త్వరత్వరగా రడీఅయి ఆఫీస్‌కి చేరుకున్నాడు.

అప్పటికే రాజయ్య ఆఫీస్‌కొచ్చి వెళ్ళిపోయినట్లు చెప్పారు హబీబ్.

"నాకేమయినా పని చెప్పారా?"

"లేదండీ! ఇంగ్లీష్ మాగజైన్స్‌లో నుంచి జోక్స్ కాపీ చేసి మన పత్రిక్కి పంపమన్నారు—"

"సరే..."

ఇంగ్లీష్ పత్రికలు ముందేసుకుని కూర్చున్నాడతను.

కొద్దిసేపటి తర్వాతగాని అతనికి గుర్తురాలేదు—ఉష ఆఫీస్‌కి రాలేదని.

"ఉష ఆఫీస్‌కి రాలేదేం ?" హబీబ్‌నడిగాడతను.

"ఏమో! తెలీదు..."

అతని ఆలోచనలన్నీ ఉష మీదకు మళ్ళినయ్.

ఎందుకు రాలేదామె? సాధారణంగా ఆమె ఆఫీస్ మానడం ఎప్పుడూ జరగదు. ఒకవేళ అనారోగ్యమా ?

లేక ఇంకెక్కడయినా ఇంటర్‌వ్యూ, లేక పరీక్ష ఉందా ?

అలాంటిదేమయినా ఉంటే ఆఫీస్‌కొచ్చి చెప్పి వెళ్ళేదే కదా !

మధ్యాహ్నం రాజయ్య వచ్చాడు మళ్ళీ.

"ఉష ఏదీ ?" ఎస్తూనే కృష్ణనడిగాడతను.

"ఏమోనండీ ! ఉదయం నుంచీ కనిపించలేదు..."

"పెద్ద తలనొప్పి అయిపోయిందే ఈ అమ్మాయితో ? నాకు అర్జంటుగా టైప్ చేయాల్సిన లెటర్స్ ఉన్నాయ్— ఎలా ఇప్పుడు?" మండిపడుతూ అన్నాడతను.

**జరిగిన కథ—12 :** కృష్ణ అన్న, వదినలకు భారంగా ఉండటం ఇష్టంలేక ఉద్యోగాన్వేషణకై హైద్రాబాదు వెళతాడు. ప్రసాద్ సహాయంతో అక్కడ దీపిక పత్రికాఫీసులో ఉద్యోగంలో చేరుతాడు. 'దీపిక' పత్రికాధిపతి రాజయ్య కూతురు జయలక్ష్మి కృష్ణతో స్నేహం చేయాలని ఉవ్విళ్ళూరుతుంది. కృష్ణ వేరే గది అద్దెకు తీసుకొని ప్రసాద్ ఇంటినుండి షిఫ్ట్ అయి వెళ్ళిపోతాడు. కృష్ణ సహోద్యోగిని ఉష అతనికి చేరువ కావాలని ఆరాటపడుతుంది. కృష్ణ ఆమెతో తన చరిత్ర మంచిదికాదని చెప్పి తనకు దూరంగా ఉండమని హెచ్చరిస్తాడు. రాజయ్య కూతురు జయలక్ష్మి కృష్ణను ఆకర్షించాలని చేసిన ప్రయత్నం విఫలమౌతుంది. ఉషకు బ్యాంక్‌లో ఇంటర్వ్యూ వచ్చింది. కృష్ణ 'దీపిక' ప్రెస్సులో రాత్రనక పగలనక పనిచేస్తూ ఉంటాడు.

కృష్ణ ఏమీ మాట్లాడలేదు.

''నీకు టైప్ చేయడం వచ్చా ?'' కృష్ణ నడిగాడతను.

''రాదండీ !''

''ఆఫీస్‌లో ఖాళీ దొరికినప్పుడు నేర్చుకుంటే సరిపోయేదిగా ?''

కృష్ణ మళ్ళీ నిశ్శబ్దం వహించాడు.

సాయంత్రానికి అతని టేబుల్ మీద ప్రూఫ్‌లు తెచ్చిపడేశాడు హబీబ్.

''రేపు మార్నింగ్ కల్లా ఇవి కరెక్ట్ చేసి ఇవ్వాలట సార్ !''

కృష్ణ టైమ్ చూసుకున్నాడు. ఆరయి పోయిందప్పటికే.

అవన్నీ కరెక్ట్ చేయాలంటే కనీసం మూడు గంటలు పడుతుంది.

''సరే...'' అన్నాడు మళ్ళీ పనిలో నిమగ్న మవుతూ.

ఏడవుతోండగా ఎదురుగ్గా అడుగుల చప్పుడు వినిపించేసరికి తలెత్తి చూచాడు.

ఉష అతని వంక చూసి ''గుడీవినింగ్'' అంది చిరునవ్వుతో.

అతను ఆశ్చర్యపోయాడు.

''గుడీవినింగ్— ఏమిటి ఇప్పుడా ఆఫీసుకి రావడం ?''

''ఆఫీస్‌కేం రాలేదులెండి. మీరుండే ఉంటారని ఎక్స్‌పెక్ట్ చేసి వచ్చాను ...''

''ఎందుకు రాలేదివాళ ?''

ఆమెకు అతని ధోరణి ఆశ్చర్యం కలిగించింది.

''నేను రాలేదని మీకు తెలిసిందన్నమాట!'' నవ్వుతూ అంది.

''తెలీకుండా ఎలా వుంటుంది ?''

''నేనున్నా లేనట్లే ప్రవర్తిస్తూంటారు కదా మీరు ...''

అతను నవ్వాడు.

''రాజయ్యగారు మీమీద మండిపడి పోతున్నారు ఇవాళ రాలేదని...''

ఆమె నవ్వింది.

''ఇంక ఆయన ఎంత మండిపడినా నాకేం భయంలేదులెండి!''

''అంటే?'' సందేహంగా అడిగాడు కృష్ణ.

''ఇవాళ బాంక్‌లో జాయినయిపోయాను..''

''ఓ! అలాగా!'' షాక్ తిన్నట్లయిందతనికి.

''అవునండీ ! అపాయింట్‌మెంట్ ఆర్డర్ ఆలస్యంగా అందింది. అందుకని ఇవాళే వెళ్ళి జాయినయాను—''

''ఏ బ్రాంచ్‌లో?''

''ఆబిడ్స్—మెయిన్ ఆఫీస్...''

''అయితే ఇంక ఇక్కడికి రారన్నమాట...''

''ఇంకేం పనుంది?'' నవ్వుతూ అందామె.

''అవున్లెండి!''

''మీకు చెప్పి వెళ్దామని వచ్చాను.''

''అంటే రాజయ్యగారికి చెప్పరా?''

''రేపు ఫోన్‌చేసి చెప్తాను ఆఫీస్‌నుంచి...''

''అదేమిటి?'' ఆశ్చర్యంగా అడిగాడతను.

''ఆయనకా మాత్రం మర్యాద చాల్లెండి!''

''ఎందుకని అలా అంటున్నారు?''

''ఉద్యోగావసరం ఉంది కదాని గొడ్డులా పని చేయించుకునే వారికి ఎందుకు గౌరవం ఇవ్వాలి?''

అతను మాట్లాడలేదు.

ఆమె మాటల్లో నిజం ఉంది.

తనను రాజయ్య ఉదయంనుంచీ రాత్రి వరకూ ఏదొక పనికి ఉపయోగించుకుంటూనే ఉంటాడు. కానీ తన విషయం వేరు. తను క్షణం తీరికలేని జీవితం కోరుకుంటున్నాడు. కానీ ఉష అలాకాదు గదా !

''నాకొక్కటే బాధగా ఉంది. ఇకనుంచీ నా పనికూడా మీమీదే పడుతూందే అని...'' అంది ఉష.

కృష్ణ ఏమీ మాట్లాడలేక పోతున్నాడు.

ఆమె ఇక కనిపించదనే ఆలోచన మనసుని కలచివేస్తోంది. తను అంతవరకూ ఆమె గురించి ఎక్కువగా ఆలోచించడంగానీ, ఆమెతో చనువుగా మసలడంగానీ చేయలేదు. ఆమెతో అనుబంధం పెంచుకోవడం ఇష్టంలేకే దూరంగా ఉండిపోయాడు. కానీ ఇప్పుడు తెలుస్తోంది. తనకు తెలీకుండానే ఆమె తను గుండెల్లో చోటు చేసుకుంది. తనకు తెలీకుండానే ఆమె తనకు దగ్గరయిపోయింది. ఇంతకు ముందెన్నడూ అనుభవించని ఓ కొత్త అనుభూతి చోటు చేసుకుంది.

అతనికి విచిత్రంగా ఉందీ పరిస్థితి.

ఆదివరకు రోజుల్లో ఏ అందమయిన



అమ్మాయి కనిపించినా ఆమె అందాన్ని అనుభవించాలన్న కోరిక తప్పితే మరో ధ్యాసే ఉండేది కాదు. ఇప్పుడు ఉష విషయంలో ఆ ఆలోచనే లేదు.

కేవలం శారీరకంగా ఒకరితో ఒకరు ఐక్యం అవడమే ప్రేమ అని తననుకున్నాడు. కానీ ఇప్పుడు ఆ అభిప్రాయం ఎంత తప్పో తెలుస్తోంది. కేవలం ఉష తన పక్కనే తనతోపాటు అదే ఆఫీసులో జీవితాంతం పనిచేస్తూంటే అంత కంటె ఆమెనుంచి తనకు కావలసిందింకేమీ లేదనిపిస్తోంది. ఆమె తనతో మాట్లాడనక్కర లేదు. తనను స్పృశించనక్కర్లేదు. తను కోరుకునేది ఆమె సాన్నిధ్యం ! అంతే !

"ఏమీ మాట్లాడరేమిటి ? ప్రెస్‌లో అర్జంటుగా ఇవ్వాల్సిన మేటర్ గురించి ఆలోచిస్తున్నారా ?" నవ్వుతూ అందామె.

తనను గాయపరచడానికే ఆ మాట అందామె. తనకేమీ అనుబంధాలూ, అనుభూతులూ ఉండవని గుర్తుచేయడానికే అలా మాట్లాడుతోంది.

"అంటే నేనో మిషన్‌లాగా కనబడుతున్నాను మీకు ! కదూ ?" అడిగాడతను.

"ఏమో ! నాకు తెలీదు— మీరు మిషనో— మనిషో ! కానీ ఎలాంటి 'రిలేషన్‌షిప్' కయినా మీరు అతీతులని మాత్రం తెలుసు ..."

ఆ మాటలో తనను మెచ్చుకోవడం కంటె, ఎద్దేవా చేయడమే కనిపిస్తోంది.

"అంటే ?" ఆమె కళ్ళల్లోకి చూసి అడిగాడు.

ఆమె నవ్వింది.

"అర్థం కాలేదా ? తన చుట్టూ గిరి గీసుకుని తను బయటకు రాకుండా, ఇంకొకరిని లోపలకు రానీకుండా జీవితం గడిపేవారికి ఇలాంటి సపరేషన్స్, కలుసుకోవడాలూ, ఎటాచ్‌మెంట్స్— అంటే ఏమిటో ఎలా తెలుస్తుంది ?"

అతని గుండెల్ని సూటిగా తాకిందామాట.

"అవును ఉషగారూ ! వప్పుకుంటున్నాను. నేను మనిషిని కాదు. మిషన్‌నే !"

"ఆమాట నేనలేదు ..."

"అనకపోయినా నిజం అదే కదా !"

"నేనిక వెళ్తాను..." టైము చూసుకుంటూ అందామె.

అతను లేచి నిలబడ్డాడు.

"పదండి ! బస్‌స్టాప్ వరకూ వస్తాను..."

"ఎందుకీ కొత్త మర్యాదలు ?" నవ్వుతూ అందామె.

అతను మాట్లాడకుండా ఆమెతోపాటు బయటకు నడిచాడు.

బస్‌స్టాప్ చేరుకుని ఇద్దరూ మౌనంగా నిలబడ్డారు.

ఇద్దరి మనసుల్లోనూ ఉక్కిరిబిక్కిరిగా

# జీవితం—సెంటిమెంట్

చేస్తున్న ఆలోచనలు— దూరంగా బస్ వస్తూ కనిపించింది.

అతనితో ఏదో చెప్పాలనీ, ఏదో మాట్లాడాలనీ అనుకుని వచ్చిందామె. కానీ ఇక్కడికొచ్చి మాట్లాడింది వేరు. ఆలోచిస్తున్నది వేరు.

"కృష్ణగారూ ! మీకు ఒక్కమాట చెప్పాలనుకుని వచ్చాను. మనశ్శాంతి అనేది ఆత్మీయుల దగ్గర లభిస్తుందిగానీ ఒంటరిగా జీవించడంలో దొరకదు..."

అతను తెల్లబోయి ఆమెవంక చూశాడు.

తన గుండెల్లో జరుగుతున్న సంఘర్షణకు ఆమె ఒక్కమాటలో పరిష్కారం సూచించినట్లనిపించిందతనికి.

బస్ వచ్చేసింది.

"గుడ్‌నైట్..." అందామె.

"గుడ్‌నైట్..." అంటూ గొణిగాడతను.

ఆమె బస్ ఎక్కేసింది.

మళ్ళీ నెమ్మదిగా నడుస్తూ ఆఫీస్‌కి చేరుకున్నాడతను.

ఆ తరువాత అతనికింక పనిచేయబుద్ధి కాలేదు. కాగితాలన్నీ సొరుగులోకి తోసి ఆఫీస్ తలుపులు మూసి తాళం వేసేశాడు.

రాజయ్య ఇంటికివెళ్ళి తలుపు తట్టాడతను.

జయలక్ష్మి తలుపు తెరిచింది.

తాళంచెవి ఆమెకందించాడతను.

"ఏమిటివాళ ఇంతసేపున్నారు?" అడిగిందామె.

"పని ఉంది..."

"లోపలకు రండి! కూల్‌డ్రింక్ తీసుకుని వెళ్దురుగాని..."

"సారీ! ఇప్పటికే ఆలస్యం అయింది..."

అనేసి వెనక్కు తిరిగి త్వరత్వరగా నడిచాడతను.

జయలక్ష్మికి వళ్ళు మండిపోయింది.

'ఇడియట్' అనుకుంది కసిగా.

* * *

ఆ రోజు అతనితో మాట్లాడిన మాటలు ఉషలో కొత్త ఆశలు కలిగేలా చేసినయ్. అంతకు ముందు అతను ప్రవర్తించిన తీరుకీ, ఆ రోజు ప్రవర్తనకీ చాలా తేడా కనిపించిందామెకి.

అతనిలో మార్పు వచ్చింది.

అయితే ఆ మార్పు ఎందుకొచ్చిందో అర్థం కావడం లేదు. బహుశా తను ఆ ఆఫీస్ నుంచి వెళ్ళిపోవడం వల్లనేమో! మళ్ళీ ఇంక కనబడదన్న ఆలోచన అలా ప్రవర్తించేలా, అలా మాట్లాడేలా చేసిందేమో !

అసలు అతనిని పూర్తిగా మర్చిపోవాలనే తన ఉద్దేశ్యం. అతనిలాంటి స్పందించని మనిషిని ప్రేమించి బాధ పడడం కన్న, స్పందించే రాతిని ప్రేమించడం నయం కదూ !

కానీ ఇప్పుడు మళ్ళీ తన మనసు అతని వేపే మొగ్గుతోంది. అతనిలో మార్పు తను ఆలోచనల్లోనూ మార్పు తీసుకొచ్చింది. ఈ సమయంలో తను చొరవ తీసుకుంటే అతను శాశ్వతంగా తనకు దక్కుతాడేమో !

"ఎలా వుంది వర్క్ !" నవ్వుతూ పలుకరించాడు సుధీర్.

ఉష వెంటనే ఆలోచనల్లో నుంచి బయట పడింది.

"బాగానే ఉందండీ !" చిరునవ్వుతో అందామె.

"రెండు రోజులు అలాగే ఉంటుంది లెండి! తరువాత తెగ బోర్ కొట్టేస్తుంది. బాంక్స్‌లో అన్ని జాబ్స్‌లోకీ— ఇదిగో— ఈ డిస్పాచ్ మాత్రం వరస్ట్ జాబ్ !" అన్నాడతను.

"కానీ ఎవరొకరు చేయాలి కదా —"

"ఆఫ్‌కోర్స్! నిజమే అనుకోండి!— అందుకే కొత్తాళ్ళనే ఇక్కడ పడేస్తుంటారు సాధరణంగా!"

"ఎంతకాలం చేయాలి ఇందులో ?"

"ఇంతకాలం అని రూలేమీ లేదులెండి ! మహా అయితే అయిదారు నెలలు— అంతే ! ఇవాళ్టినుంచీ నేను ఎడ్వాన్సెస్ సెక్షన్‌కి మారుతున్నాను —" అన్నాడతను.

"అయితే మీ కంపెనీ ఉండదన్నమాట ఇక !"

"ఉండకెక్కడికి పోతుందండీ? ఏ సెక్షన్‌లో ఉన్నా అరగంటకోసారి వచ్చి మీకు బోర్‌కొట్టి వెళ్తానూ ?"

ఆమె నవ్వేసింది.

టీ కుర్రాడు వచ్చి నిలబడ్డాడు.

"రెండు 'టీ' ఇవ్వు" ఆర్డర్ చేశాడు సుధీర్.

"రోజూ మీరే 'టీ'కి డబ్బివ్వడం ఏమీ బావుండలేదు. ఇవాళ నేనిస్తాను" అంది ఉష.

"రోజూ అంటారేమిటి ? మీరు చేరి రెండురోజులేగా అయింది ?"

"అవును మరి ఒక్కరోజయినా నన్ను ఇవ్వనీయరేం ?"

"ఇలా చిన్నబిల్లులు నేను ఇచ్చేసి ఒక్కసారి పెద్దబిల్లు మీతో ఇప్పిస్తానులెండి. సరేనా ?" నవ్వుతూ అన్నాడతను.

ఇద్దరూ 'టీ' తాగారు.

"మీరు ఉండడం ఎక్కడ ?" అడిగాడతను.

"విజయ్‌నగర్ కాలనీ దగ్గర."

"అయితే నేననుకున్నది కరక్టే ! నిన్న మిమ్మల్ని బస్‌స్టాప్ దగ్గర చూశాను."

"ఐసీ"

"మా ఇల్లూ విజయ్‌నగర్ కాలనీలోనే లెండి."

ప్యూన్ కొన్ని కాగితాలు తెచ్చి ఆమె ముందుంచాడు.

అవి తీసుకుని పుస్తకంలో సంతకం చేసిందామె.

''మీరు ఏమయినా గేమ్స్ ఆడతారా ?'' అడిగాడతను.

''కాలేజీలో ఉండగా బాడ్మింటన్ ఆడేదానిని'' నవ్వుతూ అందామె.

''కాలేజ్ రిప్రజెంట్ చేశారా ?''

''అవును రెండేళ్ళు. మీరూ హాకీ ఆడతారని రత్నం చెప్పాడు ! నిజమేనా ?'' అడిగిందామె.

''ఆడటమేమిటండీ బాబూ ! అదే ఈ ఉద్యోగం ఇప్పించింది. అది లేకపోతే ఈపాటికి ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజ్ ముందు 'క్యూ'లో ఏనాడో వచ్చిపోయి ఉండేవాడిని.''

''అంటే ఇప్పుడు మన బాంక్ తరపున ఆడుతున్నారా ?''

''అవును... మీకు ఇంట్రెస్ట్ ఉందంటే ఈసారి నేను ఆడే మాచ్‌కి ఇన్‌వైట్ చేస్తాను.''

''ఓకే — తప్పకుండా వస్తాను.''

సుధీర్‌కి ఆనందం కలిగింది.

ఉషను చూసిన మొదటి చూపులోనే గాఢమైన ప్రేమలో పడిపోయాడతను.

అంతవరకూ ఇంకే అమ్మాయి కూడా అతనినలా పిచ్చివాడిని చేయలేదు. ఏ అమ్మాయీ ''ఈమెను వివాహం చేసుకుంటే ఎంత అదృష్టవంతుడినవుతాను'' అనే ఫీలింగ్ కలిగించలేదు.

హాకీ ప్లేయర్‌గా తననెంతోమంది అమ్మాయిలు అభిమానించేవారు. సురేఖ తనను వివాహం చేసుకోమని సిగ్గు విడిచి అడిగేసింది.

కానీ తను ధైర్యం చేయలేదు.

ఉద్యోగం లేకుండా పెళ్ళి చేసుకోవడం తన కిష్టంలేదని చెప్పేశాడు. నిజానికది అసలయిన కారణం కాదు.

ఆ అమ్మాయి తనకు నచ్చలేదు.

ఆ తరువాత సురేఖ మళ్ళీ తనతో మాట్లాడలేదు. తనకు కనిపించనూలేదు.

ఉద్యోగం రాగానే తనకు సంబంధాలు కుప్పలు తిప్పలుగా వచ్చి పడసాగినయ్. తల్లి దండ్రుల పోరు పడలేక కొంతమంది అమ్మాయిలను చూసివచ్చాడు. వాళ్ళల్లో ఎవరూ తనను అంతగా ఆకర్షించలేదు.

ఈ పరిస్థితుల్లో ఉష కనిపించి తనను చిత్తు చేసేసింది.

వివాహమంటూ చేసుకుంటే ఆమెనే చేసుకోవాలనిపించేంతగా తనను ఆకట్టుకుంది.

అందుకే ఆమెకు దగ్గరవాలనీ, ఆమెతో తన మనసు విప్పి చెప్పేంత చనువూ, స్నేహం సంపాదించుకోవాలని ఆత్రుతగా ఉంది.

ఆ అవకాశం ఎంత త్వరగా వస్తుందా అని ఎదురు చూడసాగాడతను.

* * *

'దీపిక' పత్రిక బహుమతులన్నీ మంచి రచనలు రాలేదన్న నెపంతో ఎగ్గొట్టడం రచయిత లందరికీ కోపం కలిగించింది.

చాలామంది ఎడిటర్ని నిందిస్తూ నిరసన తెలియజేశారు.

మరికొంతమంది ఆ పత్రికను దుయ్యబడుతూ పేపర్లో ఒక ప్రకటన ఇచ్చారు. దాంతో ఆ పత్రికకు రచనలు రావడం పూర్తిగా తగ్గిపోయింది.

ఈ పరిస్థితి చిరాకు కలిగించింది రాజయ్యకు.

తను ఇంకో పత్రిక పెట్టాలన్న ఉద్దేశ్యంతో పోగుజేసిన డబ్బు లక్షన్నర దాటింది. ఇప్పుడు దీపిక పత్రికను మూసివేస్తే వచ్చే నష్టం ఏమీ లేదు. దాని న్యూస్ ప్రింట్ బ్లాకులో అమ్ముకొంటూ మరికొంత డబ్బు సంపాదించవచ్చు. హఠాత్తుగా అతనికో ఆలోచన వచ్చింది.

పత్రిక మూసేయడం ఎందుకు? ప్రతినెలా తను ఎలాగోలా ఇరవై పేజీలు ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ తెచ్చుకుంటున్నాడు.

ఆ ఎడ్వర్‌టైజర్స్ కోసం మాత్రం ఓ వంద కాపీలు ప్రింట్ చేస్తూంటే—ఆ ఆదాయం శాశ్వతంగా ఉండిపోతుంది. అటు న్యూస్‌ప్రింటూ బ్లాకులో అమ్ముకోవచ్చు — ఇటు ప్రకటనల డబ్బూ వస్తూంటుంది. ఇక పత్రికలో కథలూ, సీరియల్స్ — జయలక్ష్మి సంపాదిస్తుంది. కొన్ని తను రాస్తుంది. కొన్ని తన ఫ్రెండ్స్‌తో రాయిస్తుంది.

ఎటొచ్చీ ఆ ఆఫీస్, ఆ ఎస్టాబ్లిష్‌మెంట్ వృధా అయిపోతాయ్. కనుక అవికూడా క్లోజ్ చేస్తే ఖర్చుకూడా తప్పిపోతుంది.

ఆ రోజే కృష్ణని పిలిచాడతను.

''రేపట్నుంచీ మన పత్రిక ఆపేస్తున్నామోయ్. కనుక నువ్వు వేరే ఉద్యోగం చూచుకో! ఇదిగో—ఇంతవరకూ నీకు రావాల్సిన జీతం...'' అంటూ డబ్బు లెక్కబెట్టి అతని చేతికిచ్చేశాడు.

కృష్ణకు మతి పోయినట్లయింది.

ఇంత హఠాత్తుగా మళ్ళీ ఉద్యోగం ఎక్కడ దొరుకుతుంది తనకి ?

''పోనీ మీ ప్రెస్‌లో ఏదయినా వర్క్ ఉంటుందాండీ ?''

''అక్కడ ఇప్పటికే ఓవర్ స్టాఫ్ అయిపోయారయ్యా ! కుదరదు ...''

కృష్ణ ఆ గదిలోనుంచి బయటికొచ్చి చాలాసేపు తన సీట్లో ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

మళ్ళీ సమస్య మొదలయిపోయింది.

ఇప్పుడేమిటి చెయ్యడం ?

మళ్ళీ ప్రసాద్ దగ్గరకెళ్ళి సహాయం అడగడం తప్ప మరో మార్గం కనిపించలేదతనికి.

సాయంత్రం ఆఫీసయాక ప్రసాద్ ఇంటికి బయల్దేరాడతను.

బయట వరండాలో కూర్చుని ఏదో పత్రిక చదువుకుంటున్నదల్లా అతనిని చూసి లోపలకు పరుగెత్తింది మంజు.

''ప్రసాద్ ఉన్నాడాండీ ?'' బయటే నిలబడి అడిగాడతను.

''లేరు ! ఊరెళ్ళారు !''

''ఎప్పుడొస్తాడు ?''

''ఎల్లుండి !''

''వచ్చాక అర్జంటుగా మా ఇంటికి రమ్మని చెప్పండి ...''

''సరే ...''

అక్కడి నుంచి ఇంటికి చేరుకున్నాడతను.

ఆ రాత్రంతా మళ్ళీ నిద్ర పట్టలేదు.

తెల్లవార్లూ ఆలోచనలే !

''మనశ్శాంతి ఆత్మీయుల దగ్గర లభిస్తుందిగానీ, ఒంటరితనంలో దొరకదు కృష్ణగారూ..'' ఉష చెప్పిన మాటలు ఛటుక్కున గుర్తుకొచ్చాయతనికి. ఆమె మాటల్లో నిజముందా ?

ఆమె సాన్నిధ్యంలో తను నిజంగా మనశ్శాంతిని పొందగలడా ? ఆమె నీడలో సావిత్రిని పూర్తిగా మర్చిపోగలడా ? ఆమెను కౌగలించుకుని సావిత్రిని గుర్తుకు తెచ్చుకోకుండా ఉండగలడా ? ఆమెనువివాహం చేసుకుని సావిత్రికి తను చేసిన అన్యాయం తల్చుకోకుండా ఉండడం ఎలా సాధ్యమవుతుంది ? తన వైవాహిక జీవితం అనుక్షణం చిత్రవధ అయిపోదూ ?



ఏమో ! ఇదంతా కేవలం తన పిరికితనమే నేమో ! కేవలం తన మానసిక పరిస్థితేనేమో !

ఉష చెప్పినట్లు తనకు ప్రశాంతత కేవలం ఉష సాన్నిధ్యంలోనే లభిస్తుందేమో !

ఆమెను వివాహం చేసుకోవడమే తననీ దుస్థితినుంచి రక్షిస్తుందేమో !

ఎటూ తోచడంలేదతనికి.

తనకు ఉష కావాలి. తను ఉషను ప్రేమిస్తున్నాడు. ఆమె లభిస్తే తన జీవితం లోని ఒడిదుడుకులన్నీ తొలగిపోతాయని ఆశపడు తున్నాడు.

కానీ భయం ! తీరా ఆమెను చేసుకున్నాక అటు సావిత్రినీ మర్చిపోలేక ఇటు ఆమెనూ సుఖ పెట్టలేక మరింత నరకంగా మారుతుందేమో జీవితం ?

అలా జరగడానికి అవకాశం ఉందా !

ఏమో తనకు తెలీదు. ఆ ఆలోచనే భయం కలిగిస్తోంది.

తెల్లారిపోయి చాలాసేపయినా అలాగే పడుకుని ఉండిపోయాడతను.

తను ఏ ఒంటరితనం నుంచయితే పారిపోవా లనుకున్నాడో, అదే ఎదురయింది ఇప్పుడు మళ్ళీ !

తన పరిస్థితి విచిత్రంగా ఉంది.

ఒంటరిగానూ ఉండలేడు. అందరిలా వివాహం చేసుకుని జీవితం గడపడానికీ ధైర్యం చాలటంలేదు.

## జీవితం—సెంటిమెంట్

సావిత్రి గొంతు హఠాత్తుగా వినిపించి నట్లయింది. "నన్ను నిజంగా పెళ్ళిచేసు కుంటారా ?"

రుక్మిణి నవ్వుతోంది.

"మవ్వూ అతనిలాంటి రాక్షసుడివేనా అన్నయ్యా ?"

ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడతను.

గుండెలు వేగంగా కొట్టుకోసాగినయ్.

ఊహూ ! తనొక్కక్షణం కూడా ఒంటరిగా గడపలేడు. లేచి బట్టలు మార్చుకుని రోడ్డు మీద కొచ్చాడతను.

హోటల్‌లో నుంచి గట్టిగా హిందీ సినిమా పాటలు వినబడుతున్నాయ్.

చాలా కోలాహలంగా ఉంది హోటలంతా.

అదే ఆ కోలాహలమే కావాలి తనకు. జనంలో కలిసిపోవాలి. మనసుకి ఆలోచించే వ్యవధి ఇవ్వకూడదు.

హోటల్లోకి నడిచి కాఫీ ఫలహారం తీసుకున్నాడు.

టేబుల్ మీద ఎదురుగ్గా ఉన్న వ్యక్తి తన భార్య తననెలా హింసిస్తోందీ చెప్తున్నాడు.

కాఫీ తాగి రోడ్డుమీద కొచ్చాడతను.

ఎటువెళ్లాలో తెలీదు. ఎక్కడికెళ్లాలో తెలీటంలేదు.

రోడ్డువెంబడే నడవసాగాడు.

ఎక్కడెక్కడో ఏవేవోరోడ్లు తిరుగుతూనే ఉన్నాడు. తనెక్కడున్నాడో కూడా తెలీటంలేదు.

ఇరుకుసందులు, మళ్లీవిశాలమైన వీధులు, మళ్లీ ఇరుకుసందులు — హఠాత్తుగా ఆకలి విజృంభించింది.

టైము చూసుకున్నాడు. నాలుగయింది.

ఎదురుగ్గా కనిపించిన ఇరానీ హోటల్లో కెళ్లి సమోసాలు తిని టీ తాగాడు.

బయటికొచ్చి మళ్లీ నడక ప్రారంభించాడు.

ఉష దగ్గరకెళ్తే ఎలావుంటుంది ? ఆమెతో మాట్లాడుతుంటే ఎంతో ఆనందంగా ఉంటుంది తనకు.

ఆమె తనను చూసి ఏమీ అనుకోదు కదా !

ఎందుకనుకుంటుంది ! తనంటే ఆమెకు ప్రేమ ఉంది. తనకు తెలుసా విషయం ! కానీ తన ప్రవర్తన ఆమె మనసుని మార్చకుండా ఉంటుందా ? ఇలాంటి 'ఇడియట్‌ని ప్రేమిస్తే సుఖపడను' అనుకోకుండా ఉంటుందా ? ఏమో ! ఏమయినా అనుకోనీ, కానీ తనకామె కావాలి. ఇప్పుడేకావాలి. ఇప్పుడే ఉష దగ్గరకెళ్లాలి.

ఎదురుగ్గా వస్తోన్న వ్యక్తిని ఆపి ఉష పనిచేస్తోన్న బాంక్ గురించి వాకబ్ చేశాడతను.

"ఎదురుగ్గా ఉంచుకుని అడుగుతా వేమిటయ్యా?" నవ్వుతూ అన్నాడతను.

కృష్ణ ఉలిక్కిపడ్డాడు.

---

## ఆక్రందనం

పదవుల వేటలో
పరువు గిరువు అన్నీ తాకట్టు పెట్టే
రాచకీయ మహా మహుల
పరుగు పందెంలో,
ఆటల పోటీల్లో పాటించే
కనీస నియమాలైనా ఇప్పుడు
అరణ్య న్యాయానికే ఆహారం
ప్రజాస్వామ్యపు అడవిలో ఆక్రందనం!

–నిఖిల్

ఎదురుగ్గా అక్షరాలు కనిపిస్తూనే ఉన్నాయతనికి.

అవును! తనెలా వచ్చాడక్కడికి ?

తనకు తెలీకుండానే తన మనసు తనను ఆబిడ్స్‌కి నడిపించేసింది. అందుకే ఎక్కడెక్కడో తిరిగి ఇక్కడకు చేరుకున్నాడు.

బాంక్‌లోకి నడిచాడతను.

గేటు దగ్గర సెక్యూరిటీ గార్డ్ ఆపాడు.

''ఏం కావాలి?''

''మా ఫ్రెండ్‌ని కలుసుకోవాలి. ఆమె ఇందులో వర్క్ చేస్తోంది.''

''సోమవారం రండి! ఇవాళ హాఫ్‌డే! బాంక్ రెండున్నరకే క్లోజయి పోయింది.''

కృష్ణ వెనక్కు తిరిగాడు.

'ఆమె ఇంటికి వెళ్తే'? ఆలోచన వచ్చిందతనికి.

''ఏమో ! ఆమె తల్లిదండ్రులేమనుకుంటారో! ఆమెను ఇబ్బంది పెట్టినవాడవుతాడేమో...''

ఇంక నడిచే ఓపిక లేకపోయిందతనికి·

బస్‌లో మళ్ళీ ఇంటికి చేరుకున్నాడు.

ఇంటి బయటే నిలబడి కనిపించారు ఉషా, హబీబ్.

ఆనందం, ఆశ్చర్యం ఒక్కుమ్మడిగా అతనిని కదిలించివేసినయ్.

''మీరిక్కడి కొచ్చారా?'' అన్నాడు నమ్మలేనట్లు.

''ఏం చేయను? ఆఫీస్‌కెళ్ళాను. హబీబ్ ఒక్కడే ఉన్నాడక్కడ. పత్రిక మూసేశారని చెప్పాడు. అయితే ఇంటి దగ్గర ఉంటారేమో చూద్దామని వచ్చాను...''

గది తాళంతీసి లోపలకు నడిచాడతను ''రండి! కూర్చోండి!'' అన్నాడు ఆమెనుద్దేశించి.

ఉష లోపలికొచ్చి కూర్చుంది చాప మీద.

''రా హబీబ్ ! కూర్చో.''

''నేను వెళ్ళాలన్సర్ ! ఇప్పటికే ఎక్కడకు పోయానా అని రాజయ్యగారు గాలిస్తుంటారు నాకోసం. మరోసారి వస్తాను లెండి ...'' అనేసి వెళ్ళిపోయాడతను.

''నాకింకా నమ్మబుద్ధి కావడం లేదు మీరు మా ఇంటి కొచ్చారంటే ...'' గడప మీద కూర్చుంటూ అన్నాడతను.

''ఎందుకని ?'' అతను దానికి సమాధానం చెప్పలేదు.

''తమాషా చూశారా! నేనూ ఇంతకుముందే మీ బాంక్ కెళ్ళాను మీకోసం !''

ఆమె నమ్మలేనట్లు చూసిందతనివేపు.

''నిజంగానా ?''

''భలేవారే! అబద్ధం చెప్పాల్సినంత అవసరం ఏముందందులో! తీరా వెళ్తే హాఫ్‌డే అని చెప్పారు. ఉసూరుమంటూ తిరిగి వచ్చాను.''

కొద్దిక్షణాలు ఆమె మొఖంలో ఆనందం నాట్యం చేసింది.

తనూహించింది నిజమే ! అతనికీ తనంటే ఆసక్తి కలిగింది. అతని హృదయంలోనూ తన మీద ప్రేమ అంకురించింది. అందుకే అతనిలో ఈ మార్పు.

అయితే తన కోరిక తీరుతుందా ? అతను శాశ్వతంగా తనవాడవుతాడా ? ఇద్దరూ ఒకటయేందుకు ఇంక అడ్డేముంది ?

కృష్ణ మనసులో ఆలోచనలు ఉవ్వెత్తున ఎగసి పడుతున్నాయ్.

తన మనసులోని విషయం ఆమెకెలా తెలియజేయడం ? ఆమె మనసునెలా తెలుసుకోవడం ?

తనింక ఈ జీవితానికి ఫుల్‌స్టాప్ పెట్టదల్చుకున్నాననీ, ఆమెను తన దానిని చేసుకుని గతాన్ని ఆమె సాన్నిధ్యంలో మర్చిపోయి, కొత్త జీవితం ప్రారంభించదల్చుకున్నాననీ ఎలా చెప్పడం?

''మీరు నాకోసం బాంక్ కొచ్చారంటే ఆశ్చర్యంగా ఉంది ...''

''ఉషాదేవీ! దయచేసి అలా మాట్లాడకండి! నేను మారిపోయాను. ఆ రోజు మీరు చెప్పారు గుర్తుందా ? ప్రశాంతత అనేది ఆత్మీయుల దగ్గరే లభిస్తుందని ! అందుకే మీకోసం వచ్చాను...'' ఉద్వేగంతో మాట్లాడాడతను.

ఉష మౌనంగా ఉండిపోయింది.

ఏం మాట్లాడాలో తెలీటంలేదామెకి.

''మీరు ఇంకో ఉద్యోగమేదయినా చేస్తున్నారా ?'' అడిగిందామె కొద్ది క్షణాలాగి.

''ఊహు ! మా ఫ్రెండ్స్‌కి చెప్పాను – ఎక్కడయినా ప్రయత్నించమని..''

''మీరు ఎమ్.ఏ. కదా ! కావాలనుకుంటే ఏదొక ట్యుటోరియల్ కాలేజిలో కళ్ళకద్దుకుని ట్యూటర్‌గా తీసుకుంటారు...''

అతను నవ్వాడు.

''నాకు ఇష్టంలేదది. టీచింగ్ చేసే కెపాసిటీ నాకు లేదు.''

''ఇంటర్‌కీ, మెట్రిక్‌కీ టీచ్ చెయ్యడం అంత కష్టమేమీకాదు. మీకు తెలుసో తెలీదో నేను ఇంటర్ అమ్మాయిలకు ట్యూషన్ చెప్పాను కొన్నాళ్ళు.''

''సరే ! చూద్దాం ! ఇంకే ఉద్యోగమూ దొరక్కపోతే మీరు చెప్పినట్లే చేయాల్సి వస్తుందేమో !''

కొద్దిసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు.

''మీరు శ్రమ తీసుకుని ఇంతదూరం ఎందుకు వచ్చారు ? హబీబ్‌తో కబురుచేస్తే నేనే బాంక్‌కొచ్చేవాడిని.''

''అత్యవసరంగా మీతో మాట్లాడాలనిపించింది. అందుకని వచ్చాను.''

అతను ఆమె కళ్ళల్లోకి విస్మయంతో చూశాడు.

''ఏమిటా విషయం ?''

ఆమె ఓ క్షణం తటపటాయించింది.

(ఇంకా ఉంది)



# పాపం.....సైన్సు మాష్టారు!

ఆర్. బి. యస్. ప్రసాద్
&
ముళ్ళపూడి
శేషకుమార్.



ఆరున్నొక్క శృతిలో... ఆ శృతికి తగ్గ లయలో గురకపెడుతూ, గాఢనిద్రలో మునిగి ఉన్న విశ్వపతిరావుకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. అలారం మోగలేదు! పాలవాడు అరవలేదు! అయినా విశ్వపతిరావు ఉన్నఫళంగా లేచి కూర్చున్నాడూ ... అంటే ఏదో ప్రత్యేకమైన కారణం ఉండే ఉండాలి. అసలు విశ్వపతిరావు మామూలుగా నిద్రలేచే సమయం ఉదయం ఎనిమిది గంటలు! తనది "అర్చన" టైమనీ... వివిధ భారతిలో ఎనౌన్సర్ "అర్చన" అనగానే తాను మంచంమీద లేచి కూర్చుంటాననీ ... అతడు అందరితో అంటూ ఉంటాడు. అటువంటి విశ్వపతిరావు అర్చన టైం కాకుండా ... కనీసం "ఝరోకా" కూడా మొదలవ్వకుండానే, "వార్తలు చదువుతున్నది ... " అని రేడియో అంటున్న సమయంలోనే లేచి కూర్చున్నాడు. విశ్వపతిరావు ఓ సైన్సు మాష్టారు. సైన్సు అంటే ఆయనకు ఎంత మక్కువంటే...సైన్సు గాలి తగిలినా, సైన్సు వాసనవేసినా, చివరకు "సైన్సు" అనే పదం విన్పించినా ... ఒక్క క్షణం కూడా నిద్రపోలేడు. ఇప్పుడూ అదే జరిగింది. ఇంటినిండా మబ్బుల్లా కమ్ముకున్న పొగ విశ్వపతిరావుని నిద్రలేపేసింది.

"ఏమోయ్ ... భార్యామణీ! ఎక్కడో "కర్బనం" తగలబడుతున్నట్లున్నది! కాస్త నీ "రెటీనా"తో గమనించి, నా గదిలోకి వచ్చే పొగకు కారణం బెయ్యదో... వివరించగూడదూ? గట్టిగా కేకవేస్తూ, ఇంకాస్త గట్టిగా కళ్ళు నలుపుకొంటూ లేచి కూర్చున్నాడు విశ్వపతిరావు.

"మహానుభావా! మీరు సైన్స్ మాష్టరవ్వడం నిజంగా నా తలరాత! దానికితోడు యమ్. ఎ. తెలుగును వెలగబెడ్తూ ఆ పక్కనుండి సైన్స్‌కూ... ఈ పక్కనుండి తెలుగుభాషకూ... తీరని ద్రోహం చేస్తున్నారు!" అంటూ వంటింట్లోంచి విశ్వపతిరావు దగ్గరకు వస్తూ అంది... అతడి అర్ధాంగి విశాల!

"నేనడిగింది 'కర్బనం' గురించి కానీ... నా విద్యార్హతల గురించి కాదు! ఇంకాసేపు పాకశాలలోని ఫర్నేస్..."

"అబ్బబ్బ ఫర్నేస్ ఏమిటండీ... బాబూ!"

"అదేనోయ్! కుంపటి! ఆ ఫర్నేస్ అనబడే కుంపటిలోని కర్బనపు ముక్కలమీద కొద్దిగా జల అణువులు పడినట్లు నా అనుమానం! అందువల్లే ఆ పొగ ఇలా పడగ్గదిలోకి కూడా దూసుకువచ్చి, నా "పారడాక్సికల్" నిద్రను చెడగొట్టింది."

"మళ్ళీ పారడాక్సికల్ నిద్ర అంటారేమిటండీ! ఇవాళ రోజూ ఉపయోగించని కొత్త పదాలేవో చాలా... చాలా ఉపయోగిస్తున్నారు."

"బాగా కనిపెట్టావోయ్! నిన్ననే కలలమీద ఓ వ్యాసం చదవడం తటస్థించింది. ఎలాగో

అడిగావ్ కదా ! కలల గురించి చెప్తాను విను !'' అంటూ విశాలను రెండు చేతుల్తోనూ పట్టుకొని మంచంమీద కూర్చోపెట్టి, ఆమె కురుల్ని సవరిస్తూ చెప్పడం మొదలుపెట్టాడు. భర్త ఉదయాన్నే అంత తీరిగ్గా దగ్గరకు తీసికోవడంతో... విశాలకు ఎంతగానో ఆనందం వేసేసి, వంటింటి సంగతి ఎంచక్కా మర్చిపోయింది.

''నిద్ర రెండు రకాలుగా ఉంటుందట ! మొదటిది గాఢనిద్ర ! రెండోది పారడాక్సికల్ నిద్ర. మన నిద్ర పారడాక్సికల్ దశలో ఉన్నప్పుడే మనకు కలలు వస్తాయట !''

విశ్వపతిరావు ప్రసంగానికి స్పీడ్‌బ్రేకర్‌లాగా.. ఎవరో తలుపును దబ...దబ బాదసాగారు.

విశ్వపతిరావు ఒక్క ఉదుటన లేచి, విశాలతో ''నువ్వు లోపలికిపో ... ఆ ఫర్నేస్ సంగతి చూడు! నేను మన తలుపులోని 'సెల్యులోజ్'ను కష్టపెట్టేవాడి సంగతి చూస్తాను!'' అంటూ తలుపు తియ్యడానికి పరుగు బెట్టపోయాడు.

''తలుపులోని 'సెల్యులోజ్' ఏమిటండి?'' పరుగెత్తుతున్న భర్త చొక్కా పట్టుకొని ఆపింది విశాల.

''అదా ! చెక్కలన్నీ సెల్యులోజ్ అనే పిండి పదార్థంతో నిండి ఉంటాయిలే ! అదంతా కర్బన రసాయనశాస్త్రం ! తర్వాత వివరంగా చెబ్తాను కానీ ! ముందు మన తలుపుని రక్షించనియ్యవోయ్ !'' అంటూ జారిపోతున్న లుంగీని బిగించుకొంటూ తలుపుతీయడానికి పరుగెత్తాడు.

విశ్వపతిరావు తలుపు తెరవగానే ప్రైవేటు పిల్లలు సురేష్, రమేష్‌లు కనపడ్డారు.

''ఓర్నీ ..మీరా! అప్పుడే వచ్చేశారేమిట్రా? కనీసం నా దంత ధావనం అన్నా కాలేదు !'' కంగారుగా అన్నాడు విశ్వపతిరావు.

''అదేమిటి మాష్టారూ ! నిన్న మీకు చెప్పాం కదా ! మాకు ఎనిమిదిన్నరకు లెక్కల ప్రైవేటు ఉందనీ .. అందుకని ఏడింటికే మీ దగ్గరకు వస్తామనీ ...'' నసుగుతూ అన్నారు సురేష్, రమేష్‌లు.

''నిజంగా చెప్పారా ? అంటే నా జ్ఞాపకశక్తి, కాస్త, కాస్త బీటలువారుతోందన్నమాట ! అసలు మతిమరుపు పెరగడానికి కారణం ఏమిటో తెలుసా ? మన మెదడులో ఉండే ఒక హార్మోన్ నాశనం అవడమే !''

''మాస్టారూ... మీరు మొఖం కడుక్కోవాలన్నారు...'' విశ్వపతిరావు మాటల్ని మధ్యలోనే ఆపేశారా గడుగ్గాయిలు.

''అవును కదూ ! నేనుదయం దంతధావనం చేసికోనిచో, నా పళ్ల మీద ఉన్న ఎనామిల్ పై ఉన్న పాచి అంతా... నన్నూ మిమ్మల్నీ ఇబ్బంది పెట్టేస్తుంది ! బలేగా గుర్తు చేశారోయ్ !'' అంటూ వాళ్లిద్దర్నీ కూర్చోమని లోపలకువెళ్లి, ''ఏమోయ్ మొఖం కడుక్కోవాలి ... నేను నిన్న స్వయంగా తయారుచేసికొన్న ఆయింట్‌మెంటూ, బ్రష్ ఇవ్వవోయ్ !'' అన్నాడు.

బ్రష్, పేస్టూ భర్తకు ఇస్తూ, ''త్వరగా తెమలండి ! కాఫీ కలుపుతున్నాను !'' అంది విశాల.

''అన్నట్టు చెప్పడం మరిచానోయ్ ! నిన్ననే ఏదో సైన్సు పత్రికలో చదివాను .. కాఫీలో కెఫీన్ అనే పదార్థం ఉంటుందట ! దానివల్ల కేన్సర్ కూడా రావచ్చునట !''

''అయితే ఏమంటారు ? కాఫీ మానేస్తారా! మానేయండి! ఆరోగ్యం కూడా బాగుపడ్తుంది !''

''మరీ మానెయ్యటం ఎందుకు కానీ ... కాఫీపొడి కాస్త తక్కువవెయ్ ! ఆ వచ్చే కేన్సర్ ఏదో కాస్త ఆలస్యంగా చచ్చేముందు వస్తుంది'' అంటూ దొడ్లోకి వెళ్లాడు విశ్వపతిరావు.

ఎలాగైతేనేం కాఫీ త్రాగి, ప్రైవేటు పిల్లల దగ్గరకు చేరాడు.

విశాల వంట ప్రయత్నంలో పడిందన్నమాటే గానీ ఆమె ఆలోచనలన్నీ భర్త గురించే! కన్పించిన ప్రతి సైన్స్ పుస్తకం చదవడం, ఎక్కడ ఎటువంటి సైన్స్ ప్రసంగాలు జరిగినా ఖచ్చితంగా హాజరవ్వడం విశ్వపతిరావుకు అలవాటు! అంతవరకే అయితే ఫర్వాలేదు ! ఆ తర్వాత తాను చదివినవీ... విన్నవీ ఎప్పుడూ... అందరికీ చెప్పే వ్యసనంకూడా విశ్వపతిరావుకు పట్టుకొంది. విశ్వపతిరావుకు ధాదస్తపు ప్రసంగాల అలవాటుందని విశాలకు పెళ్ళిచూపుల్లోనే తెలిసింది.

పెళ్ళిచూపుల్లో విశ్వపతిరావుకూ, అతడి తల్లిదండ్రులకీ... విశాలా వాళ్ళింట్లో జాంగ్రీలు, బూందీ పెట్టారు. ఫలహారాలు వాళ్ళ చేతుల్లోకి రాంగానే... విశాలకూడా వారిముందు వచ్చి కూర్చుంది.

''అమ్మాయిని ఏమన్నా అడిగితే... అడుగు బాబూ!'' అన్నాడు విశాల తండ్రి విశ్వపతిరావుతో.

చేతిలో ప్లేటు వంక చూస్తూ ఏదో ఆలోచిస్తున్న విశ్వపతిరావు, ''ఈ జాంగ్రీలు, బూందీ మీరు బజార్లో కొన్నారా అండీ !'' అంటూ తన పెళ్ళి చూపుల ఇంటర్వ్యూను మొదలుపెట్టాడు.

ఆ ప్రశ్న అడిగింది తననా.. అమ్మాయినా.. అని కంగారుపడిపోయాడు విశాల తండ్రి.

విశాల మాత్రం ఆ ప్రశ్న తనకే అనుకొని జవాబు చెప్పడానికి ఓ క్షణం సిగ్గుపడింది. బజారునుండి తీసికొచ్చాం అంటే... ఏమన్నా అనుకొంటాడేమోనని, ''ఇంట్లోనే చేశానండీ!'' అనేసింది.

''మీరు చేశారా? ఈ జాంగ్రీలు.. బూందీ నిజంగా ఎంత అపాయకరమైనవో... మీకు తెలుసా ?'' ఆందోళనగా అన్నాడు విశ్వపతిరావు.

విశాల ఇంటిల్లపాదీ అదిరిపోయారు. విశ్వపతిరావు అలా ఎందుకు మాట్లాడుతున్నాడో.. వారికి అర్థంకాలేదు.

''అంటే... అంటే...మీరంటున్నది ఏమిటి బాబూ !'' వణుకుతున్న స్వరంతో అన్నాడు విశాల, తండ్రి.

''చూడటానికి బాగుంటాయని మీరు జాంగ్రీల్లోనూ, బూందిలోనూ రంగులు వేశారు ! ఈ రంగులవల్ల... మనకు కాన్సర్ వస్తుందండీ !'' కాస్త గట్టిగానే అన్నాడు విశ్వపతిరావు.

విశ్వపతిరావు మాటలువిన్న విశాల తండ్రి తేలిగ్గా ఊపిరి పీల్చుకొని, నెమ్మదిగా అతడికి సర్దిచెప్పాడు.

అలా పెళ్ళి చూపులమాట మర్చిపోయి, సైన్స్ పాఠాలు చెప్పిన విశ్వపతిరావుకు విశాల అర్థాంగి అయిపోయి అప్పుడే ఏడాదిన్నర దాటిపోయింది.



# ధర్మపథం

—బులుసు వేంకటరమణయ్య



## సమయంలో ప్రతిక్రియ

భగవంతుడు విగ్రహ రూపంలో మౌన ముద్రతోనే ఉంటాడు. భక్తులు చేసే పూజా పురస్కారాలను గమనిస్తూనే ఉంటాడు. కాని, ఉలకడు, పలకడు. తన్ను పెక్కు విధాల స్తుతిస్తే ఆనందంతో పొంగిపోడు. ఒకవేళ తన్ను తిట్టినా పట్టించుకోడు. అవసరం వచ్చినప్పుడు, తాను మౌనంగానే ఉంటూనే, కలగబోయే ఉపద్రవానికి తగిన ప్రతిక్రియ చేసి-తీరుతాడు. ఆప్తులకు అభయమిచ్చి రక్షిస్తాడు.

రెండు శతాబ్దాల క్రిందట దేశ పరిస్థితి చాలా అల్లకల్లోలంగా ఉండినది. ప్రజలంతా భయాందోళనలతో పిడికిళ్లలో ప్రాణాలు పెట్టుకొని రోజులు గడిపేవారు. ఆ రోజుల్లో మరాటీదండు, తురకలదండు మున్నగు బందిపోటు దొంగల ముఠాలు పట్ట పగలే ఊళ్ల మీదపడి, ప్రజలను దోచుకుని, వారిని నానా హింసలూ పెట్టేవారు. ఆ ముఠా వస్తున్నదనే ఆచూకీ తెలిసి, మూటా, ముల్లే కట్టుకుని ఊరు విడిచి ప్రజలు రహస్య ప్రదేశాలలో దాగుకోవడం కూడా జరుగుతూ ఉండేది. ఆ ముఠాల వాళ్లు కూడా కొంతవరకూ ఆలోచించి, ఎక్కడ తమకు ఎక్కువ లాభం ఉంటుందో తెలుసుకునే దాడికి బయలుదేరేవారు.

విశాఖపట్నానికి దగ్గరగా ఉన్న సింహాచలం దేవస్థానం చాలా ప్రసిద్ధ మయింది. సింహగిరి నరసింహ-స్వామికి ఎంతో విలువైన జవాహరీ ఉన్నదని వాళ్లు గ్రహించారు. ఆ స్వామిని దోచుకోవాలనే దురుద్దేశం వాళ్లకు కలిగింది. ఆ దండు విశాఖ-పట్నం చేరుకున్న సంగతి సింహాచల ప్రజలకు తెలిసి, వాళ్లు, తమ్ము రక్షించి, క్షేత్ర ప్రతిష్ఠ నిలుపుకోవాలని దేవుని ప్రార్థిస్తూ, ఆయన సన్ని-ధానంలో ప్రార్థనలు ప్రారంభించారు. కూర్మనాథకవి ఆశువుగా సింహాద్రి నార-సింహశతకం చెప్పసాగాడు.దండు, ఆ దగ్గరనున్న మెట్టను చేరుకున్నట్లు కొండ మీద నుంచి చూచినవారు చెప్పారు. స్వామికి ఉద్రేకం కలిగేటట్లు శతక పద్యాలు సాగాయి. బందిపోటులు ఆ మెట్టను చేరేసరికి ఎక్కడి నుంచో వేలకొలది తుమ్మెదలు వచ్చి, వాళ్లను వెంటదరిమాయి. వాటి ధాటికి తాళలేక ఆ దొంగలు చెట్టొక పిట్టగా పారిపోయారు. వాళ్లు చాలా మైళ్లు వెళ్లే వరకూ తుమ్మెదలు వారిని విడవలేదు. అప్పటి నుంచీ ఆ మెట్టకు తుమ్మెదల మెట్ట అనే పేరు వచ్చింది. సింహాచల క్షేత్రానికి ప్రమాదం తప్పిపోయింది.ఆ తర్వాత ఆ ప్రాంతానికి దండు బెడద తప్పిపోయింది.

భగవంతుడు తగిన సమయంలో దొంగలకు తగిన శాస్తి చేశాడు. □

విశ్వపతిరావు మనసు నవనీతం ! కాస్త ఎక్కువగా మాట్లాడినా... విశాలని అతడెంతో ప్రేమగా చూసుకొంటాడు.

పిల్లలకు మామూలు పాఠం... దానికి బోనస్‌గా సైన్స్ కబుర్లు కలిపి చెప్పి, ప్రైవేటు ఆ రోజుకి అయిందనిపించి, విశాల ఏం చెస్తోందో చూద్దామని వంటింట్లోకి వెళ్ళిన విశ్వపతిరావు అదిరిపోయాడు.

విశాల పీటమీద కూర్చుని ఏదో ఆలోచిస్తోంది! కుంపటిమీద ఉడుకుతున్న పప్పపొంగి.. రణరంగంలో చనిపోయిన సైనికుల్లా... పప్పు బద్దలు, కుంపటిమీదపడి మాడిపోతున్నాయి.

''ఏమయింది విశాలా...'' అంటూ ఆమెను గట్టిగా కుదిపాడు.

ఫ్లాష్‌బాక్‌లోకి వెళ్ళిన విశాల ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది.

''ఏమిటి విశాలా... అలా వున్నావ్ ?''

''అబ్బే .. ఏం లేదండీ ! పారడైజ్ నిద్రలోకి వెళ్ళాను !'' నవ్వుతూ అంది.

''అయ్యబాబోయ్ ! సైన్స్‌ను ఖూనీ

## పాపం సైన్స్ మాస్టారు!

చెయ్యొద్దు ! అది పారడైజ్ నిద్ర కాదు ! పారడాక్సికల్ నిద్ర !''

''ఏదైనా ఒకటే నా ప్రాణానికి ! అవును గానీ... మీరు ఈ సైన్స్ కబుర్లు చెప్పడం మానరా ?'' విసుగ్గా అంది విశాల.

''అబ్బే! అదెట్లా కుదుర్తుందీ నా శరీరం లోని అణువణువూ సైన్స్‌తో నిండిపోయి ఉంది !''

''మిమ్మల్ని చూసి మీరే మురిసిపోవాలి గానీ... ఇక స్నానం చెయ్యండి ! నీళ్ళు చల్లారి పోతున్నాయి !'' అంటూ అతడ్ని బలవంతంగా బాత్రూంలోకి తోసింది విశాల.

విశ్వపతిరావు బాత్రూంలోకి వెళ్ళిన రెండు నిముషాలకు మళ్ళీ ఎవరో వాకిలి తలుపు కొట్టారు.

''ఓయ్ విశాలీ ... మళ్ళీ తలుపుల్లోని సెల్యులోజ్ ...'' అంటూ బాత్రూం లోంచి అరుస్తున్న భర్తను— ''సెల్యులోజ్ లేదూ ... క్యాబేజీ లేదు కానీ మీరు స్నానం కానీయండి ! తలుపు సంగతి నేను చూస్తా !'' అంటూ గదమాయించి, ముందు గదిలోకి వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా స్కూలు జవాను రాములు ! హెడ్‌మష్టరు ఏదో చీటీ ఇచ్చి రమ్మన్నారంటూ వచ్చాడు. ''మీ మాష్టరు స్నానం చేస్తున్నారు కూర్చో...'' అని చెప్పి లోపలికి వెళ్ళింది విశాల.

బాత్రూం నుండి భర్త బయటకు రాగానే, రాములు వచ్చినట్లు చెప్పింది.

''ఇంత పొద్దున్నే హెడ్మాష్టరికి నాతో ఏం పని ఉంటుందబ్బా!'' లుంగీ కట్టుకొంటూ, తనలో తానే అనుకోబోయి కొద్దిగా పైకి అనేశాడు.

''ఆఁ... వాళ్ళింట్లో మజ్జిగలోనో ... సాంబార్లోనో ఏదో పురుగుపడి ఉంటుంది! దాన్ని మీకు చూపించి, అది పోసుకు తింటే ఏమయినా నష్టమా? నష్టమైతే ఎలాటి నష్టం? నష్టం లేకుండా ఉండాలంటే ఏంచేయాలీ...వగైరా... వగైరాలు ... అడగడానికి పిల్చి ఉంటారు !'' నవ్వుతూ అంది విశాల.

''నవ్వవోయ్ ! నవ్వు ! అలాగే నవ్వు ! ఇప్పుడు నీకు నవ్వులాటగానే ఉంటుంది. ఎప్పటి

కయినా ఈ విశ్వపతిరావు "పాపులర్ సైన్స్ ప్రసంగాలు" ఇవ్వడంలో ప్రపంచ ప్రఖ్యాతి తెచ్చుకొని తీరకపోడు. ఆ రోజున ... నువ్వు, నేనే ఆ విశ్వపతిరావు భార్యనండీ అంటూ గర్వంగా ఇరుగు పొరుగు అమ్మలక్కలో ... చెప్పుకపోవు !" రొమ్ము విరిచి అన్నాడు విశ్వపతిరావు.

"అయ్యా ! ప్రపంచ ప్రఖ్యాత సైన్స్ మాష్టారూ ! మీ కోసం బయట జవాను వేచి ఉన్నాడు ! త్వరగా కదలండి !"

"నిజమే గదూ !" అంటూ ముందు గదిలోకి వెళ్ళి "ఏమిట్రా కథ రాములూ ?" అని జవానుని అడిగాడు.

"ఈ చిట్టీ ... మీకు ఇచ్చేసి, మిమ్మల్ని ఉన్నఫళంగా ఎంటేసుకు రమ్మన్నారండీ హెడ్మాష్టారు !"

"ఎంటేసుకు రమ్మన్నాడా ? మీదేసుకు రమ్మన్నాడా ? వెధవ భాష ... మీరూను ! అయినా ఇప్పుడు రానటం ఎలా కుదురుతుందిరా? ఇంకా ఉదరపూజ కానిదే ! భోజన ప్రక్రియ జరక్కపోతే ... నా శరీరంలోని జీవప్రక్రియలు జరగడం ఆగిపోయి ... అసలుకే ముప్పవస్తుందే! అసలు భోజనం మనిషికెంత ముఖ్యం అంటే..." అంటూ ఏదో చెప్పబోతున్న ధోరణికి రాములు బెదిరిపోయి —

"అయ్యబాబోయ్ ! నాకు సైన్స్ పాఠాలు చెప్పొద్దండీ ! నే పోతున్నా ! మీరు హెడ్మాష్టారి దగ్గరకు వెళ్ళండి !" అంటూ పారిపోయాడు.

రాములు బెదిరిపోయిన తీరుని చూసి, తనలో తానే నవ్వుకుంటూ హెడ్మాష్టారు పంపిన చీటిని చదివాడు విశ్వపతిరావు.

హెడ్మాష్టారికి, .

మా పిల్లలు మీ స్కూల్లో ఎనిమిదోక్లాసు చదువుతున్నారు. మీ స్కూల్లో విశ్వపతిరావు అనే సైన్స్ మాష్టారు ఉన్నాడట. ఆయనేవో పిచ్చి పిచ్చి సైన్స్ కబుర్లతో మా పిల్లల మెదడును పాడుచేస్తున్నాడని తెలుస్తోంది. మా పిల్లలు సైన్స్ మాష్టారి వద్ద నేర్చుకొన్న పాండిత్యాన్ని మా మీద ప్రయోగించి, మాకు పిచ్చి ఎక్కేట్లు చేస్తున్నారు. ఇలా పిచ్చి కబుర్లు చెప్పే ఆ పిచ్చి పంతులు ఇకనైనా బుద్ధిగా అసలు పాఠాలు చెప్పకపోతే...ఆయనకు మేమంతా కలిసి బుద్ధి చెప్పాల్సి వస్తుందని చెప్పండి ! ఇలా ఓ మాష్టారి మీద కఠిన పదజాలాన్ని ఉపయోగించవలసి వస్తున్నందుకు మాకూ చాలా బాధగానే ఉంది. సైన్స్‌ను పాపులర్ చెయ్యాలంటే పొద్దుట్నుంచీ ... రాత్రి దాకా సైన్స్‌ను మాట్లాడటం ఒక్కటే మార్గం కాదని మీ మాష్టారితో చెప్పండి. విజ్ఞానాన్ని సవ్యంగా బోధించాలనేదే మా విజ్ఞాపన !

ఉత్తరాన్ని పైనించి క్రిందకు నాల్గైదు సార్లు చదివాడు. వళ్ళంతా చమటలు పట్టాయి. కళ్ళు తిరిగినట్లు అయి కుర్చీలో కూలబడ్డాడు. కుర్చీ చప్పుడికి విశాల గబ గబా ముందు గదిలోకి వచ్చింది. బేలగా కుర్చీలో కూర్చున్న భర్త చేతిలోని కాగితం తీసికొని చదివింది.

ఉత్తరం చదివి, విశాల భయం భయంగా భర్తను చూస్తూ "ఏమండీ చూశారా ? నేను చెప్తే మీరు విన్నారు కాదు ! ఏదయినా అతిగా ఉండకూడదండీ ! ఇకనయినా మీ సైన్స్ ప్రసంగాలు మానండి ! మీకేమయినా అయితే... నేను ఏమయిపోవాలండీ !" అంది విశాల.

"మారక తప్పుతుందా..." అన్నట్లుగా విశాల కళ్ళలోకి చూశాడు విశ్వపతిరావు. ★



# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## వైస్ చాన్సలర్ దృఢ సంకల్పం :–

ఉస్మానియా విశ్వ విద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ సైయద్ హాషిం అలీ ఆగస్టు 7 వ తేదీన పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, డిటెన్షన్ పద్ధతిని గురించి ప్రకటించిన భావాలను విద్యాభివృద్ధిని, విద్యా ప్రమాణ పరిరక్షణను కాంక్షించేవారు హర్షించక తప్పదు. డిటెన్షన్ ఉండాలనడం ఎంతో న్యాయమనుకుంటాను; ఏదో దుర్బుద్ధితో జరిగే వాటిని ఎవరూ సమర్థించరనుకోండి. చదువు ఉద్దేశం ఏమిటి? చదువని వాడజ్ఞుండగు, చదివిన సద సద్వివేక చతురత గలుగున్ – అంటుంది భాగవతం. జ్ఞానం, సద సద్వివేకం చదువు పరమార్థం. కాపీ కొట్టి, పంతుళ్లను బెదిరించి, ఉత్తర దక్షిణాలు చెల్లించి సంపాదించే చదువనే సర్టిఫికెటు విలువేమిటి? జ్ఞానమూ రాదు, సద సద్వివేకమూ కలుగదు. అలాటి సర్టిఫికెట్లవాళ్లే అలాటి పద్ధతితోనే ఉద్యోగాలు సంపాదించడం, అలాటి వారు చేపట్టిన ప్రతి పనీ పాడుకావడం లోక విదితం. అలాటివారు తమకు, దేశానికీ ఏం మంచి పేరు తేగలరు? దేశం సంగతి దేవు డెరుగు. తమకైనా ఏమి చేసుకోగలరు? అజ్ఞాని సద సద్వివేక రహితుడు ప్రతి దానికీ ఇతరులపై ఆధారపడవలసి ఉంటుంది. అలాటి పర ప్రత్యయనేయ బుద్ధికి సంఘంలో ఎలాటి పరపతి ఉంటుందో అందరికీ తెలిసిందే. ఇలాటి దుస్థితి తొలగాలంటే, అట్టడుగు-నుంచే ప్రయత్నించాలి కదా! అంటే, ఓనమాల-నుంచే జరుగాలి. చదువు జ్ఞానం కోసం, కేవలం పరీక్షలలో కడతేరడానికి కాదు. మంచి చెడు తెలుసుకొని సత్ప్రవర్తనతో జీవిక గడపడానికే కాని, బారా బంగాళీ విద్యలు చేసి ధన మార్జించడానికి కాదు – అనే భావం పసి వారి మనసులో వేళ్లు తన్నుకోవాలి. ఆ దోహదంతో, అలాటి సంస్కారంతో పైకి వచ్చినవారే తమకు, తమ వంశానికి, తమ దేశానికి, ప్రపంచానికి ఏమైనా చేయగలరు. మరి పక్క దారి పట్టినవారు, అడ్డదార్లు తొక్కినవారు ఎంతో వైభవంతో ఉండడం చూస్తున్నాముగదా – అనవచ్చు. నిజమే. కాని, వైభవంకన్నా సంస్కారం ముఖ్యం. సంస్కారవంతులే శాశ్వతమైనది చేయ-గలరు. దేశాన్ని ముందుకు నడిపించగలరు. ఈ దృష్టితో ప్రతి విద్యార్థి విద్యార్జన చేయాలి. చదివి సాధించాలని నిశ్చయించుకోవాలి కాని, అడ్డ-దారులతో దూసుకుపోదామని భావించరాదు. మూక బలంతో సాధిస్తామనుకోడం మంచి పద్ధతికాదు.

ఇటీవల విజయవాడ మెడికల్ అసోసియేషన్ హాలులో జరిగిన "శిశుపోషణలో స్త్రీ పాత్ర" పుస్తకావిష్కరణ సందర్భంగా కృతి కర్త డాక్టర్ పి. వి. సుబ్బారావుని అభినందిస్తూ ప్రసంగిస్తున్న విజయవాడ ప్రభుత్వ వైద్యశాల సూపరింటెండెంట్ డా. టి. శ్రీనివాసన్.



## ఎనిమిది లక్షల దొంగ రేషన్ కార్డులు :

రెండు రూపాయల కిలో బియ్యం బట్వాడాకు సంబంధించిన ఎనిమిది లక్షల దొంగ రేషన్ కార్డు-లను ఏరివేశామని పౌర సరఫరా శాఖ డైరెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్ పత్రికల వారికి తెలిపినప్పుడు ఆశ్చర్యమేమీ కలుగలేదు. జంట నగరాల జనాభాలో సగ భాగమైనా దొంగ కార్డు లుంటాయని అను-కున్నాము. ఎనిమిది లక్షలు ఫరవాలేదు – అన్నాడు సహ పత్రికా రచయిత ఒకరు. అవినీతికి హద్దు-లంటూ ఉన్నాయా? మనం ఎంత పతనావస్థలో వున్నామో ఇదొక తార్కాణ. రెండు రూపాయల కిలో బియ్యం పథకం 1983 ఏప్రిల్ నుంచి అమలు పరచగానే, కోటి 8 లక్షల కుటుంబాల పేర కోటి ఎనిమిది లక్షల ఆకు పచ్చ రేషన్ కార్డులు, 27 లక్షల పసుపు పచ్చ రేషన్ కార్డులు బట్వాడా చేశారు. ఆకు పచ్చ కార్డుల సంఖ్య ఎక్కువగా ఉన్నట్టు తేలిన తర్వాత, పౌర సరఫరా శాఖ తనిఖీచేసి, చాల దొంగ కార్డులను పట్టుకుంది. తనిఖీ చేసిన తర్వాత తేలిన అసలైన పచ్చ కార్డుల సంఖ్య 96 లక్షల 43 వేల, 554. పసుపు పచ్చ కార్డుల సంఖ్య 31 లక్షల 91 వేల 635. ఈ వంచన ప్రవృత్తి దేశమంతా ఉంది. తమిళ-నాడు ముఖ్యమంత్రి కీర్తిశేషుడు శ్రీ అణ్ణాదురై రేషన్ కార్డుల మోసం గురించి స్వానుభవం చెప్పారు ఒకసారి. ముఖ్యమంత్రి అయిన తర్వాత రేషన్ కార్డుల తనిఖీకోసం అధికారులు ఆయన ఇంటికి వచ్చారట. భార్య అతనిని లోపలికి పిలిచి మరి ముగ్గురిని ఎక్కువగా వ్రాయించండి. ఇంటికి వచ్చే-వాళ్లూ పోయేవాళ్లూ ఎక్కువగా వుంటారు – అన్నదట. మన కెందుకే ఆ పని? బియ్యానికి కొరతేమీ వుండదులే – అన్నా డతను. ఎంత వెర్రి వాళ్లండీ మీరు! పొరుగింటివారూ ఎదరింటి వారూ, అలాగే చేస్తున్నారు. వారు పది పది మందిని కార్డులో చేర్చుతున్నారు. మనం ముగ్గురినేగా చేర్చు-తూంట – అన్నదట. ఈ అవినీతి ప్రతి ఇంటా నీడ వలె వెన్నాడుతూంది – అన్నారు ఆయన. నీతీ నిజాయతీ దృష్టి మనకు ప్రతి విషయంలో వుండాలి. మనల్ని చూచే మన పిల్లలూ ప్రవర్తిస్తారు. కనుక మన బాధ్యత మరీ గురుతరమైంది.

## ఉపశ్రుతి :

డిస్కో డ్యాన్స్ నేర్చుకుందామని ఉంది సార్. మంచి టీచర్ను సూచిస్తారా? – అనడిగారు ఒక డిస్కో ప్రియుడు. టీచర్లు ఎందుకండీ? కోఠీనుంచి సికిందరాబాదుకు వెళ్ళే 86 వ నెంబరు బస్సులో ముచ్చటగా మూడు రోజులు ముప్పూటలా ప్రయాణం చేయండి. ఒక్క డిస్కో డ్యాన్సే కాదు. అటు జిమ్నాస్టిక్స్, ఇటు హఠ యోగమూ కూడా అలవోకగా అబ్బుతాయి – అన్నారు మా మాటలు వింటున్న ఒక అనుభవజ్ఞులు.

–తిరుమల రామచంద్ర

## కార్టూన్లు పంపేవారికి మనవి

కార్టూన్లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు పెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-3. అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్లు 'టపా'లో పోయినా, దారి తప్పిపోయినా సంపాదకుని బాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈ కార్టూన్లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.

# ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

## విదేశంలో దుబాషి

దుబాషిగారి ఏథెన్సు యాత్ర విజ్ఞానంగా వుంది. ప్రపంచంలో ప్రజాస్వామ్యానికి రూపునిచ్చిన దేశం అది. ఆ సిటీ స్టేటు గూర్చి తెలియనివారు అరుదు. సొక్రటీసు శిష్యుడు ప్లాటో. ప్లాటో, అరిస్టాటలు వీరి ముందు అలగ్జాండరు చిన్నప్రాణి. అలాంటప్పుడు మేసిడోనియా రాజు అలగ్జాండరు శిల్పం అచ్చట ఏలా ప్రాధాన్యత పొందగలదు. ప్లాటో భారత దేశంలో కూడా సంచరించినట్లు వూహాగానాలున్నాయి. ఆర్య సంస్కృతికి ఏథెన్సు నాగరికతకు సంబంధాలున్నాయి. ప్లాటో వూహారాజ్యాధిపతి లభించలేకనే ఎన్నివిధాల శాస్త్రాధ్యయనం చేశారు. ప్రజాస్వామ్యం చేతిలో తన గురువు సొక్రటీసు కారాగారం పాలుకాగా ఆ పొరబాటు అన్వేషానికి దేశాలు తిరిగి ఒక రాజకీయ శాస్త్రానికి ప్రపంచానికి సరియైన ప్రజాస్వామ్యం యివ్వడానికి, నిరంతరం కృషి చేశారు. తరువాత రోమనులు, యూరోపియనులు, రష్యనులు ఈలా అనేక ప్రపంచ దేశాలవారు ఆయన, ఆయన శిష్యుల బోధనలు పరిశీలించి నేటి సమాజాలకు బీజాలు వేశారు. అటువంటి పవిత్ర స్థలాన్ని శ్రీ దుబాషీగారు నిశ్చింతగా చూచేశారు. అలాంటి ప్రదేశాలు చూసేటప్పుడు మానవాళికి దాదాపు పాతిక శతాబ్దాల పూర్వం వారు చేసిన కృషిని స్మరించుకోవడం నమస్కరించడం మనకీ కనీస ధర్మం.

బి. యస్. రామారావు, తిరుపతి.

# అద్భుత వ్యక్తులు

(40వ పేజీ తరువాయి)

సహాయంతో ఎక్కడెక్కడ ఏ పీపా ఉందో అతి సునాయాసంగా చెప్పగలిగారు. ఈ కార్యక్రమాన్ని బిబిసి టెలివిజన్ వారు కూడా ప్రసారం చేసారు.

అతీంద్రియ మనో విజ్ఞాన శాస్త్రజ్ఞులు "డౌసింగ్ ప్రదర్శించే వ్యక్తి తప్పక క్లెయర్ వాయన్స్ శక్తి కలిగి ఉంటాడు. ఒక ప్రదేశంలో ఉండి మరో ప్రదేశంలోఏం జరుగుతూందో చెప్పగలిగినట్లే, భూమి పైన నిలుచుని భూమి కింద ఏమి ఉందో చెప్ప గలుగుతున్నాడు" అని అభిప్రాయం వెలుబుచ్చారు.

ఏది ఎలా ఉన్నా ఈ "డౌసింగ్"లో ఏమీ లేదని కొట్టి పడేయటానికి వీలు లేదు. అందులో "ఏదోశక్తి" ఉంది అనిపిస్తుంది. ఆ "ఏదో శక్తి"ని, విజ్ఞులు, శాస్త్రజ్ఞులు కనుగొని, కువిమర్శలకు తావీయక లోక కళ్యాణానికై వినియోగించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

(వైవారం : అతీంద్రియ శక్తుల సాధనలో చరిత్ర సృష్టించిన యూరీ గెల్లర్)

## ఆలోచించండి

ప్రతివారం పత్రిక చదువుతున్నాను – ప్రక్కన పిడుగుపడినా చలించం అన్నట్లు ఎంతో నిబ్బరంగా, నిమ్మళంగా సాగిపోతోంది పత్రిక నడక – ఎంతో ప్రశాంతంగా వుంటుంది. పత్రికని చేతిలోకి తీసుకుంటే – బి.పి.వెంచే సీరియల్స్- ఎవరన్నా చూస్తారు కాబోలు మనం ఈ సీరియల్ చదువుతున్నామన్న బెరుకు వుండనే వుండవు (ముఖస్తుతి కాదు). కానీ, కొట్టొచ్చినట్లు కనిపించే లోపం ఒక్కటే మినీ కథలు లేకపోవటం. అవి పత్రిక్కు ప్రాణం వంటివని నా అభిప్రాయం. ఒక్కసారి మీరూ కాస్త ఆలోచించండి. వాటి కొరత త్వరలో తీరుతుందని మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను.

కోలపల్లి ఈశ్వరరావు, నెల్లూరు.

## ఓ జ్ఞాపకం!

3-8-84 సంచికలో ప్రచురితమైన 'వృద్ధాప్యం నేరమా' అనే కథ చాలా బాగుంది. ఇలాంటి రచనలు ప్రస్తుత సామాజికులలో ప్రతి ఒక్కరూ ఆలోచనతో చదవాలి. ఈ సందర్భంలో ఓ చిన్న జ్ఞాపకాన్ని వివరిస్తున్నాను:

అమెరికాలో ఓ తండ్రి – ఆస్పత్రిలో ప్రసవ వేదన ననుభవిస్తున్న తన భార్యవద్దకు ఆరేళ్ల వయస్సున్న తన కుమారుని తీసుకు వచ్చి అక్కడ లేడీ డాక్టరుతో ఘర్షణ పడతాడు. ఆ డాక్టర్, కుర్రవాణ్ని లోపలికి రానివ్వనంటుంది. తండ్రి పట్టుదలగా వాదిస్తాడు, ఎలాగైనా తన తల్లి ప్రసవాన్ని ఆ బాలుడు విధిగా చూడాలని. ఈ విపరీతమైన అతని కోరికకు విస్తుపోయి ఆ డాక్టరు కుతూహలంగా అతన్ని అడుగుతుంది, ఎందుకు అంత పట్టుదల పడుతున్నావని. అప్పుడు చెబుతాడు, అతడు: "తన్ను భూమ్మీదకు తీసుకు రావడానికి ఆ తల్లి ఎంత వేదన ననుభవించిందో ఆరేళ్ల వయసున్న ఈ అబ్బాయి ప్రత్యక్షంగా చూస్తే – తన జీవితమంతాం-తమూ ఆ తల్లికి ఎంత ఋణపడి వుండాలో గ్రహిస్తాడు!" అని. అతని వాదనలో ఇమిడి వున్న మానవతా విలువలకి ఆ లేడీ డాక్టరు సంతోషించి ఆ బాలుణ్ని లోపలికి తీసుకు వెడుతుంది. 'ఒరు మహన్ పార్త ప్రసవమ్' (ఓ కొడుకు చూసిన ప్రసవం) అనే శీర్షికతో, తమిళంలో ఈ కథ ప్రచురించ బడింది. 'వృద్ధాప్యం నేరమా' చదివాక స్ఫురణకి వచ్చిన ఈ జ్ఞాపకాన్ని పాఠకులతోపంచుకోవాలని ఇది రాసేను.

బి. ఎస్. కె. సోమయాజులు, భువనేశ్వరం

## సవరణ

17-8-84 సంచికలో "హైదరాబాదు నోట్‌బుక్"లో శ్రీ దేవులపల్లి వేంకటేశ్వరరావుగారు జన్మించిన సంవత్సరం 1920గా గమనించగోరుతున్నాము. అచ్చు పొరపాటుకి చింతిస్తున్నాము. —సం


*Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawad' 3, Editor : S. Radhakrishna.*